

చంద్రగిరి రాజమహల్

—ఫోటో: ఎం. శ్రీనివాసన్]

# ఆంధ్రసచిత్రవారపత్రిక

| సంవత్సర చందా<br>రు. 13—0—0<br>విడిప్రతిక 25 న.పై | Founder: K. NAGESWARA RAO<br>విలంబి మాఘశుద్ధ బహుళ ద్వాదశి బుధవారం | సంపుటము 53<br>సంచిక 19<br>4-2-59 |
|---|---|---|


## విషయానుక్రమణిక

ముఖచిత్రం:

'ఢిల్లీ కా ఠగ్' చిత్రంలో

కిశోర్ కుమార్, నూతన్





# రాజధాని కబుర్లు

## మాస్కోకి టిటో మార్షల్ టిటో

మీరు రాజధాని పౌరులైతే—ఇక ధైర్యంగా ఊపిరి విడవచ్చు. మీరు ఆంధ్రప్రదేశ్ పౌరులైతే రొమ్ము విరుచుకొని గర్వంగా నిలబడచ్చు. యుగోస్లావ్ రాజ్యాధినేత మార్షల్ టిటో హైదరాబాదు వచ్చాడు వెళ్లిపోయాడు. అతడిక్కడ ఉండగా, ఎక్కడా, ఎప్పుడూ ఎలాటి ప్రమాదమూ రాలేదు.

మన రాజధానినగరంలో అతిథిగా అతనుంటేగా ఆపద వాటిల్లగలదని నేనుకాని, మీరుకాని భయపడామని కాదు. (ఈ వాక్యం సరిగా ఉందా? ఇలా అనచ్చా? ఎలాఅంటే మాత్రమేమిటి—మీ కర్థం ఐందికదా?) టిటో సింహళం వస్తున్నందుకు, తుపాకి గుండు దూరని అద్దాలుగల కారును సింహళ ప్రభుత్వం ప్రత్యేకం తెప్పించిందట. మన రక్షకభటశాఖ కూడా వెయ్యికళ్లతో చూసి అతన్ని కాపాడింది.

అసలు టిటో క్రిందటిసారి భారతదేశం పర్యటించినప్పుడు, హైదరాబాదు అతన్ని రానివ్వలేదు మన ప్రభుత్వం. బుల్గానిన్, క్రుశ్చేవ్‌ల విషయంలో కూడా ఇంతే జరిగింది. కమ్యూనిస్టులే కాదు, స్టీఫెన్ స్పెండర్, కోస్లర్ వంటి వారు మనదేశం వచ్చినా, హైదరాబాదు రావడం జరగదు.

ఇటువంటి లోపాలకు మనం కేంద్రప్రభుత్వాన్ని విమర్శించక తప్పదు. కాని ఆంధ్రప్రదేశ్ అంతరంగిక శాఖ, విద్యాశాఖ ఈ విషయంలో తమ బాధ్యతల్ని నిర్వర్తిస్తున్నాయంటారా? 'సమస్యలే లేకుంటే, పరిష్కార భారమే ఉండదు; మనుష్యులు పుట్టకపోతే, చచ్చిపోవడమనే ప్రశ్నే ఉండదు. ఏ రంగంలోనైనా పెద్దవాళ్ళు—వి. ఐ. పీలు—రాజధాని రాకపోతే, వాళ్లని కాపాడే బాధ్యతే మనకుండదు' అన్న దృక్పథం రాష్ట్రప్రభుత్వం విడనాడాలి.

'మాదేముంది? ఇటువంటి కార్యక్రమాలన్నీ కేంద్రం నిర్ణయిస్తుంది' అంటారు వీరు. నిజమే. కాని మనకి కూడా ఉత్సాహం ఉండాలిగా?

* * * *

ఈ వి. ఐ. పీలు వచ్చినప్పుడల్లా పోలీసుశాఖ పత్రికా ప్రతినిధులకి పాసులిస్తుంది. పాసులు ఎర్రగా, ముచ్చటగా చూడ కొట్టొచ్చినట్టుగావుంటాయి. పాసుపైన ఒక ఉన్నతోద్యోగి సంతకం ఉంటుంది. ఈ పాసు ఒకటి చేతపట్టి జనవరి 16వ తేది సాయంత్రం నిజాం కళాశాలకు చేరుకున్నాం. మొదటి గేటువద్దకు వెళ్ళాం. పాసుల వేపైన పట్టించుకో దలచుకోలేదు పోలీస్ కన్‌సేబిల్. 'రెండో గేటు' అన్నాడు స్పష్టంగా. రెండో గేటువద్ద మరో ఇద్దరో ముగ్గురో ఉన్నారు కింకరులు. వాళ్ళు 'మూడో గేటు' అన్నారు. మూడో గేటువరకు నడిచివెళ్ళి, ముళ్ళపొదల మధ్యనుంచి మెలికలు తిరిగిన దారివెంట నడిచివచ్చాం. ఆ మాయదారి దారి తిరిగి తిరిగి రెండో గేటు వెనక్కి తెచ్చింది మమ్మల్ని. కొత్తగా వచ్చిన వాళ్ళందర్నీ ఇంకా మూడో గేటు దిశ చూపించడంలో నిమగ్నులై ఉన్న పోలీసువాళ్ళ వీపులు మావైపు తిరిగి వన్నాయి వేళాకోళంగా.

అనవసరంగా అరమైలు దూరం నడవడం పూర్తైంది. రక్షకభట శాఖ ఉన్నతాధికారి సంతకంపై పోలీస్ కన్‌స్టేబిల్‌కి మరికొంత గౌరవం ఉంటే బాగుండుననిపించింది.

* * * *

నిజామ్ కళాశాల ఆవరణలోనుండి స్పోర్ట్స్ పెవిలియన్‌వద్ద సమావేశం జరిగింది. టిటోను చూడాలన్న కుతూహలంతో ప్రజలు వేనకువేలు విచ్చేశారు. టిటోలు - భార్యాభర్తలు - వచ్చే మార్గం అంతా అలంకరించబడింది. భారత యుగోస్లావ్ పతాకాలు అలంకరించాయి మార్గాన్ని. నిజాం కళాశాలకు వెళ్ళేదారికి అటూ ఇటూ ప్రజలు బారులుతీర్చి నిలబడ్డారు.

స్పోర్ట్స్ పెవిలియన్‌వద్ద జరిగిన సమావేశంలో మార్షల్ టిటోకి జంట నగరపాలక సంఘాలు సన్మానపత్రం సమర్పించాయి. వచ్చీరాని ఇంగ్లీషులో తడబడుతూ సమాధానం ఇచ్చాడు మార్షల్. అతడు ఆ విధంగా తడబడ్డం చాలా సహజంగానూ, సముచితంగానూ ఉంది. యుగోస్లేవియాకి ఇంగ్లీషు రాజభాష కానప్పుడు, ఆ భాషలో మాట్లాడుతూ తడబడడం సహజమే! అంతకుముందు పౌరసన్మానపత్రం చదివిన జంటనగరాల మేయర్లు శ్రీయుతులు కృష్ణస్వామి ముదిరాజ్, నారాయణస్వామి హిందీలో, తెలుగులో తడబడుతూ చదివారు. అందువల్ల టిటో తడబడ్డం సముచితం!

* * * *

మార్షల్ టిటో చరిత్ర పరిశీలిస్తే, అతను తడబడే మనిషి కాదని తెలుస్తూంది. అతన్ని గురించి తెలిసిందే అంత. 1892వ సంవత్సరం మేనెలలో జన్మించాడతడు—అంటారు. 13, 14 సంవత్సరాల క్రితం న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రిక ప్రత్యేక విలేఖరి ఒకడు వ్రాస్తూ—'ఈ టిటో సంగతి ఎవరికీ అంతుపట్టడం లేదు. ఇతని పేరు టిటో కాదు. జోసెఫ్ బ్రోజ్ అయ్యుండవచ్చు'—అని వ్రాశాడు. పత్రికావిలేఖరులందరిలో అతను కొంచెం బాగా తెలుసున్నవాడు అంటారు.

### టిటో ఏమిటిటి?

అసలు టిటోకి ఈ పేరెందుకొచ్చింది? విదేశీయుల ఊహాగానాలు వినండి: (1) ఇంకో టిటో ఉన్నాడు, అతడు చచ్చిపోతే ఇతడా పేరు పెట్టుకొన్నాడు. (2) అబ్బెబ్బే! లేదు. టిటో అన్నది ఒక ఆడపిల్ల పేరు. రహస్యంగా యుద్ధం చేసే రోజులలో ఆ ఆడపిల్ల పేరు పెట్టుకొన్నాడు. (3) ఊహుఁ కాదు. టిటస్ అని రోమన్ చక్రవర్తి; అతనిపై గౌరవంకొద్దీ తన పేరు టిటో చేసుకున్నాడు (4) రోమన్ చక్రవర్తి కాదు. సెయింట్ టిటస్ అనే యోగి ఉండేవాడు. అతని మీద గౌరవంతో ఈ పేరు పెట్టుకున్నాడు. (5) 'నా మాట విను' అనడానికి అతని మాతృభాషలో ఉపయోగించే ధ్వనులు కొంచెం దగ్గరగా 'టిటో' లా పలుకుతాయి. అందుకొచ్చిందా పేరు.

★ "ప్రవీణ్" ★

#  రాజధాని కబుర్లు 

స్టాలిన్‌కి ఆపేరు ఎందుకొచ్చిందో అందరికీ తెలుసు. కాని టిటోకి ఆపేరు ఎలా వచ్చిందో ఈనాటికీ ఎవరూ గట్టిగా చెప్పలేరు. అదే స్టాలిన్‌కి టిటోకి తేడా. రష్యాకీ యుగోస్లావియాకీ తేడా. ఒకరినిగురించి. ఒకదేశాన్నిగురించి మనకేమీ తెలియదనుకుంటాం. కాని చాలా తెలుసు. రెండోవారినిగురించి, రెండోదేశాన్నిగురించి చాలా తెలుసుననుకుంటాం. కాని ఏమీ తెలియదు.

1943లో ప్రపంచయుద్ధం ముమ్మరంగా సాగుతున్నరోజులు. యుగోస్లావియా నాయకత్వం చీలింది. ఆ సమయంలో చర్చిల్ టిటోను బలపరిచాడు. యుగోస్లావియాని 'టిటోలాండు'అన్నాడు. అప్పట్లో శనిగాడొచ్చి జర్మనీతో పోటాడుతానంటే, 'శని చాలా మంచివాడు' అనేపరిస్థితిలో ఉన్నాడు చర్చిల్. [అంటాడు జాన్ గంథర్] చర్చిల్ బలంలేకపోతే టిటోపరిసితి వేరుగాఉండేది.

ఒకసారి చర్చిల్ కొడుకు రేండల్ఫ్ చర్చిల్‌కి యుగోస్లావియాలో ఏదో సమాచారం కావలసి వచ్చింది. ఎవరూ సహకరించలేదు. చివరికి టిటోకి టెలిగ్రామ్ ఇచ్చాట్ట. టెలిగ్రామ్‌లో చివర 'నే నెవరో నీకు తెలుసుగా?' అని చేర్చాడుట. వెంటనే టిటో తిరుగు టెలిగ్రామ్ ఇచ్చాట్ట: "ఓ. తప్పకుండాను. విల్ ఆలీవర్‌కి మాజీ బావమఱదివి' అంటూ. ఈ కథ నిజమని గట్టిగా చెప్పలేం. కాని టిటో శీల పరిశీలనంలో ఉపయోగపడుతుంది ఈ కథ.

టిటోకి మాస్కోకి ఉన్న కలహం అందరికీ తెలిసిన విషయమే. ఇటువంటి పరిసితిలో 'మాస్కోకి డిటో మార్షల్ టిటో' అంటే మీరందరూ నవ్వుకుంటారు. కాని ఎన్ని దెబ్బలాటలున్నా, టిటో కమ్యూనిస్టు, వ్యక్తి రాజకీయ స్వాతంత్ర్యానికి విలువనివ్వని కమ్యూనిస్టు సిద్ధాంతానికి ఒడబడినవాడు. రష్యా అడుగుజాడల్లో నడిచే యూరోపియన్ దేశాలన్నింటిలో 'ప్రజాస్వామ్య' ప్రభుత్వాలు అమల్లో వున్నాయి. రష్యా తరహా ప్రభుత్వం యుగోస్లావియాలో మాత్రమే అమలోవుంది.

'స్టాలిన్ ఒక ఎగు టిటో మరో ధగు. ఇందులో ఒకరు మంచి ఒకరు చెడ అనడానికి వీల్లేదు' అన్నాడు కార్మికపక్ష ప్రభుత్వంలో విదేశాంగమంత్రి ఎర్నెస్ట్ బెవిన్ ఒకసారి. చర్చిల్ అల్లా అభిప్రాయపడలేదు. అలా అభిప్రాయపడ్డం దూరదృష్టికి చిహ్నంకాదు. కాని రష్యాను ఎదిర్చాడు కదా అని టిటోను ప్రజాస్వామ్యవాది అనటంకూడా పొరపాటే.

* * *

## నాట్యసంఘం ఉత్సవాలు

ఈవారం నాట్యసంఘం ఉత్సవాలలో పేర్కొనదగిన అంశం శ్రీమతి కమలాలక్ష్మణ్ భరతనాట్య ప్రదర్శన. ఆమె, కుమారి రాధ కలిసి, విడివిడిగాకూడ, రెండురోజులు ప్రేక్షకులను తన్మయులను చేశారు.

ఈ భరతనాట్య కార్యక్రమంలో ప్రదర్శించబడిన అంశాలన్నీ బాగున్నాయి. కాని ముఖ్యంగా పేర్కొనదగింది శ్రీమతి లక్ష్మణ్ నాగిని నృత్యం. 'కృషలీలలు' కూడా బాగానే ఉంది. కాని— ఆమె నృత్యాన్ని ప్రశంసించడానికికూడా నాకు అర్హత లేదు. నాకు తెలిసింది ఒక్కటే: ఆమె తను మురిసి, ప్రేక్షకులను మురిపించింది. ఈ ప్రదర్శనలను ఏర్పాటు చేసినందుకు నిర్వాహకులను అభినందించాలి.

నాట్యసంఘం వారిని అభినందించలేని ప్రదర్శనం వల్లరామమూర్తి బృందంవారి 'పామర సావిత్రి'. ఈ ప్రదర్శనను గురించి ఇంతకంటె ఎక్కువగా వ్రాయడలేను.

* * *

## యూనివర్సిటీ బస్సులు:

ప్రభుత్వ కార్యనిర్వహణ కేంద్రానికి ఎంత దూరంలో ఉంటే అంత మంచిదని కాబోలు నగరానికి దూరంగా నిర్మించబడ్డాయి ఉస్మానియా విశ్వవిద్యాలయ భవనాలు. ఉస్మానియా బిల్లు విశ్వవిద్యాలయాన్ని ఎలాగు ప్రభుత్వశాఖగా చెసేసింది. చివరకు మిగిలింది విద్యార్థుల ఇక్కట్లు.

పూర్వం ఆర్. టి. డి కొన్ని బస్సులను ప్రత్యేకంగా విశ్వవిద్యాలయ కేంద్రస్థానానికి నడిపేది. ఉదయం తిరిగి వచ్చేటప్పుడు, సాయంత్రం వెళ్ళేటప్పుడు బస్సులు ఖాళీగా తిరిగి రావలసి వచ్చేది. అందువల్ల ఆర్. టి. డి. కి కలిగే నష్టాన్ని యూనివర్సిటీ భరించేది. కాని ఏ కారణం వల్లనో ఈ ఏర్పాటు ఉపసంహరించుకోబడింది.

తరువాత మొన్న మొన్నటివరకు యూనివర్సిటీయే బస్సులు నడిపింది. టిక్కెట్లు చౌకగా ఉండేవి. బస్సులు కూడా చౌకగానే ఉండేవి. ఆ బస్సులను ఎవరు తయారుచేశారో తెలియదుగాని, ఆడవాళ్ళు కూచోడానికి వీల్లేకుండాను, మగవాళ్ళు నిలబడానికి వీలేకుండాను నిర్మించారు. విద్యార్థులదగ్గరనుండి మామూలు రేటు తీసుకున్నా, అధ్యాపకులనుండి రెట్టింపు రేటు తీసుకునేవారు. లోపాలెన్ని ఉన్నా, సమయానికి విద్యార్థిబృందాన్ని కళాశాలలకు చేరవేసే అలవాటు ఈ బస్సులకుండేది.

ఆర్. టి. డి ప్రభుత్వ శాఖగా ఉండే రోజులలో విమర్శల వల్ల ప్రయోజనం ఏమైనా ఉండేదేమో? కాని అది ఇప్పుడు కట్టుబాట్లేమీ లేని స్వతంత్ర సంస్థ. యూనివర్సిటీకి రెండు మూడు నెలలనుంచి బస్సులు న-డు-స్తు-న్నా-యి. అంటే నడుస్తున్నాయన్నమాటే! కళాశాలల్లో విద్యాబోధనకి కొన్ని గంటలు, వేళలు ఉంటాయి. ఆ వేళకి పిల్లల్ని అక్కడికి చేర్చాలనే కట్టుబాటుకు ఆర్. టి. సి. సహించడం లేదు.

ఆర్. టి. సి లో విద్యార్థులకు కన్సెషన్ పాసులిస్తారు. ఈ పాసులు నిర్ణీతమైన మార్గం మీద నిర్ణీతమైన స్థలాల మధ్యనే చెల్లుతాయి. నారాయణగూడా వద్ద నిలబడ్డ విద్యార్థినీ విద్యార్థులు ఒక గంట దాదాపు నిలబడితేనేగాని బస్సు నిలబడి స్వీకరించదు. పాసులు నెల మొదట్లోనే కొనుక్కున్న విద్యార్థినులు, విద్యార్థులు హార్డికర్ బాగ్ నుంచి, హైదర్‌గూడా నుంచి నడిచి, రిక్షాల పైన బర్కత్ పురాచేరి అక్కడ మరో బస్సులో ఎక్కి పూర్తిపైకం చెల్లించుకుంటున్నారు.

ఇవీ మన రవాణా సంస్థ ప్రజలకు చేకూరుస్తున్న సౌకర్యాలు!

## 'నవ్యసాహితి'

రచయితల సహకార ప్రచురణ సంస్థను నెలకొల్పాలని నవ్యసాహితీ సమితి నిర్ణయించిందిట కేరళలో తప్ప మరెక్కడా ఇటువంటి ప్రచురణ సంస్థలు లేవన్నారు సమితి కార్యదర్శి శ్రీ పోతుకూచి సాంబశివరావు.

ఉద్దేశ్యం మంచిదేకాని, ప్రణాళిక ఎంతవరకు ఆచరణ

(54-వ పేజీ చూడండి)




# మత్తయ్ వ్యవహారంలో "కుమారి" అమృతకౌర్

భారత రాజధానిలో ఈ వారం సంక్రు మత్యా ఎం.ఓ. మత్తయ్ మిగుగా పోయాడు! ఎం. ఓ. మత్తయ్ ప్రధాని నెహ్రూ ప్రైవేట్ సెక్రటరీ. కమ్యూనిస్ట్ వారపత్రిక "న్యూఏజ్" వారం ప్రారంభంలో మత్తయ్‌ని దుయ్యపడుతూ ఒక వ్యాసం ప్రకటించింది. ఉద్యోగంనుంచి విరమించడానికి అనుమతి ఇవ్వవలసిందని ప్రధాని నెహ్రూకు ఆదివారం ఉదయం మత్తయ్ ఒక విజ్ఞాపనదాఖలుచేసుకున్నాడు. మంగళవారం ఉదయానికల్లా అతడి రాజీనామాను ప్రధాని నెహ్రూ ఆమోదించడంకూడా జరిగింది ఈ సంఘటనలన్నీ వరసవరసగా మెరుపులు మెరిసినట్లు జరిగిపోయాయి.

ఈ మత్తయ్ వ్యవహారంలోకూడా ఒక సుప్రసిద్ధ రాజకీయవేత్రి ప్రధాన భూమిక నిర్వహించిందంటే కొంతమందికి ఆశ్చర్యం వేయవచ్చు. ఆ రాజకీయవేత్రి ఎవరో కాదు! మన కుమారి అమృతకౌర్. ఈవిడ భారతప్రభుత్వంలో మొన్నటివరకూ ఆరోగ్యశాఖ మంత్రిణి. మామూలుగా అందరూ ఈవిణ్ని "రాజకుమారీ అమృతకౌర్" అనికదూ పిలుస్తారు! మనదేశంలో పాతకాలపు బిరుదులన్నీ తుడిచివేశాం కాబట్టి, అనాలనే "కుమారీ అమృతకౌర్" అంటున్నాను. ఇంతేగాక, ఈవిడ తండ్రి "రాజా సర్ హర్నంసింగ్" నామధేయంలోని "రాజా" బిరుదుకూడా కేవలం కల్పితమైనదే.

"కుమారీజీ" మత్తయ్ వ్యవహారంలో ఏమంటున్నారో తెలుసా?

(1) "నాకు చాలా ఏళ్లనుంచీ తెలిసిన కొంతమంది ఆప్తమిత్రులు కొన్నేళ్ళక్రితం ఆరులక్షల పైచిలుకు ఆస్తి నాకు స్వాధీనం చేయడం జరిగింది. ఈ నిధి నిర్వహణకు ధర్మకర్తల సంఘం ఒకటి ఏర్పాటుచేయడం మంచిదని తోచింది. ఎం. ఓ. మత్తయ్‌ని, కుమారి పద్మజానాయుణ్ణి ధర్మకర్తలుగా వుండవలసిందని ఆహ్వానించాను.

(2) ధర్మకర్తల సంఘం ఏర్పాటుచేసి నిధికి ఒక పేరు పెట్టడంలో బాధ్యత పూర్తిగా నాదేనని అంగీకరిస్తున్నాను. భారత స్వాతంత్ర్యానికి ప్రాతినిధ్యం వహించగల ఒక అజ్ఞాతమహిళ తరఫున ఈ నిధికి నామకరణం చేయడం ఉత్తమమని తోచింది. ఈ విధంగా ఒక అజ్ఞాతమహిళ పేరుతోనే నిధిని స్థాపిస్తున్నందుకు భారతమహిళనైన నేను నిజంగా ఎంతో గర్విస్తున్నాను.

(3) నాకు చిరకాలంగా స్నేహితులైన ఒకవ్యక్తి ధర్మకర్తృత్వ ఆస్తికి ఒక గృహాన్ని సమర్పించడం జరిగింది: ఇలు చాలా పాతదైనందువల్లా, శిథిలావస్థలో ఉన్నందువల్లా దీనిమీద అద్దెరూపంలోవచ్చే నెలసరి రాబడి రు 189 ల 6 నయాపైసలుమాత్రమే. పేరుకు పెద్దఇల్లేగాని, ఆర్థిక దృష్ట్యా చూస్తే దీనికి చెప్పుకోదగిన పెట్టుబడివిలువ ఏమీ లేదని చెప్పాలి. ఈ కారణాలచేతనేమాత్రం సబబైనధర వచ్చినా ధర్మకర్తలసంఘం ఇల్లు అమ్మివేయడమే ఉత్తమం. నా ఉద్దేశం కూడా అదే."

ఈ వ్యవహారానికంతటికీ కుమారి అమృతకౌర్ పూర్తి బాధ్యత వహిస్తున్నది కాబట్టి వ్యవహారాన్ని కొంతవరకు తెరచి చూడకుండా, కొంత వ్యాఖ్యానం చేయకుండా వదిలివేయడం సముంజసం కాదు. తన ఇష్టం వచ్చినట్లు నిర్వహించటానికి వీలుగా ఆరు లక్షలరూపాయలనిధిని కుమారి అమృతకౌర్ పరంచేసిన ఆ ఉదారస్వభావులెవర్నది మొదటిప్రశ్న. కుమారి అమృతకౌర్ కేంద్ర ఆరోగ్యశాఖమంత్రిణిగా వుండగానే ఆ ఆస్తిని ఆమెపరం చేయడం జరిగిందా, లేక ఆపదవినుంచి విరమించిన తర్వాత జరిగిందా అన్నది రెండోప్రశ్న. ధర్మకర్తల సంఘం ఏర్పాటు చేయడానికి ముందు ఆనిధికి మత్తయ్ తల్లి పేరు పెట్టకపూర్వమే ఆ ఆస్తిని తనపరంచేసిన దాతలతో సంప్రతించడం జరిగిందా? ఎవరినోట వినబోయినా ఈ ప్రశ్నలే వినవస్తున్నాయి కాబట్టి నేను వాటిని ఇక్కడ ఉదహరిస్తున్నాను. బహుశా వచ్చే నెల పార్లమెంటులో కూడా ఇవే ప్రశ్నలకు సమాధానం ఇవ్వవలసిన అగత్యం ఏర్పడవచ్చు.

నిధికి మత్తయ్ తల్లిపేరు ఎందుకు పెటవలసి వచ్చిందో కుమారి అమృతకౌర్ వివరిస్తూ ఒక ప్రకటన చేసింది. దీని నామకరణ వ్యవహారమంతా యుద్ధంలో మరణించే ఒక అజ్ఞాత సైనికుడిపేరున యుద్ధస్మారకమందిరానికి నామకరణం చేసే ధోరణిలో జరిగిపోయింది. ఈ గౌరవస్థానానికి మత్తయ్ తల్లిపేరే ఎందుకు నిర్ణయించవలసి వచ్చింది?

# న్యూఢిల్లీ లేఖ

అజాతశత్రుకే కావలసివస్తే, తన కారు డ్రైవరు తండ్రి పేరునో, తన ఇంట్లో వంటవాడి తల్లి పేరునో నిర్ణయిస్తే ఇంకా బాగుండేది! ఇక్కడ చాలామంది అడిగే ఒక ముఖ్యమైన ప్రశ్న ప్రధాని నెహ్రూ ప్రైవేట్ సెక్రటరీ తల్లి పేరు ఎందుకు ఎన్నుకోవలసి వచ్చిందన్నదే.

తనపరమైన ఇంటి అస్తి విలువ విషయంలో కుమారి అమృతకౌర్ వాదన ఏమాత్రం సమంజసమైనది కాదు. భారత రాజధానిలో ఇంటి అద్దెల కంట్రోల్ చట్టం అమలులో వున్నదనే సంగతి మరచిపోకూడదు. శాసనరీత్యా 1939 అద్దె స్థాయినే ఆ చట్టం ద్వారా అమలు జరపడం జరిగింది. ఢిల్లీలో ఎవరైనా ఈ ఇంటిని 80 వేల రూపాయలకు కొనుక్కొని చూస్తారు. అయితే తొందరపడి అమ్మకానికి పెట్టారుగాని, కొంత నిలుపూ నిదానమూ చూపితే, ఇది ఇంటిని నాలుగైదు లక్షలకు ఎవరైనా నిక్షేపంలా కొనుక్కునే వారేనని ఇక్కడ చాలామంది అభిప్రాయపడుతున్నారు.

ఏమైతేనేం, ఈ వివాదం సమసిపోయేలోగా కుమారి అమృతకౌర్ అనేక రకాల ప్రశ్నలను ఎదుర్కోవలసి వచ్చేమాట మాత్రం ఖాయం.

* * *

బ్రిటిష్ మాజీ ప్రధాని లార్డ్ అట్లీ మహమ్మదాలీ జిన్నామీద తన అభిప్రాయాలు ప్రకటించి ఒక చిన్న దుమారం లేవదీశాడు. ఫీల్డుమార్షల్ వైకౌంట్ మాంట్ గోమెరీ తన "మెమాయర్స్" అనే గ్రంథంలో జిన్నా విషయమై ప్రకటించిన అభిప్రాయాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను:

"భారతదేశంలోని హిందూ ముస్లింపక్షాల రాజకీయ అధినేతల మనస్తత్వాలను, ధోరణిని తెలుసుకుందామనే గాఢాభిలాష కలిగింది నాకు. నేను అంతకు ముందెప్పుడూ నెహ్రూను చూడలేదు. అదే మొదటసారి కలుసుకోవడం. ఆయనది చాలా ప్రశాంతమైన స్వభావం; ఆత్మవిశ్వాసం కలిగిన వ్యక్తి; కొంచెంసేపు ముచ్చటిస్తే ఆయన చతురతగల ధోరణి కూడా అవగతమవుతుంది. మొత్తంమీద నెహ్రూతో వ్యవహరించడం తేలిక. మాటవరసకు కొద్దికాలంలోనే మేమిద్దరం ఆప్తస్నేహితులుగా మారిపోయాము. నెహ్రూ లాంటి వ్యక్తిని అభిమానించకుండా వుండటం అసంభవం. మహమ్మదాలీ జిన్నా మనస్తత్వం ఇందుకు పూర్తిగా భిన్నమైనది. ఎపుడూ ఉద్రిక్త వాతావరణంలో వుండటం ఆయన స్వభావం. హిందువులంటే తనకున్న అపారద్వేషాన్ని జిన్నా ఎన్నడూ దాచలేదు, బహిరంగంగా

(64 వ పేజీ చూడండి)



## ★ రాజకుమార్ ఫిలిప్ ★

“మనిషిని స్వతంత్రుణ్ణి చేయటానికే శాస్త్రవిజ్ఞానం ఉపయోగపడాలిగాని బానిసని చేయటానికి కాదు. మానవుడు కొత్తగా కనిపెట్టిన వస్తువునైనా, ఏ విషయాన్నయినా మంచికిగాని చెడుకిగాని దేనికైనా ఉపయోగించటానికి వీలున్నది. కాని చివరకి దేనికి ఉపయోగించాలి అని నిర్ణయించేది ప్రజలే. అందుచేత శాస్త్ర పరిశోధన ఫలితాలను ప్రజలలో బాహాటంగా ప్రచారం చెయ్యాలి. అప్పుడే శాస్త్రవిజ్ఞానం సరైన పద్ధతిలో వినియోగపడేట్టు ప్రజాభిప్రాయం బలీయంగా రూపొంది తన ప్రభావం చూపించగలదు” అని రాజకుమార్ ఫిలిప్ భారతీయ సైన్సు కాంగ్రెసు వార్షిక సమావేశంలో ఉదాటించారు.

రాజకుమార్ ఫిలిప్ భారతదేశంలో రెండు వారాలపాటు పర్యటిస్తున్నారు. భారతదేశానికి ఇదివరలో బ్రిటిషు రాజకుటుంబీకులు రాకపోలేదు. కాని స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత వచ్చిన మొదటి రాజకుటుంబీకుడు ఈయనే. కేవలం బ్రిటిష్ రాణి భర్తగా, ఎడింబరో ప్రభువుగా కాక రాజకుమార్ ఫిలిప్ స్వయంగా బహుముఖ వ్యాపకాలు, అభిరుచులు, ప్రజ్ఞాప్రాభవాలుగల వ్యక్తిగా కూడా ప్రసిద్ధులయ్యారు. ప్రజాహిత సంస్థలనేకానికి రాజకుమార్ ఫిలిప్ ఎన్నో విధాలుగా సహాయంచేశారు. అనేకసంస్థల కార్యక్రమాలలో స్వయంగా పాల్గొని కష్టపడి పనిచేశారు. భారతీయ సైన్సు కాంగ్రెసు సమావేశానికి ఆయన హాజరైనది బ్రిటిష్ శాస్త్రజ్ఞుల ప్రతినిధిగానే. శాస్త్రవిజ్ఞానంలో ఆయనకుగల ఆసక్తిని గుర్తించే ఢిల్లీ విశ్వవిద్యాలయం ‘డాక్టర్ ఆఫ్ సైన్స్’ అనరరీ డిగ్రీని బహూకరించింది. బ్రిటిష్ శాస్త్రజ్ఞుల పరిషత్తుకు ఈయన ఒక ఏడు అధ్యక్షుడుగా పనిచేశారు. అయినా తాను శాస్త్రజ్ఞుణ్ణి కాననీ, కేవలం ఆసక్తి మాత్రం ఉందని ఆయన చెప్పుకున్నారు. అది ఆయన వినయాన్ని సూచిస్తుంది.

భారతదేశంపై బ్రిటిష్ ఆధిపత్యం తొలగిపోవటంతో ఉభయదేశాల మధ్య స్నేహసంబంధాలేర్పడి ప్రవర్ధమానమవుతున్నాయి. రాజకుమార్ ఫిలిప్ ఈ దేశానికి రావటం, ఆయనకు భారతీయులు అఖండ స్వాగతం ఇవ్వటం ఈ ఉభయదేశాల దృఢమైత్రికి నిదర్శనం. ★

# తప్పనిసరి అతిథి

## [నాటిక]

'శ్రీ విరించి'

[శ్రీరాములు: భర్త; శారద: భార్య; కుటుంబయ్య: అతిథి]

*  *  *

శా: ఏమండీ, ఆఫీసునుంచి యింటికి వచ్చేటప్పుడు కాఫీపొడి పంచదార పట్టుకు వస్తామన్నారు, వాటి చేతులలోనే వచ్చారేం?

శ్రీ: యింటికి వచ్చీరావడంతోటే గొడవ మొదలెట్టకు శారదా!

శా: నేనేం మాట్లాడినా మీకు గొడవగానే వుంటుందిగాని, రేపుఉదయం నిద్ర మంచంమీంచి లేచీ లేవడంతోటే కాఫీ కాఫీ అని కలవరిస్తేమటుకు నావల్లకాదు యిప్పుడే చెబుతున్నాను.

శ్రీ: కాస్త శాంతించు శారదా! నిదానంగా ఆలోచించి చెప్పు, యివాళ తారీకు ఎంత?

శా: యిరవై ఎనిమిది. అయితే?

శ్రీ: అవునామరి! అంచేతే నేను నువ్వు చెప్పినవన్నీ తేలేకపోయాను. పోనీలే, ఈ నాలుగు రోజులూ కాఫీమానేద్దాం. మనకేం తలనొప్పి రాదుగా!

శా: యిప్పుడు అనగానే సరాయేమిటి? రేపుఉదయం యీ విషయం మీకు గుర్తు వుండద్దూ? అయినా, ఉదయం మీ జేబులో రెండు రూపాయలనోటు వుండాలి. అది యేమయిపోయిందేం?

శ్రీ: అవును శారదా! ఆ రెండురూపాయల నోటే యీ నెలకు చివరినోటనికూడా నీకు చెప్పానుగా. అయితే ఆనోటు మరొకందుకు ఖర్చయిపోయింది.

శా: యేమిటండి మరీ అంతనాతో చెప్పకూడనిఖర్చు.

శ్రీ: నీతో చెప్పకూడదని కాదనుకో. ఒక స్నేహితుడు—

శా: ఊఁ...చేబదులుగా ఆ రెండురూపాయిలూ కాజేశారన్నమాట. యింక వాటికి తిలోదకాలేగా!

శ్రీ: అబ్బే. అలా ఎందుకవుతుంది? ఫస్టుతారీకున జీతం రావడంతోటే పువ్వులో పెట్టి మరీ యిచ్చేస్తానన్నాడు. పాపం, చాలా యిబ్బందిలో వున్నాడులే. అందుకని యిచ్చేశాను.

శా: అపర ధర్మరాజులు! మీ సొమ్మేం పోయింది! అడగనివాడిది పాపంగా దానధర్మాలు—తిన్నంతలో చేస్తూనేవుంటారు. అయినా యీ నాలుగురోజులూ మనం ఎలా గడుపుకోవాలనండీ మీ వుద్దేశం?

శ్రీ: అతని పరిస్థితి తెలిస్తే నువ్విలాఅనవు శారదా!

శా: యిప్పుడు మన పరిస్థితిమటుకు యేమంటారు? తినకుమాలిన ధర్మంచేసి తంటా తెచ్చుకున్నాంగద. అదేం కర్మమోగాని యిలా చేబదుళ్ళు అడిగేవాళ్ళేకాని తిరిగి యిచ్చేవాళ్లుమాత్రం కనిపించరు. మీకేమో వాళ్ళను ముఖాముఖిఅడగటానికి ముఖమాటం! చేతినిండా డబ్బువుంటే మీరు ఎన్ని చేబదుళ్ళు యిచ్చుకున్నా నాకేం అభ్యంతరంలేదుగాని, మరి రేపుఉదయమే కాఫీ మాట యేమంటారు?

శ్రీ: ఊరికే నన్నిలా సాధిస్తావుగాని శారదా! నెల నిండుగా రావడంకోసం తెచ్చిన సరుకులు నెల మధ్యలోనే ఎందుకయిపోయాయి? కాస్త వివరించు

శా: నేను చెప్పింది చెప్పినట్టు తెస్తే అసలు యీ గొడవ వచ్చేదేకాదు. వీసెడు వేస్తే అరవీసెడు, అరవీసెడువేస్తే సవాసేరు పట్టుకువచ్చారు అన్నిని. అక్కడికీ అవే సరిపెట్టుకోటానికి చూస్తున్నాను అందులోనూ మీకు రోజుకు ఒకసారి కాఫీ చాలదాయెను! ఎలా వచ్చేది?

శ్రీ: అంతంత లేని మాటలేం అనకు శారదా. యిప్పుడు వచ్చినప్రమాదం యేమీ లేదులే. రేపటినించి కాఫీ మానేస్తానంటూంటేని గదా!

శా: ఆ చోద్యంకూడా చూస్తాగా...

(తలుపుతట్టిన చప్పుడు)

శ్రీ: ఎవరు, శారదా?

శా: ఏమో నాకు మటుకేం తెలుసునండీ?

శ్రీ: అలా కోప్పడకు శారదా, యిలా అర్ధరాత్రిపూట ఎవరయి వుంటారా అని.

(తిరిగి తలుపు చప్పుడు)

శా: తీసి చూస్తే తెలిసిపోతుందిగా. ముందే ఊహాగానం ఎందుకు చెప్పండి.

శ్రీ: ఎవరూ? (తలుపుతెరిచిన చప్పుడు. ఒకవ్యక్తి లోనికివచ్చిన చప్పుడు.)

కొత్తవ్యక్తి: అమ్మయ్య. యిలు కనుక్కునేటప్పటికి తలప్రాణం తోకకు వచ్చిందనుకో శ్రీరాములూ—

శ్రీ: ఓహో. కుటుంబయ్య బాబాయా! ఎక్కడినించీ బాబాయి రావడం? యింటిదగ్గర అంతా కులాసాగా వున్నారా?

కు: యింటి సమాచారం నన్నేం అడక్కు శ్రీరాములూ! నేను యిలు వొదిలిపెట్టి మూడు నెలలయింది. ఆ ఊరూ యీ వూరూ తిరిగి తిరిగి చివరకు యిక్కడికి చేరుకున్నాను. ఆ కోర్టువ్యవహారం వుంది చూచావూ, అది తెమిలిచావదు, తెగిచావదు. ఈ గొడవలో తిరిగి తిరిగి ఎముకలు నాశనం అయిపోతున్నాయనుకో. ఆ! అమ్మాయీ—గాసెడు చల్లటి మంచినీళ్లు పట్టుకురామ్మా. యిక్కడ పంపునీళ్లా, నూతినీళ్లా అమ్మా!

శా: పంపునీళ్ళేనండీ. ఈ పేటలో ఎక్కడా నుయ్యన్నమాటే లేదు.

కు: ధంపేశావుగా. నూతినీళ్ళరుచి నువ్వు నెయ్యి చెప్పలతో చెప్పు—పంపునీళ్ళకు ధనీ రాదు. పోనీలే, యేదో నీళ్ళు, కాస్త గొంతు చలబరుచుకోటానికి.... అన్నట్టు, అమ్మాయీ—యీ రాత్రిపూట నువ్వు నాకోసం యేమీ ప్రయత్నం చెయ్యక్కర్లేదు. కాస్త మజ్జిగదాహం వుంటే యివ్వు, తాగి పడుకుంటాను.

శ్రీ: అదేమిటి బాబాయి, పరాయివాడిలాగ మాట్లాడుతావు. పాపం, పగలల్లా ఎక్కడెక్కడ తిరిగి వచ్చావో, యేమో—మా యింటికి వచ్చి రాత్రిపూట భోజనం మానివేయటమేమిటి? శారద నిమిషంలో వంట చేసేస్తుంది. ఈ లోపల నువ్వు యేమయినా కబుర్లూ విశేషాలు చెప్పు.

కు: యేదో నామీద అభిమానంకొద్దీ అలాగే అంటావనుకో శ్రీరాములూ, అయినా యిప్పుడు అమ్మాయి చెయ్యి కాల్చుకోవటం...

శా: ఫరవాలేదు మామగారూ. మా మీద ప్రేమకొద్దీ మాచిపోదామని వచ్చారు. ఆ మాత్రం మీ కోసం కష్టపడలేమా? అయిదు నిమిషాలలో భోజనం తయారుచేసి పిలుస్తాను.

(63-వ పేజీ చూడండి)

# సమర్పణ

## కందుకూరి లింగరాజు

(గతసంచిక తరువాయి)

"చలపతీ! నీకు ఉత్తరం వచ్చిందిరా" అంటూ మేనత్త రామలక్ష్మమ్మ సావిట్లోకి వచ్చింది. కవరు అందిస్తూ, "ఎవరిదగ్గర నుండిరా! ఇంటిదగ్గరనుండా! అందరూ క్షేమమేనా? అన్నగారు, వదినా ఉల్లాం నుండి వచ్చేరా? ఏమనివ్రాసేరు?......" ఆ వసరలో ఉత్తరం కనీసం చించనివ్వకుండానైనా ఉన్నప్పుడే ప్రశ్నలు కురిపించేసింది.

నవ్వుకున్నాడు చలపతి. అప్పుడే ఉత్తరంఇచ్చి, వెంటనే జవాబులు చెప్పమనడం బాగుంది! ఏ కర్ణపిశాచి అయినా వుండాలి ఆ తయ్యారు సమాధానాలు ఇవ్వడానికి.

"నవ్వుతా వెందుకురా! నా పిచ్చిప్రశ్నలను చూచేనా? అవునులే మాకాలాలు తీరేయ్! ఇప్పటి చదువువాళ్ళకు మేం తీసికట్టేగా! అయితే ఇంతకీ ఎవరువ్రాసేరో చెప్పేవు కావు?"

"బులిఅన్నయ్య" అన్నాడు.

ఉఫ్‌మంది ఒక్కసారి నిరాశగా. ఆవిడకు చాలారోజులనుండి సోమయాజులుగారివద్ద నుండి ఉత్తరం వస్తుందని, అందులో మేనకోడలు చిట్టమ్మనిగూర్చి అవీ ఇవీ అడుగుతారని, దాంతోర్వాత ఎల్లాగా మేం పెద్దవాళ్ళమయిపోతున్నాము, చలపతికి మేనరికంచేసే బావుంటుందనీ, దాన్నిగురించి మీరంతా ఏమి ఆలోచించుకున్నారనీ, మీకిష్టమయితే త్వరలోనే ముహూర్తం పెట్టించే ఏర్పాట్లు చేసామనీ వుంటుందని ఆశించింది. కాని ఆ ఉత్తరంవల్ల ఆశకన్న నిరాశే ఎక్కువ అయిపోవడంతో దిగాలు పడిపోయింది.

ఎంతగా ఇదామనివున్నా, ఆ అడగడం వాళ్ళవైపునుండి వస్తే, తనహుందా నిలబడుతుందని, పైగా వాళ్ళు గర్సాగర్సా పంపకాలు పెట్టుకున్నా, తనకు ఓ పుట్టెడు నేల ఎక్కువే అన్నది నిజంగా వుండడంవల్ల ఆ బిగింపు వదలించుకుని, ఎదురు తనాహంగా ముందుగా ఇన్నాళ్ళనుండి అడగలేదు. అడిగించనూలేదు-మధ్యవర్తులచేత.

ఇవన్నీ ఎలావున్నా, ఒక ధైర్యంమాత్రం రామలక్ష్మమ్మకు వుంది. దాన్నిబట్టే ఈ మొండి ధైర్యంకూడాను. నాల్గోక్లాసు నుండీ చలపతి తనవద్దవుండి పెదక్లాసులలోకి రావడంవల్ల, ఆ ఖర్చులన్నీ ఇంచుమించుగా తానే భరించడంవల్ల, పైగా కాంతతో రోజా వేళాకోళాలు చేస్తూవుండడంవల్ల చలపతి తన ఇంటివాడే అవుతాడు, ఆ అవసరంకూడా పుత్రసంతానంలేని కొరత తీర్చి ఇంటిఅలుడు, ఇలరికం వచ్చేస్తాడు అన్న ఆశాభావాన్ని వదులుకోలేకపోయింది.

"బులిఅన్నయ్య, నీకూ మామయ్యకు నమస్కారములు చెప్పమన్నాడు," అన్నాడు చలపతి.

"క్షేమంగా వున్నారా? ఉద్యోగంలో ఏమైనా ఓ మెట్టు పైకిఎక్కడా?" యధాలాపంగా అడిగింది.

"ఉద్యోగంలోంచి బర్తరఫు చేసేరుట."

"ఎంచేత?"

"కాంగ్రెసు వాళ్ళల్లో కలసి మెలసి తిరుగుతున్నాడని."

"మరి ఏం చేస్తాడుట?"

"సత్యాగ్రహంలో చేరిపోతున్నాడుట. ఒదిన, శచికూడాను."

"శచి,అదెప్పుడెళ్ళింది అక్కడకు? ఏం విడూరపు రోజులు దాపురించేయి? మూల ప్రక్కన పేనులా వుండవలసిన అదికూడా వెళ్ళడమే! ఇల్లాంటివి చూస్తున్నాం కనుక కలియుగం మూడుపువ్వులూ ఆరుకాయలుగా విజృంభిస్తోంది!" అని బుగ్గలు నొక్కుకుంది.

"అత్తయ్యా! అన్నయ్యని ఒక్క తాలూకా ఆఫీసు గుమాస్తాగానే ఉండి పొమ్మన్నావా?"

"మరి?"

"స్వతంత్రం రాకపోతుందా? అప్పుడు అదృష్టంవుంటే మంత్రే అవుతాడేమో!"

"ఆయన మంత్రిఅవడం, ఈవిడ మహా మంత్రిణి కావడమూ! ఏం వెలిగిపోతుందిరా! అయినాకాని, ఆడాళ్ళు ఓ పంచపడుండి కాలం వెళ్ళదీసుకోవాలికాని, ఇల్లా బరితెగించిపోతే. నీతి నియమాలు ఏమైనా వుంటాయా?"

వీధివాకిట్లో చెప్పులవాళ్ళు విడుస్తూనే గంగరాజు "ఎవరికీ నీతినియమాలు ఉంటాయా అంటున్నావు?" అని అడిగేడు...

కందువా చిలక్కొయ్యకు వేస్తూ;

"కాంతా! నాన్నగారు వచ్చేరు చెంబుతో నీళ్ళు పట్టుకురా కాళ్ళు కడుక్కోనేందుకు" అని ఓ పొలికేక పెట్టేసింది. కవాచీ బల్లమీద కూర్చుని, కాళ్లు మలదీసుకునేలోపుగా పూసగ్రుచ్చినట్టు ఏకరువు పెట్టేసింది రామలక్ష్మమ్మ విన్నదంతా.

ఒక్కసారి పక్కున నవ్వేడు గంగరాజు. చలపతికీ నవ్వు వచ్చింది కాని దాన్ని ముసిముసిగా లోలోపలే మింగేసేడు.

"అయితే భార్యాభర్తలిద్దరూ కలిసే శ్రీకృష్ణ జన్మస్థానం అలంకరిస్తారన్నమాట!" అన్నాడు గంగరాజు.

"సోమయాజులయ్యగారు ఈ వయస్సులో పురేసుకు వచ్చే సంఘటనలన్నీ వస్తున్నాయి. నిప్పులాంటి మనిషికేనా దదవట్టపం తప్పదుట!"

"ఇంతకీ ఏరా చలపతీ! మీ నాన్నకు కూడా ఈ విషయాలు వ్రాసేడా?"

"లేదనుకుంటా."

"అయితే నువ్వు వ్రాయి తన కొడుకుల ప్రభావాలు విని మురిసిపోతాడు!"

"ఏం తప్పుచేసేడని అన్నయ్యని అల్లా అంటావు?"

"తప్పా! తప్పున్నారా? కడుపులో గంజి కదలకుండా, రామాకృష్ణా అంటూ బ్రతికేవాడికి, స్వాతంత్ర్యం, కాంగ్రెస్ అంటూ ఈ అవలక్షణాలు ఏమిటి? పోని తను వెళ్ళేడు సరే అనుకుందాం. దాంతో పాటు ఆ రమణమ్మ! పోనీ అది తండ్రినోట్లోంచి ఊడిపడ్డది కాబట్టి సరే ఆయన లక్షణాలే వచ్చేయనుకుందాం! మరి ఈ శచి

ముంచేసి తీసుకువెళ్ళి ఇదిగో గంగలో ముంచడం ఎందుకంటా? ఇంతకంటే పతనం ఏమైనా వుందా? బావకి తలకాయ తీసినంత పరాభవం కాదుటరా?"

"ఏం అంత తలకాయ వంచుకోనక్కరలేదు దాన్ని చదివించి, పెద్దదాన్ని చేసి పెళ్ళి - ద్దామనే తీసుకువెళ్ళేను అంగులో మీరంతా మహా ఎత్తిపొడిచే తప్పేం వుందో తెలియటం లేదు"

దెబ్బతిన్నట్టు ఉలిక్కిపడి గంగరాజు "దానికి పెళ్ళా?"

"చేస్తే తప్పా!"

క్షణం తన తోబుట్టువుకు ఎనిమిదోయేటే వైధవ్యం ప్రాప్తించడం జీవితాంతం శరీరాన్ని కాల్చి, మసిచేసి వెళ్ళబుచ్చిన ఆ సంవత్సరాలు, ఆఖరు ఘడియల్లో దాని ఆసీ కోసం తను వీలునామా వ్రాయించుకోవడం జ్ఞాతుల దావాలు—అన్నీ జ్ఞాపకి వచ్చేయి దాంతో అవధానికూడా అలాంటి చతురంగ ఎత్తు ఏదైనా వేస్తున్నాడా అన్న సంశయం కలింది

"మంచి ఎత్తే వేసేడన్నమాట! మొత్తం మీద పీడయి వెంకట్రామయ్య అల్లుడు అనిపించేడు!" అని కసుక్కున నవ్వేసేడు గంగరాజు

చలపతీ, రామలక్ష్మమ్మ కూడా ఏమిటో, అంతెలియక ఒకళ్ళ మొఖం ఒకరు చూస్తు వున్నారు

"వెర్రి మొఖం అల్లా చూస్తావేమిటే? కచి మొగుడిపేర ఓ పాతిపెంకుటి కొంప, రెండు పుట్ల భూమి వున్నాయి కాదుటే" అని వెక్కిరించేడు

"పోవండోయ్!" అంటూ విదూరం వెళ్ళిపోయింది రామలక్ష్మమ్మ

చలపతికి నసాళం అంటింది. కోపం పుటి మునిగిపోయింది. తను వచ్చినప్పటినుండి ఈ దంపతుల్ని చూస్తూనే వున్నాడు ఉదయం లేచి ఎవరినెత్తిమీద చేతులు పెడదామా అన్న దృష్టే గాని ఇవన్నిటిలో ఎన్ని రూపాయలు పడవేసేం అన్న ధ్యాసే. ఆఖరుకు ఏ దొడ్లోపండిన కాకరకాయతోనో, గోంగూరతోనో కాలంగడుపుతూ కడుపు మాడ్చుకోవడం, కట్టుబట్టయినా ఊ త్తిరటు వెయ్యలేనంత దటంగా ధోవతులు, చీరలు ఉండడం, ఎదిగేపిల్ల కాంత అన్న జ్ఞానమేనా లేకుండా చిరిగిన చీరల ముక్కలు పావడాలక్రింద తయారుచేయించడం చూస్తూనే వున్నాడు. అది కంట్లో కలికం పెట్టినట్లు వుండేది ఒక్కొక్కరోజు నానాహంగామా చేసెయ్యాలన్న ఉధృతం దుయ్యబట్టి పెయ్యాలన్నంత కోపంవచ్చేది. ఈనాడు వాళ్ళజన్మకి వచ్చిన అనుణాన్నే బుల్లిఅన్నయ్యకు ఆపాదించడం, ఓర్పుకో లేనిదే అయ్యింది

"మీరంతా పెద్ద బూరువాలు" అన్నాడు




"నీలు తేబోతుంటె-నీతోడే వోలమ్మ -
నాయెంట యెవరోను నడిసినట్టుంటాదే!"
—చిత్రం వీరిశెట్టి అచ్యుతరావు]

"ఏమిటే! బీరువాలా!" అంది సరిగా వినపడని తత్వంలో. గంగరాజుకు చెవున్న తగిలింది.

"ఏమిటే చూస్తున్నావ్?"

"ఉన్నదే. అంతకంటే ఏముంది?" అని చలపతి గుమ్మంమెట్లు దిగేసేడు ఇద్దరికీ కూడా పీక నొక్కకున్నంత పనయ్యింది దాంతో ఇలాంటివాడికి పిలిస్తే ఉత్తరోడు కానుకోవక్కరలేదు అన్న భావనలో నుండి, పిల్లకాకులన్నీ ఏమనుకుంటే ఏమిటి ఖాతరు ఎందుకు చెయ్యాలన్న ధీమాలోంచి చలపతి ఏకవ్యానిషేనా అవుతున్నాడా అన్న ఆదుర్దాలోకి వెళ్ళిపోయేడు గంగరాజు-ఆలోచనలోంచి తేరుకోలేకపోయేడు

వీధిని పడ్డాడు అన్న పేరే కాని చలపతి అనవసరంగా అన్నా సె హెూసని మధన పడ్డాడు ఇంగ్లీషు తెలియని మామయ్యకు తర్వాత అర్థం చెప్పెయ్యవచ్చునన్న ఆలోచనతో బుల్లిఅన్నయ్య ఆఖరున వ్రాసిన, ఒదిన వ్రాయించిన విషయాన్ని గురించిన ఆలోచనలో మునిగిపోయేడు...ఆ విషయమిది:

"సీతమ్మ మీ వూళ్ళో ఏదో వ్యాపారం చేస్తున్నట్లు విన్నాం దాన్ని ఓదారికి తెచ్చి వాళ్ళ నాన్న చినరెడ్డి ఇంట్లో చేర్పిస్తే, నాన్నగారు చేసిన తప్పు సరిదిద్దినవాళ్లం అవుతాం కనుక, అది ఎక్కడవుందీ, ఎల్లా వుంది, పతనం అయిపోయిందా ఈ విషయాలన్నీ విపులంగా వ్రాసి నేను వచ్చి దాన్ని తీసుకు



# సమర్పణ



చెప్తాను. ఇది ముఖ్యంగా మీ ఒదిన కూడా వ్రాయమంది..."

ఆతురం ఆతురంతో పాటు మాట మాట క్రిందనూ ఉన్న బాధ వ్యక్త మవటంతో అవ్యాజంగా సీతమ్మమీద ఆదరణ కలిగింది; జాలిపొందేడు. చూచాయగా ఆ సెలవులకు వెళ్ళినపుడు, అది ఇంట్లోంచి బాధ పడలేక వెళ్ళిపోయిందని, ఆవెళ్ళిపోవడం ఆసరా తీసుకుని నాన్నగారు ఏవోఏవో ప్రతీకారం చేసేరని ఊళ్ళో అందరూ పాలేరువాడితో లేచిపోయిందని ప్రచారంచేసి రెడ్డిని తలెత్తుకోనివ్వకుండా చేసేరనీ విన్నాడు. మనస్సు నొచ్చుకుందికూడా.

ఆ చిన్నతనంలో కొబ్బోలు సీతమ్మని వీధి బడిలో చూచేడు. చామనచాయగా పొడవుగా, తనకన్న మూడేళ్ళు చిన్నదిఅయినా తనంతే ఎత్తువున్న దాన్ని "ఏమే కోంగా!" అని ఏడిపించడం గుర్తుకువచ్చింది

ఉక్రోషం పట్టలేక అది "ఏం కొక్కిరాయీ!" అనడం తలపుకువచ్చి ఇప్పుడు సిగ్గుపడి పోయేడు.

అది, ఈ వూళ్ళో ఏ మాగుమూలో జీవిస్తోంది. స్వతంత్రంగా బ్రతుకుపోసుకుంటోంది అన్న విషయం అన్నగారు చెప్పే వరకూ తనకు తెలియకపోవడానికి ఎంతో కుమిలిపోయేడు

ఆవూరు అంత బస్తీ కాకపోయినా అన్ని పేటలు, బజార్లు తిరిగినవాడే చలపతి చూచీ చూడనటుగావున్న వీధులన్నీ మళ్ళీ తిరిగి వచ్చాడు. మసీదువీధిలోంచి కిరస్తానీవాడ మీదుగా కోమట్లసందులోకి మళ్ళి, తెలగాల బజారు నడచాడు. మాదిగమాలవాడల పొలిమేర వరకూ తిరిగేడు

ఒకళ్ళిద్దరు ఎరుగున్న వాళ్ళు కనపడితే, అడుగుదామన్న ఉద్దేశం కలిగినా, అవహేళనకు గురిఅయిపోతానేమో అన్న భయంతో మానేసేడు. తీరా ధైర్యంతో అడిగినా ఏమని అడగాలి అన్నది సందిగ్ధం అయ్యింది

కూరమార్కెట్టు దగ్గర మలుపు తిరుగుతూంటే ఎదురుగా ఓ పెంకుటిలు పంచలో చిన్న గ్యాసునూనె డబ్బా, అగ్గిపెట్టెలు, సిగరెట్టులు, బీడీలు వగైరా అందలాల్లో ఉంటే, ఉప్పు, పప్పు, బెల్లం తూసుమన్య ఊరుతూవుండడం చూచేడు గల్లాపెట్టె అంటూ లేనేలేదు. మనిషి ఎవరూ కన్పించకపోవడంతో, అదే అయివుంటుందా అన్న భ్రాంతిలో అడుగు ముందుకు వేసేడు

"ఏం కావాలి ?" లోపలినుండి ప్రశ్న.

"ఎవరిది కొట్టు ?"

ఏం కావాలంటె, ఎవరిది కొట్టు అంటావేమయ్యా! ఏమైనా పోలీసువాడవా ?" అంటూ ఓ చేతో పప్పువులుసుకలుపుతున్న తెడ్డు ఆవిరతో సహా ఆయుధంగా చేసుకొని కొట్టుగుమ్మం దాటొచ్చింది ఒక్కచూపులోనే అంతా అవగాహన అయినట్లు

"మీరా! చలపతి గారూ!" అంటూ ద్వార బంధానికి చేర్లబడిపోయింది సీతమ్మ

వటువింతింతై, అంతై అన్నట్లు సీతమ్మను ఆ చిన్ననాటినుండి ఊహించుకుంటూ, పోల్చుకుంటూ చలపతి నోటకు లేకున్నాడు కళ్ళప్పగించి యవ్వనం దాటి దాటని వయస్సులోని బిగింపుల్లో వుండి పోయింది సీతమ్మ

"వ్యాపారం బాగా సాగుతోందా? కోంగమ్మా!"

"ఏదో వస్త కాలం కొక్కిరాయిగారూ" అంది ఫక్కున నవ్వుతూ.

ఇదరూ సిగ్గుపడి పోయేరు ఆ భావుకతలో. ఉప్పుతొట్టెమీద బల్ల వేసి కూర్చోమంది

"నేను ఇక్కడవున్నానని మీకు ఎల్లా తెలుసూ?" అంది ఓ పెద్ధయంతోనే.

"అన్నయ్య వ్రాసేడు"

"అవధాని గారా?"

తలూపేడు.

"రమణమ్మ గారు కులాసాగా వున్నారా? ఆవిడను చూచి చాలా రోజులైంది. ఎంత మంచావిడో! మా ఇంట్లో నా పాలువిని, సీతమ్మా ఏ రోజైనా నిన్ను నాదగ్గర పెట్టుకుని ఈ కష్టాలన్నీ మర్చిపోయేట్టు చేస్తా అంటూ వుండేది మాతల్లి.."

ఉండబట్టలేక "వాడేడీ?" అన్నాడు చలపతి

"ఎవరూ?"

"ఇంకెవరూ? మహా తెలియనట్లు అనుకుంటావేం?"

క్షణం మెరుపు కొట్టినట్లయి!

"అయితే ఊరందరూ అనుకున్నట్లు మీరు నమ్మేరన్నమాట?"

"ఆ రోజునుండి వాడూ కన్పించటం లేదుగా ఊళ్లో!"

కళ్లనీళ్లపర్యంతం అయింది సీతమ్మకు, తన బ్రతుకు ఇల్లా బండలైనందుకు

సవతితల్లిపోరు పడలేక లేచివచ్చింది దారిలోనే వాడూ, మిలిటరీలో చేరాలని బయల్దేరి వచ్చినవాడు తారసిలేడు. ఆవూరు ఈవూరు ఆనమాళ్ళు తెలియనివ్వకుండా తిరిగి ఆఖరుకు ఈవూరు చేరిపోయి నూన

అభిమానం దెబ్బతినకుండా పొట్ట వెళ్ళబోసుకుంటుంది. ఘరానాగా బ్రతికింది. కాని ఈ అపనింద వుండిపోయిందే అని లోపల్లోపల కుళ్ళిపోయేది. దాన్ని తలచుకున్నప్పుడల్లా ప్రేవులు తోడేసినట్లే అయ్యేది.

"నిజాలా మనిషినై బ్రతుకున్నానని మీరు నమ్ముతున్నారా?" అంది కళ్ళు తుడుచుకుంటూ.

అప్పుడప్పుడు అర్ధరాత్రిళ్ళు పార్టీ పత్రికలు ఎవరో తేవడం వాటని అందించడం, అవి రహస్యంగా దాచుకునేందుకు సీతమ్మ ఇంటివెనకాల పాడుపడిపోయిన మసీదులోకి రావడం చలపతికి అలవాటే. ఈ మసీదు కేంద్రంగా నిర్ణయించుకునేప్పుడే తన 'సెల్' లోని సభ్యులు తర్జనభర్జన చేసి పరిసరాలన్నిటిని చూచినప్పుడే 'ఎవరో' రెడ్డిది. ఎవరూ లేనట్లు వున్నారు. ఉప్పు, పప్పు అమ్ముకుని బ్రతుకుతోంది. ఎవరిగొడవా అక్కరలేదని విన్నాడు. సరేఅని అనుకున్నాడు. ఆవ్యాపారే సీతమ్మ అయివుండడం సంబరపడేట్టు చేసింది. దీంతో ఓవిధంగా తమరహస్యానికి అండగా వుంటూ పహరా కాస్తుందన్న తృప్తి కలిగింది.

"నేను నమ్మటంలేదు నువ్వు పాడైపోయి పతనం పొందేవంటే" అన్నాడు చలపతి.

ముగలిపాటే అయిపోయింది సీతమ్మ. ఆనందంలో మొఖం సీమంతం అయిపోగా "నిజంగా" అంది.

"ఒట్టు కొంగా!"

"ఎంతమంచి వారు మీరు," అంటూ "కొంపతీసి మానాన్నకి ఇక్కడ వుందని ఈ తీరం వ్రాయకండేం మీకు పుణ్యం వుంటుంది" అని బ్రతిమాలుకున్నట్టే అంది.

నవ్వుకున్నాడు చలపతి. కళ్ళు చికిలిస్తూనే "తప్పకుండా వ్రాస్తాను. ఇక్కడ పెద మార్వాడీవ్యాపారం చేస్తోంది. వెంటనే వచ్చి తీసుకువెళ్ళండి. రాకపోతే మళ్ళీ పరారి అయిపోతుందనే వ్రాస్తాను."

"చంపేసేరు. ఎవరికి మానాన్నకే!"

"కాదు మా అన్నయ్యకు, ఒదినకు."

కిలకిలా నవ్వింది సీతమ్మ.

"ఆ మా రాజుల దగ్గరకైతే ఎగిరి గంతేసి వెళతా" అని అనేసింది.

చివుక్కుమంది చలపతి హృదయం ఓసారి. చిరకాలంనుండీ ఏవో ఏవో భావాలు, పార్టీలో సీతమ్మని చేర్చి సేతనూ అది కలసి పనిచేస్తూవుంటే ఇవన్నీకూడా మెరసి, మళ్ళీ ఒక్కసారి మాయమైపోయేయి! దాంతో అన్నయ్య, దేవుళ్ళూ అడుగులు ఒత్తే కాంగ్రెస్ తత్వంతో స్వతంత్రం వస్తుందా హింసను హింసతోటే జయించాలి అన్న దృక్పథం మేలవు అయితే!

"సీతమ్మా! పోనీ నా దగ్గర ఉంటావా"? అన్నాడు.

తెల్లబోయింది సీతమ్మ!

—ఇంకా వుంది]




జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

కీలక నామ సంవత్సర భాద్రపదశుద్ధ చతుర్దశినాడు (1908, సెప్టెంబరు) బొంబాయిలో దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు గారు ఆంధ్ర వారపత్రికను ప్రారంభించారు. నాటి ఆంధ్రపత్రికోదయశుభసమయం వాస్తవంగా ఆంధ్రులసాహిత్యానికి మహోదయ సమయం. స్వర్ణోత్సవం జరుపుకున్న ఆంధ్ర వారపత్రిక సేవను అభినందిస్తూ శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు వ్రాసిన ప్రత్యేక వ్యాసాన్ని ఇక్కడ ప్రచురిస్తున్నాము. ప్రస్తుతం ఉద్యోగరీత్యా రష్యా రాజధాని మాస్కోలోవున్న శ్రీ సత్యనారాయణమూర్తి విద్యాధికులుగా, సాహితీ ప్రియులుగా, ఉత్తమరచయితగా తెలుగు పాఠకులకు చిరపరిచితులు. వీరు తమవ్యాసంలో ఆంధ్ర పత్రికావతరణం మొదలు ఇప్పటివరకూ గత యాభై యేళ్లలో జరిగిన వివిధ రాజకీయ సాంఘికోద్యమాలను ఈ సంక్షిప్త వ్యాసంలో సమీక్షించారు.

ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవమును జరుపుకొనుచున్నది. ఈ మహోత్సవమును కన్నులార జూచు భాగ్యము నాకు కలుగుటలేదు. శరీరము యూరపులో నున్నప్పటికీ, మనస్సు పవిత్ర పత్రికాలయమందే కలదు.

ఏబది సంవత్సరముల పత్రికా జీవితమును సింహావలోకన మొనరించుటకై మిక్కిలి ముచ్చట పడుచున్నాను. అర్ధశతాబ్దపు సాంస్కృతిక చరిత్ర ఇందుగలదు. ప్రపంచ చరిత్రకు పత్రికా ముఖము దర్పణమువంటిది. ఈ దర్పణమందలి బింబమును సమగ్రముగ చిత్రించుట కిందు తావులేదు. పత్రికతో దానిని స్థాపించిన మహనీయుని జీవనము కలిసియే యున్నది; సంపాదకుల జీవనములును అందిమిడియున్నవి. వీరి మానసగ్రథనమందే పత్రిక పుట్టినది.

1908 మొదలు 1958 వరకు భారతీయ చరిత్రలో అశేష విషయములు సాగిపోయినవి. 1885 లో కాంగ్రెసు యుద్యమము బొంబాయిలో ఆరంభమైనను జనసామాన్యమున సంచలనము కలుగలేదు. 1905 రష్యా చరిత్రలో వలె, భారత దేశచరిత్రలో మిగుల ముఖ్యమైనది. కాంగ్రెసపుడు కాశీలో సమావేశమైనది; గోపాలకృష్ణగోఖలే అధ్యక్షుడు. కాశీలోని గంగోదకము వంటిది అతని మానసము. అది యొడుదుడుకు ఎరుగనిది. కర్జను రాజప్రతినిధిగ నుండి, సింహమువలె గర్జించి వంగదేశమును చీల్చుటకై సిద్ధపడెను! భారతాంతరంగమందలి మహోజ్జ్వల శక్తులపుడు వ్యక్తమైనవి. లాల్, బాల్, పాల్ మహాశయుల సంయుక్తప్రజ్ఞ ప్రజ్వరిల్లినది. లాల్ (లాలా లజపతిరాయి) పంజాబుకేసరి. బాల్ (బాల గంగాధర తిలకు) మహారాష్ట్రకేసరి; పాల్ (బిపిన్ చంద్రపాల్) వంగకేసరి. వీరి శక్తులకు బరేన్‌ఘోష్, అరవిందఘోషుల శక్తులు తోడుపడినవి. అరవిందుని కలమందు మంత్రశక్తి యుండెను.

1906 లో కాంగ్రెసు కలకత్తాలో సమావేశమైనది. అంతకుమున్నే "ఆనందమఠము"న ముప్పదేండ్లు అడగియున్న "వందేమాతర" గీతిక కవి స్వప్నమున తలయెత్తు ఉదాత్తభావమువలె, తాత్వికుని వచఃకౌశలమున వెలారు భావబ్రహ్మాండమువలె భారత జనయిత్రీ రసనమునుండివెడలి దశదిశలందు నూతన జీవితమును, అపూర్వోత్సాహమును పుట్టించినది. గీతికాలాపనజేయుచు వంగ బాలికలు దాదాభాయి నౌరోజీని కాంగ్రెసు గద్దెమీది కాహ్వానించిరి; అతనిపై సుమవర్షము కురిపించిరి. భారత దేశవృద్ధుడు (The Grand Old Man of India) అనదగు ధన్యుడై "స్వరాజ్యము" మా హక్కని చాటెను. స్వరాజ్య శబ్దమప్పుడే భారత రాజకీయ గగనమున ప్రతిధ్వనించినది. తరువాత (1907) లో కాంగ్రెసు సూరత్‌లో సమావేశమైనది. ధర్మక్షేత్రము కాని కురుక్షేత్రముంగ గోచరించినది! తపతీ జలమున తాపమున్నది కాబోలు! కాంగ్రెసులో రెండు చీలిక లేర్పడినవి. మితవాదుల నాయకుడు గోఖలే, అతివాదుల నేత బాల గంగాధర తిలకు. శివాజీవలె ఈతడు భవానీభక్తుడు. దేవి చరణములపై నీతడు తన మస్తకమును వంచెను. తన చరణముల క్రింద దాస్యము నణచుటకే ఈతడు సమకట్టెను. ఈతని శిరముపై ఎఱ్ఱని యుష్ణీషము వెలసినది. ఇది కంటకముకుటమైనది; కాని, యిందలి నిర్భీత మహిమ తిలకు లోకమాన్యుడని దిశాంగన వీనులం దూదెను. భీషణ నిర్వాసనమున భారతాంబ పవిత్ర నామాక్షరములను పునశ్చరణ మొనరించుచు, "గీతారహస్యము" "ఆర్యుల ఆదిమనివాసము" "Orion" మున్నగు గ్రంథములను రచించెను. మాండలే కారాగృహమందుండగా అర్ధాంగలక్ష్మిని గోల్పోయెను; కాని భారత స్వరాజ్యలక్ష్మీ సాక్షాత్కారమునకై ఈతడు తపించెను.

1908లో భారత రాజకీయములందు తీవ్రవాద పక్షీయులు తలలెత్తినపుడే "ఆంధ్రపత్రిక" ఉదయించినది! నాగేశ్వరరావు పంతులుగారు ఈ మహోద్యమ రథముపై పూలుజల్లిరి; రథమునందలి భారతాంబను ఆరాధించిరి. శ్యందనము నుండి వెడలిన శంఖారవము వారి హృదయమందు ముఖరితమైనది. దేవీ సేవకై నడుముగట్ట నిశ్చయించిరి. భారత వాతావరణమును తమ పత్రికాక్షరములందు కేంద్రీకరింప నెంచిరి. కాంగ్రెసు పుట్టిన తావున బొంబాయినగరములోనే ఆంధ్రపత్రికను నెలకొలిపిరి.

నాగేశ్వరరావు పంతులుగారు సహజ ప్రతిభగల మహనీయుడు. కృష్ణాజిల్లాలో ఎక్కడో ఎలకుర్రులో పుట్టి, ఒక యంజలో బొంబాయిజేరుకొనిన సాహసోపేతుడు. రంగారు బంగారు తూగుటుయ్యేలలో వీరిబాల్యము ఊగలేదు. జీవిత దారుణ పరిస్థితులు వీరి నెదుర్కొనినవి. కనలక, క్రుంగక, కూలక ప్రతికూల పరిస్థితులలో వారి వీరు తమ శంఖమును పూరించిరి. విమల ధిషణా దురంధరుడు శ్రీ రెంటాల వెంకట సుబ్బారావుగారి యుత్సాహమున తొలుత వీరు విశేష ప్రోత్సాహమునందిరి. బొంబాయిలో విలియమ్సు కంపెనీలో వీరి ప్రవేశము తరువాతి సముజ్జ్వల జీవితమునకు అవకాశమొసగిన నాంది మాత్రమే.

విశాలదృష్టి, విజ్ఞానదృష్టి, దూరదృష్టి, అంతర్దృష్టి పంతులుగారికి సహజములైనవి. వారు విశేషించి కృషిచేసినది కాంగ్రెసు ఉద్యమాంగణములోనే. అటయ్యు తక్కిన రాజకీయపక్షములపై వీరికి ద్వేషములేదు. ఏ వర్గముపైగాని, ఏ శాఖమీదగాని ఏ జాతిపైగాని వీరెన్నడు కోధి చూపుసారించి యెఱుగరు. రాజకీయ సాంఘిక సారస్వతోద్యమములలో వీరు సమన్వయ పంథానే అనుసరించిరి. సర్వరాష్ట్రములవారు, సర్వమతములవారు, సర్వజాతులవారు వీరిసహకారము నందుటవలననే వీరు విశ్వదాతలైరి. కలకత్తాలో, సీమల్లా ప్రాంతములో హజారీమల్లు సందులో నుండోయుండిన శ్యామసుందర చక్రవర్తిగారికి వీరి ఆర్థిక సాహాయ్యము లభించెడిది. క్రైస్తవులు తోడ్పాటు వర్ధించినను, వారు త్రోసి రాజనలేదు. వీరి దృక్పథమే వీరి పత్రికయందు వ్యక్తమైనది. వివిధోద్యముల కది పీఠభూమియైనది. సకలసద్గుణ నికురుంబయైన శారదాంబ "ఇదినా పూజానిలయ" మని పత్రికయందు ప్రవేశించినది! ఆమె వీణా తంత్రులనుండి వెడలిన మాధుర్యము ఆంధ్ర పత్రికా పంక్తులందలి భావశబలత యైనది!

పంతులుగారు ఆంధ్రపత్రికను స్థాపించిన యనంతరమే "మింటో మార్లే రిఫారములు" మాంచెస్టరు లిబరలు పూలుగుత్తులు దిగుమతియైనట్లే 1909 లో దిగుమతి యైనవి. భారతీయ వాంఛలీ సంస్కారములందు హుళక్కియైనవి. ఏటేట కాంగ్రెసు-తన యాశయములను వ్యక్తీకరించుచున్నది. 1915 లో దురదృష్టవశాత్తూ సౌమ్యమూర్తియైన గోఖలే అస్తమించెను. మానవులందలి సానలదీరిన జాతిరత్నము రాలిపోయెనని లోకమాన్యుడు విలపించెను. డాక్టరు ఏని బిసెంటు హోంరూల్ ఉద్యమమును నడపెను. 1917 లో కలకత్తాలో జరిగిన కాంగ్రెసు కధ్యక్షురాలుగ నెన్నుకొనబడి పదునారు హయముల శకటమున మహారాజ్ఞివలె నగర మహావీధులందు సుమవృష్టినందెను. కామన్వెల్తు ఆఫ్ ఇండియా బిల్లులో తన యద్భుతశక్తిని వ్యక్తీకరించి, రాజకీయరంగములలో మోసములు వడిముద్రిప్పువారిచే "నోహో !" అనిపించుకొనెను.

అనంతరము గాంధీజీ భారతరాజకీయ దిగ్వలయమున గోచరించెను. రౌలట్ బిల్లులు తలసూపినవి. భారతీయులు తమ యసంతృప్తిని వ్యక్తీకరించిరి. జలియన్‌వాలాబాగ్‌లో ఘోర-హత్యలు జరిగినవి. పిన్నలూ, పెద్దలూ, స్త్రీలూ, పురుషులూ జనరల్ డయర్ గుండ్ల దెబ్బలకు గురియై 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అను మహావాక్కు నుచ్చరించి దేశస్వాతంత్ర్యమునకై అసువులు బాసిరి. నేడును ఈ శోకము ఆతావులోని బావి గోడపై గోచరించుచున్నది. వారిరక్తము బావిలో ప్రవేశించినది. జనరల్ డయర్ వెనుక పంజాబు గవర్నరు మైకేల్ ఓడ్వయరు, అతని వెనుక రాజప్రతినిధి చెమ్స్‌ఫర్డ్ ఉండిరి. కలకత్తా టౌను హాలులో సుపన్యసించుచు రాజప్రతినిధి భారతదేశమునుండి కదలి పోవలెనని చిత్తరంజనదాసు ఎలుగెత్తి తెలిపెను.

మాంటేగు చెమ్స్‌ఫర్డ్ రిఫారములవలన కొంత మెత్తబడిమంత్రి పదవులు స్వీకరించిన వారు సైతము జలియన్‌వాలాబాగ్ హత్యలను తీవ్రముగా ఖండించిరి. కలకత్తా టౌను హాలులో జరిగిన మోడరేట్ల యొక్క మహాసభకు సర్ శివస్వామి అయ్యరు అధ్యక్షుడై, సర్ ప్రవాష్ చంద్ర మిట్టర్ ఆహ్వాన సంఘాధ్యక్షుడై తమ యసంతృప్తి వ్యక్తీకరించిరి. తేజ్ బహుదూర్ సప్రూ, సురేంద్రనాథ, సి.వై. చింతామణి, రైట్ ఆనర్ బుల్ శాస్త్రి, సి.పి. రామస్వామి అయ్యరు, మోచర్ల భూపతిరాజు, పాత్రో ప్రభృతులును తమ యారాటమును ప్రకటించిరి. జే ఎన్. రాయ్ హత్యాకాండను వివరిస్తూ ఆడుదానివలె నేడ్చుట నేను చూచితిని.

బోయర్ యుద్ధము నాటినుండి సహకారియై యుండిన గాంధీజీ బ్రిటిష్‌సింహము నెదుర్కొనెను. అమృతసర్ నుండి రాజకీయమైన కేంద్రము పుట్టినది. పాంచాలనాయకులు లాలాహరికిషన్‌లాల్, లాలా దునిచెంద్ ప్రభృతులు కలకత్తా వచ్చినపుడు వ్యోమకేశ చక్రవర్తి అధ్యక్షుడై జకరియా పార్కు (ఇపుడు మహమ్మదాలీపార్కు) లోని మహాసభయందు వారి నాహ్వానించెను. కలకత్తాలోనే వెలింగ్టన్ స్క్వేరులో 1920 సెప్టెంబరులో అవసర కాంగ్రెసు సమావేశమయ్యెను. అమెరికానుండి మరలివచ్చిన లాలాజీ అధ్యక్షుడాయెను. గాంధీజీ తన పాంచజన్యమును పూరించెను. మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్‌దాసు, పటేలు సోదరులు, అభయంకర్, పట్టాభి, నాగేశ్వర ప్రభృతులు మహాత్ముని అంటిపెట్టుకొనిరి (అంటజేసిరి). సహకార నిరాకరణ మహోద్యమము భారతదేశమందే కాక ఐదు ఖండములందును అద్భుతసంచలనమును పుట్టించినది. చరిత్ర ఎన్నడూ కనీవినీ యెఱుగని శాంతిసమరము ఆరంభమైనది. పల్వురు తమ మణికట్టులకు దీక్షాసూత్రములు కట్టుకొని, దీక్షావస్త్రములు కట్టుకొని యజ్ఞవాటికలో ప్రవేశించిరి. కిమ్మనకుండ అత్యాచారమునకు తలయొగ్గిరి. అసిధారావ్రతమున బద్ధదీక్షితులైరి. అగ్నిపరీక్షల నెదుర్కొనిరి. స్మితముఖులై కారాగారములందు ప్రవేశించిరి.

వారపత్రికయైయుండిన ఆంధ్రపత్రిక మద్రాసుచేరి దినపత్రికయగుటచే అప్పటి ఆంధ్రుల ఏకైక దినపత్రికయై దైనందిన రాజకీయాంశములను తెలుపుచు, ఆంధ్రదేశమందేకాక, ఆంధ్రులువసించిన సమస్త వసుంధరలో (దక్షిణాఫ్రికా, బర్మా మున్నగు సీమలందు) ఆంధ్రులకు చెలియై, చుట్టమై యుండెను.

కాంగ్రెసు మహోద్యమములో పాల్గొని దేశోద్ధారకులు కారాగృహమున ప్రవేశించిరి; త్యాగమూర్తియై ఉదారలక్ష్యసిద్ధికై పాటుపడిరి.

కాంగ్రెసు మహోద్యమమునందు శ్రద్ధ చూపినట్లే ఆంధ్ర పత్రిక ఆంధ్రోద్యమమున మక్కువ చూపెను. 1911 లో బయ్యా నరసింహేశ్వరశర్మగారు అధ్యక్షులై యుండగా కొండా వెంకటప్పయ్య పంతులుగారూ, నాగేశ్వరరావు పంతులుగారూ, రామదాసు పంతులుగారూ, మోచర్ల, భూపతిరాజు ప్రభృతులు ఆంధ్రోద్యమమునకై పాటుపడిరి.

గాంధిజీ కారాగృహమున ప్రవేశించెను. 1922 నవంబరు మాసమున 20 వ తేదినాడు (All India Congress Committee) రసారోడ్డులో చిత్తరంజనుని యింట సమావేశమైనది. తమ ఆశయములను కాంగ్రెసువాదులు ముక్తకంఠములతో తెలిపిరి. కొంత కాలము ఆంధ్రోద్యమము వెనుక నిలిపి, ఆంధ్రనాయకులు భారత

(54-వ పేజీ చూడండి)

# దాసోహం

"మధుశ్రీ"

ఇంటివారి గోడగడియారం "ఠంగ్ ఠంగ్" మని ఐదుగంటలుకొట్టింది.

అద్దంముందు నిలబడ వరలక్ష్మి మళ్ళీ ఒక్కసారి మునివ్రేళ్ళతో కున్నితంగా కురుల్ని చక్కదిద్దుకుని, తన సౌందర్యాన్ని తనివిదీరా చూసుకుంది.

గడియారం కొట్టిన గంటలువిని ఎడమ చేతో పాదాలమీద జీరాడుతున్న కుచ్చెళ్ళని ఒక ప్రక్కకి తీసిపట్టుకుని రాజహంసలా వీధిగుమ్మంలోకి వచ్చి నిలబడ్డది.

నిలబడి ద్వారం రెండువైపులా రెండు చేతులూ చాచిపట్టుకుని ఒంగి వీధిపొడుగున దృష్టి సారించింది; ఆకర్ణాంత విశాల నేత్రాలు మరీపెద్దవిగాచేసి.

ప్రసాదరావు వస్తున్న జాడ కనబడలేదు. "ఈయనెప్పుడూ ఇంతే...ఆదివారం నాడైనా పెందరాళే ఇంటికివచ్చెయ్యమంటే రారు..." అనుకుంది మనసులో; సినిమాకి ఆలస్యం అయిపోతోంది అన్న ఆత్రుత ఆమెని తొందరపెట్టగా. వెనక్కి వెళ్ళిపోయి హాల్లోనే వాల్చివున్న మడతమంచంమీదకూర్చుంది వీధిలోకి దృష్టినిగుడ్చి ఎర్ర ఎర్రగా జాకెటూ...నీలి చరలూ... పువ్వులాంటి తెల్లటి చీరలూ కట్టుకుని ఎందరో సినిమాకి గబగబా వెళ్ళిపోతున్నారు.

చెయ్యీ చెయ్యీ కలుపుకుని కొందరూ నవ్వుతూ తుళ్ళుతూ కొందరూ, కమ్మగా కబురు చెప్పుకుంటూ హాయిగా సినిమాకి పోతున్నారు. వాళ్ళనిచూస్తూంటే ఆమెకి బాధ మరీ ఎక్కువ అయింది.

ఆయనింక రావడం ఎప్పుడు?

తనని సినిమాకి తీసికొని వెళ్ళడం ఎప్పుడు! రావాలి...బట్టలు మార్చుకోవాలి భోజనం అవ్వాలి...అప్పుడు బయలు దేరాలి! ఏదైనా ఆరోజు కిక సినిమాకు తెరదే అనుకుంది వరలక్ష్మి...అనుకున్న పని జరక్కపోతే ఆమెకికమనస్థిమితం ఉండదు.

మడతమంచంమీదా కూర్చోలేక హాల్లోనే అటూ ఇటూ పచార్లుప్రారంభించింది.

ఉండబట్టనూ లేక పోయింది.

గుమ్మంలోకి వెళ్ళి మళ్ళీ ఒక్కసారి వీధి పొడుగునా దృష్టి సారించింది!

కాని ఆయన రావడం లేదు...

ఆమెకి ఒక్కసారి అరికాలిమంట నెత్తికెక్కి పోయింది హెడ్డు గుమాస్తాని తెల్సుకోగానే! తన మొగుడు మెత్తనివాడని చెప్పి ఆయన చేతే చాకిరీ అంతా ఆదివారాలూ; అహోరాత్రులూ చేయిస్తాడు.

ఇంతికీ ఆయన్నానేం లాభం...

ఈయన మెత్తదనమే కదా! దీని కంతకీ కారణం.

తోటి గుమాస్తా సుందరం పనిఉన్న రోజుల్లో నే ఆఫీస్ కి సరిగా వెళ్ళడు.

ఆయన్నేమీ అనడేం?

మెత్తనివాళ్ళని చూసే మొత్త బుద్ధి! ఈయనమాత్రం గట్టిగా ఎందుకు సమాధానం చెప్పకూడదు.

కోరుకున్న వాళ్ళకే రోజులు ఇవి.

భావనా పరంపరలు ఆమె మనసులో సవ్యసాచి బాణాల్లా చక చక సాగిపోతున్నాయి!

ఆరు...

ఆరుకూడా కొట్టింది...

"ఎందుకొట్టదూ—ఏడుకూడా కొడుతుంది—"

వినుక్కుంది వరలక్ష్మి

ఆమె అనుకున్నట్టుగా ఏడు కొట్టలేదు

కానీ, ఈ లోపులోనే బండెను షెల్ఫ్‌తో ఇంటికి వచ్చాడు ప్రసాదరావు, ఉసూరు మని నిట్టూరుస్తూ.

అతను రావడం గమనించినా గానీ, ఆమె నవ్వుతూ ఎదురు వెళ్లనూ లేదు, కనీసం పలకరించనూ లేదు.

వస్తూనే అతను వాకిట్లో ఉన్న కవాచీ బల్లమీద కాగితాలు పడవేసి పెరట్లోకి వెళ్లి వాలు కుర్చీలో వాలిపోయాడు; నీరసంగా

ఆమెకి అలుక వచ్చిందో ఆలోచించుకునే స్థితిలో లేడతను.

లేకపోతే – "పేరలుకం జెందిన యట్టి కాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే!" అన్న ఆర్యోక్తిని తల్చుకుని పాద పద్మాల్ని చక్క నొత్తడానికి వెళ్లేవాడేమో!

అతను—మానవుడు - వింత ప్రకృతి... ఆలోచిస్తూ ఆపైన వేదాంతంలోకి వెళ్ళిపోయి లోతుగా ఆలోచిస్తున్నాడు.

ఎప్పుడైతే ధీరవచ్చి తనని పలుకరించలేదో-ఆమే వచ్చి వసారా స్తంభాని కానుకుని నిలబడింది.

సమయం రాగానే జోరు "ఝుష్" లాడించేద్దామన్నట్లుగా వుంది.

మనసులో ఏమనుకుందో ఏమిటో అతని ముఖంలోకి చూసింది. చిరుగాలికి ముంగురులు ముఖంమీదికి ఎగురుతున్నాయి.

శరత్కాల చంద్రికలు చల్లగా కురుస్తున్నాయి.

ఆ చంద్రికల్ని ఆనందించే అదృష్టం అప్పుడు ప్రసాదరావుకి లేదు.

అతను అల్పజీవి!...

"వరలక్ష్మీ..." అని పిల్చాడు.

స్తంభంచాటునుంచి ఎదురుగుండా వచ్చింది!

"కాఫీ లేదూ?"

"ఉంది" ముభావంగా అని పైటని వంటి నిండా కప్పుకుని బొడ్డుదగ్గర దోపుకుని వంటింటివైపు వెళ్లింది.

ఆమె సిగలో పువ్వులు తెల్లగా నవ్వాయి!

కాని అతని మనసుమాత్రం ఆ నవ్వుని చూసి పరవళ్ళు తొక్కలేదు.

ఆమె గాజుల సవ్వడులు విపంచీ తంత్రీ స్వనాల్లా అనిపించలేదు.

అప్పటికి అతనికనిపించింది, నైతిక జీవితాన్ని గడుపుదామనుకున్నవాడు లోకం దృష్టిలో వట్టివెర్రివాడు. అమాయకుడు. బ్రతుకు బాగులు తెలుసుకోలేని మందుడు.

ఎంత కృత్రిమంగా జీవితం గడిపితే అంత తెలివైనవాడు.

కనకనే సుందరం గుమాస్తాల్లోకి తెలివైనవాడూ-ఘటికుడూను.

తను ఒట్టి అమాయకుడు.

కొందరిదృష్టిలో "అన్‌ఫిట్"

కాఫీ తెచ్చి కాని ఇచ్చిన వరలక్ష్మి అక్కడ నిలబడింది. అది అతను గమనించలేదు.

"కాఫీ ఇదిగో" అంది ముభావంగా.

"అక్కడ పెట్టు."

కుర్చీ ప్రక్కనే కాఫీగ్లాసు ఉంచింది.

"నిజంగా వరలక్ష్మి ఇప్పటికి తెలుసుకోగలిగాననుకో—!" అన్నాడు కాఫీ చప్పగా చప్పరిస్తూ.

ఆమెకిథోరణికి పూర్వాపరాలు తెలియలేదు కాని ధీరముఖంలోకి తను పరీక్షగా చూస్తుంటే తను కోపగించడం ఎంత అసమంజసమో తెలిసికొన్నది. అతనిమీద జాలి లాంటి భావంకూడా ఏర్పడింది!

ఏమిటన్నట్లుగా చూసింది; చెంపల మీదికి పడుతున్న కురుల్ని చక్కనొత్తుకుంటూ, "న్యాయంగా పని చేద్దామను వాడికి రోజులు కావు..."

ఇదేవాక్యం అతని నోటివెంట వినడం ఆమెకి కొత్తకాదు.

అందులోఉన్న భావంకూడా ఆమెకి బాగా తెలుసును.

"ఇప్పటికేనా మీ కా విషయం తెలిసినందుకు సంతోషం..."

"ఇంతకీ అసలుదోషం ఎక్కడ వస్తూందంటే అవసరాలు ఉండడాన్నిబట్టి ఎంతటివాడూ దాసోహం అనకతప్పదు. వసుదేవుడు గాడిదకాళ్లు పట్టుకున్నాడు. అవసరం ఎన్నైనా చేయిస్తుంది."

"నిజమే..." అంటూ వెళ్ళి వసారా స్తంభానికి జారగిలబడి నిలబడింది. అప్పటికి ఆమెలోని కోపమంతా పటాపంచలైంది.

"మనకి ఆ హెడ్‌గుమాస్తా అవసరం ఏం లేదనుకో, కాని ఆయనమాట మనం వినాలి



ఫిలడెల్ఫియా (అమెరికా) ప్రాచీన వస్తుప్రదర్శనశాలలో భద్రపరచిన పదవశతాబ్దంనాటి జైన తీర్థంకరుని విగ్రహం. అనేకమంది ప్రేక్షకులు అనుదినం ఈ విగ్రహాన్ని శ్రద్ధాసక్తులతో సందర్శిస్తుంటారు.

## ★ దాసోహం ★

లేదా ఆయన క్రింద పని చేస్తున్నందుకు అది మన కవసరమేల దా! అందుకని ఆయ నాడింది ఆట, పాడింది పాట!.. "

ఇంత కాలంగా తనతో భర్త ఎప్పుడూ తనగోడు విన్నవించుకోలేదు.

ఆ రోజు ఏదో విశేషం ఉంది అనుకుంది.

"రెంటికీ చెడ్డవాడు మధ్యతరగతివాడు. ఉన్నవాడికి ఉద్యోగం అక్కర్లేదు. ఉద్యోగం చేసినా ఎవ్వడికీ చెవరవలసిన అవసరం ఉండదు. భయపడడు కూడాను. లేనివాడు కూలి చేసుకుని హాయిగా బ్రతుకుతాడు. మధ్యతరగతివాడికి ఉన్నన్ని అవసరాలు కూలివాడికి వుండవు. మధ్యతరగతివాడికి కిలా అనవసరపు దర్జాలకి పోవలసిన అవసరాలు ఉండవు మధ్యతరగతి వాడనదమే కాని మధ్యరకంగా జీవించలేడు. పైఅంతస్థులో వాళ్ళని చూసి వాళ్ళతో సమానంగా ఉండడానికి ప్రయత్నించి బాధపడతాడు. లేనిపోని అవసరాలు కల్పించుకొని ఆ అవసరాలు సమకూర్చుకోడానికి నానా పాటుపడతాడు. అలాగని కూలివాడిస్థితికి దిగిరావడానికి అభిజాత్యం అడ్డువస్తుంది. కనకనే ప్రతివాణ్ణి లెక్క చెయ్యవలసిన అవసరం దాసోహం అనవలసిన పరిస్థితి ఏర్పడుతూంది

కూలివాడికి ఉద్యోగం ఉంటుందనీ ఊడుతుందనీ లెక్కలేదు ఎక్కడో ఒకచోట కూలి చేసుకుని ఆత్మవంచన చేసుకోకుండా బ్రతుక్కువస్తున్నాడు. ఆఫీసరేకానీ, కరెక్టరేకానీ వాడికి లెక్కలేదు వాడిపనివాడు చేస్తాడు. వాణ్ణి కించపరిస్తే వాడు సహించడు ఒకటిస్తుకు రెండు తిడతాడు వాడికి దాసోహం అనవలసిన అవసరమూ లేదు.

నాకీ ఈ ఉద్యోగం ఊడుతుందనుకో. నేను మరోకపని చెయ్యలేను. కూలిపని చెయ్యడం సిగ్గుకదా. కనక పై ఆఫీసర్ ఏదన్నా ఆత్మగౌరవాన్ని చంపుకుని నౌకరీ చెయ్యాలి-ఏమన్నా పడాలి! లేకపోతే "బాడ్ రిమార్క్" వ్రాస్తాడు. దానితో జీవితమంతా పాడయిపోతుంది.

జీవితంలో పైకిరావడం కోసం నేను దార్లోకనబడ్డ ప్రతి పైఆఫీసర్‌కి వంగి సలాములు చెయ్యాలి-లేకపోతే నామీదమాడ్లో కన్ను తెరుస్తారు.

అక్కడికీ నేను శక్తివంచన లేకుండా ఉదయాది ఆ సమయపర్యంతమూ గొడ్డు చాకిరీ చేసూ వేఉన్నాను. అందువల్ల నీ సరదాలు తీర్చలేకపోతున్నాను — నేను సుఖించనూ లేకపోతున్నాను

హెడ్‌గుమాస్తా చెప్పేపను తిరస్కరించలేకపోతూనూ ఉన్నాను.

తన పనికూడా నాకే అప్పగిస్తున్నాడు మాట్లాడకుండా చేసుకువస్తున్నాను. అయినప్పటికీ నాకుపూజ్యతలేదు. నాపనికి సంతోషించేవాడు లేడు.

(53-వ పేజీ చూడండి)

# బొమ్మలాట

మూలం
మానిక్ బంద్యోపాధ్యాయ
అనువాదం
మద్దిపట్ల సూరి

[గతవారం తరువాయి]

కుముద్ ఈ శ్రోత్రియింటికి వచ్చాక నాటకాలకి వెళ్ళటం మానేశాడు పుస్తకాలు చదవటం—సిగరెట్లు తగలెయ్యటంతో సే కాలం గడుపుతున్నాడు. "నాటకాలకి వెళ్లటం లేదెందుకని?" అని అడిగింది మతి ఒకరోజున.

"అకంపెనీలో మానేశానుమతీ."

"ఎంచేత?"

"నాటకాలు సరిగా పడటం లేదు. ఆడకుంటే జీతం తగ్గించుకోమంటారు. అందుకని అసలు మానేశాను. నాటకాలు ఏర్పాటు చెయ్యరు వెధవలు. తప్పంతా మాత్రం నటులమీద త్రోసేస్తారు. ఈ నాటకాలకంటె వీధి భాగోతాలే చాలా నయం మతీ!".

మతి కళ్లు రెండూ పెద్దవి చేసుకుని, "మీ వేషం రక్తి కటటం లేదన్నారా వాళ్ళు?" అని అడిగింది.

"ఆఁ ఇంచుమించు ఆఖరికి అలాగే వచ్చింది సేపం. నాటకం విజయవంతం గాలేదంటే తప్పకుండా నటులదే అవుతుంది లోపం. రెండుమూడు నాటకాలు విజయవంతం కాకపోయినా గౌరవం నిలవటానికి ప్రసిద్ధులయిన నటులెవరూ లేరు. మంచిదే అయిందిలే మతీ! నాటకం కంపెనీల్లో పనిచెయ్యటం నాకసలేం యిష్టంలేదు కూడా"

"ఇక నిప్పుడేమిటి చెయ్యటం?" అని పక్కాగృహిణిలా మొహం పెట్టి అడిగింది మతి.

కుముద్ నవ్వుతూ- "చేస్తానులే ఏదో ఒకటి. దాన్నిగురించి బెంగ ఎందుకు? అంత అవసరమైతే ఒకటోరెండో నీ నగలు ఇవ్వవా?" అన్నాడు.

'తీసుకోండి" అన్నది మతి

ముఖం ఏమీ చిన్నబుచ్చుకోకుండా నిస్సంకోచంగా అన్నది మతి ఈ మాటలు. పల్లెటూరిపిల్ల అయిన మతి- కుముద్ ఉద్యోగం వదిలేశానన్నా కళవళపడలేదు. నగలిస్తావా అని అడిగినా ముఖమేమీ చిన్నబుచ్చుకోలేదు. మతిలో ఎలా వచ్చిందింత మార్పు! కుముద్ మొత్తానికి గారడీవాడే. ఎంత కల్లోకళలుగల మనిషయినా, ఎంత విశృంఖలంగా తిరిగే వాడైనా ఎదుటివాళ్లని వశపరచుకో గలిగిన విచిత్రమైనశక్తి ఉందతడికి. ప్రాపంచిక నీతి నియమాలు, రీతి రివాజుల్ని అతడు పాటించకపోవచ్చు. కాని తన నియమాలను మాత్రం తు. చ. తప్పకుండా అనుసరిస్తాడు. చులకనపాలేంతక్కువ కాదు మనిషికి. దుర్దాంతమైన మనః ప్రవృత్తి అతడిది. తాను బతికే ప్రపంచాన్ని స్వయంగా సృష్టించుకో గలగటం కూడా మాటలుకాదు. కుముదుడి ముందు తన మనోవ్యథ అంతా మరిచిపోతుంది. ఆమె ఏమీ దిగులుపడదు, ఏడవదు. దుర్భరమైన దుఃఖాన్ని కూడా లెక్క చెయ్యదు. వెనకాముందు ఆలోచనలతో ఎప్పుడూ హెచ్చరికగా ఉండే ఆమె మనస్సుకి కూడా విశ్రాంతి లభించిం దతడిదగ్గర...

రోజులు దొర్లిపోతున్నాయి. వర్షాకాలం వచ్చింది. గదికిటికీ ప్రక్కనే కటకటాలు ఉన్న చిన్నటి వరండాలో నిలబడితే- ఒత్తి గోడలూ అవీ కనపడుతూంటాయి మతికి. వాటిల్లో కూడా గావాదియా స్వరూపం కనపడు తుంటుందామెకి. కుడివైపున ఉన్న డాబా మీదుగా అవతల యెక్కడో ఉన్న రెవరిదో తోట కన్పిస్తూ ఉంటుంది. అక్కడి తాటిచెట్లు మతికేదో గావాదియా తాటితోపును జ్ఞప్తికి తెస్తున్నట్టుండేవి. క్రిందసందులో ఒరియా

## జరిగిన కథ

శశి పల్లెటూరి డాక్టరు. అతని తండ్రి గోపాల్ వరవంచన వృత్తిగాపెట్టుకుని డబ్బు గడించాడు. ఉన్నతాశయాలు ఉత్తమ సంస్కారం కలిగిన శశికి తండ్రితో పడదు. అతనికి ఆ పల్లెటూళ్లో సన్నిహితులయిన వారు చాలా కొద్దిమంది. పిడుగుపడి మరణించిన హారూఘోష్ కుటుంబంలో హారూకొడుకు పరాన్, అతనిభార్య కుసుమ, పెళ్లికానికూతురు మతి, నాటువైద్యుడు యామినీ కవిరాజుపడుచు భార్య సేన్‌దిదీ—వీరే. అతడు కలకత్తాలో చదువుకుంటూండగా సహాధ్యాయిగావున్న కుముద్ ఇప్పుడు వీధి భాగవతులజట్టులో చేరి ఊరూరా తిరుగుతూ శశివాళ్ల గావాదియా గ్రామంవచ్చి నాటకాలువేసి మతిని మంచి మాటలతో వలలోవేసుకున్నాడు. సేన్‌దిదీ మశూచికం పడి శశి వైద్యంతో చావు తప్పి కన్ను లొట్టపోగొట్టుకుంది. శశి చెల్లెలు బిందూను తండ్రిగోపాల్ కలకత్తాలో పెద్దవ్యాపారస్థుడయిన నందలాల్ కిచ్చి బలవంతపు పెళ్ళిచేశాడు. ఒకసారి శశి ఏదో పనిమీద కలకత్తా వెళ్ళాడు. అక్కడ శశి తన చెల్లెలు బిందూ భర్తచేతపడుతున్న అగచాట్లు చూడలేక ఆమెను నందలాల్‌కు తెలియకుండా స్వగ్రామం తీసుకు వచ్చేశాడు. ఆతరవాత ఒకనాడు శశి మిత్రుడుకుముద్ గావాదియా వచ్చాడు. శశి ఇష్టపడకపోయినా అతన్ని ఒప్పించి మతిని పెళ్ళిచేసుకున్నాడు. తరవాత భార్యతో 'హనీమూన్'కి వెళ్ళిపోయాడు. ఆ తరవాత ఇక అతనిపత్తా ఎవరికీ తెలియలేదు. చెల్లెలు బిందునుమళ్ళీ భర్తవద్ద వదలిరావటానికి కలకత్తా వెళ్లిన శశి ఎంతవాకబు చేసినా అతనిజాడ కనుక్కోలేకపోయాడు. కుముద్ కలకత్తాలోనే ఒక యింట్లో భార్యతో సహా కాపరంపెట్టాడు. స్వేచ్ఛాచారి అయిన అతని జీవిత విధానం పల్లెటూరిపిల్ల మతికి అంతు పరిపడలేదు. ఇకచదవండి:

మిఠాయి దుకాణం చూసినప్పుడల్లా గాంవాదియాలోని విపిన్‌సింగ్ మిఠాయికొట్టు గుర్తొస్తుంటుంది. ముఖ్యంగా మొహం ఎరుగని పల్లెటూరి వాళ్లెవరైనా బజారే వెడుతూంటే— గాంవాదియాలోని ఎరిగిన వాళ్ళ ముఖాలన్నీ గుర్తొస్తుంటాయి. ఇక్కడ పైన ఆకాశంలో ఎగిరే గ్రద్దలుకూడా గాంవాదియాలోని గ్రద్దల్లాగానే కన్పిస్తుంటాయి. మబ్బుపట్టి వాన కురవటంకూడా—ఆమెకి చిరపరిచితమైన గాంవాదియాలో వాన కురవటంలాగానే ఉంటుంది అచ్చగా.

కుముద్ ఓనాడు నిజంగానే మతి నగని అమ్మటానికి పట్టుకుని వెళ్లాడు. మతికి కాసేపు మనస్సుకి కష్టంగా ఉండకపోలేదు, ఏమయినా అతడు మొదట హారాన్ని అమ్మినప్పుడంతగా దుఃఖించలేదు ఇప్పుడు. కుముద్ మళ్ళీ తిరిగివచ్చేసరికి ఆమె కదివరకున్న రవంత చింతకూడా మాయమైపోయింది. "నా నగ తీసుకెళ్లి అమ్మారుకదా, మరి మళ్లీ హారం తీసుకువచ్చారు?" అని అడిగింది గోముగా.

"ఏమీ తీసుకురాలేదు" అన్నాడు కుముద్.

"అవుల్లెండి ఎందుకు తీసుకురావటం! తీసుకురాకపోతే నాక పోయారు."

మతి అభిమానంతో కుముద్ కంఠం కౌగిలించుకుని, అతడి వక్షస్సులో ముఖాన్ని దాచుకుని, ముసిముసి నవ్వులు నవ్వింది. మహానగరానికి కొన్ని అడుగులు దూరంలోఉన్న—ఈ గదిలో భర్తని కౌగిలించుకునిఉన్న మతిని చూస్తే—ఈమె గాంవాదియాలో పుట్టిపెరిగిన అమ్మాయి అని ఎవ్వరూ అనుకోరు. అపాయకరమైనవాడే కుముద్. అతడు బంధాలన్నీ త్రెంచివేసుకుని తిరుగుతూ బ్రతికొడిన్నాళ్ళూ. మమకారాన్ని, బాధ్యతని ఎరుగనివాడతడు. అలాంటివాడిమీద ఆధారపడి, మతి నిశ్చింతగా ఉండటం చూస్తే ఆశ్చర్యం వేస్తుంది.

"నీకోసం నేనొక వస్తువు తీసుకువచ్చాను మతీ!" అన్నాడు కుముద్.

"ఏది? ఇలా ఇవ్వండి."

కుముద్ తన జేబులోంచి ఆ నగనే తీసి ఆమె కిచ్చాడు. అతడివాళ అమ్మటానికి తీసుకువెళ్ళిన నగనే తిరిగి ఇచ్చాడన్న మాట: నాటకాలు వేయటంమూలంగా ఎంత నాటకం ఆడటం నేర్చుకున్నాడు కుముద్. ఏమయినా సహజంగా— మాయాలు ధోరణిలో చెయ్యటం అనేది అతడి జాతకంలో లేదు. ఆనందంతో ఉబ్బి తబ్బిబ్బయింది మతి. ఇది కేవలం నగ తిరిగి యివ్వటమేకాదు, అమాయకురాలైన తన భార్యకి దీంతో పాటు ఇంకెంతో యిచ్చాడు కుముద్.

"డబ్బెక్కడిది?"

"ఓ డబ్బున్న స్నేహితుడిదగ్గర అప్పుచేశాను."

"అప్పు సొప్పు-అది మీ రెంత తీర్చేదీ తెలుసు నాకు"అంటూ మతి కిలకిల నవ్వింది.

కుమద్ నవ్వుతూ. "అతడు చాలా డబ్బున్నవాడు. నేను మళ్లీ తీర్చినా తీర్చకపోయినా అతడి కిదో పెద్దలెఖ్ఖలోది కాదు." అన్నాడు.

* * * *

వినోదినీ భాగోత సమాజం యజమాని దగ్గిరికి కుముద్ ఓ మనిషిని పంపించాడు. మూడోనాటికల్లా అతడు కుముద్ యింటికి వచ్చాడు. అతడు లోపలికి వస్తూనే "ఏమయినా మొత్తానికి నువ్వు ఖలేవాడివి కుముద్. ఎందుకిలా పారిపోయావో చెప్పు అయినా? ఎక్కడా అయిపూ—అనవాలూ లేకుండా పోయావే!" అన్నాడు.

కుముద్ నవ్వుతూ—"కూర్చోండి ఘోష్‌గారూ! కూర్చోండి కులాసా? సమాజం సాగుతోందా?" అని అడిగాడు.

"దివ్యంగా సాగుతోంది. నువ్వు వెళ్లిపోయాక సమాజం చాలా వృద్ధిలోకి వచ్చింది."

"ఖేష్. చాలా సంతోషం. నామీద కోపం వచ్చి ఉంటుంది మీకు. అవునా?".

"కోపంవస్తుందో రాదో నువ్వే ఆలోచించుపోనీ. అంత డబ్బు అడ్వాన్సుగా తీసుకుని అయిపులేకుండా పారిపోతే—" అంటూ కుముద్తో మధ్యవర్తిగాచేసి మాట్లాడటం మొదలెట్టాడతను.

"పారిపోవటమేమిటండీ! పారిపోలేదు. కొన్ని నెలలు సెలవు తీసుకున్నాను—పెళ్లి —గిళ్ళీ చేసుకున్నానుగా మరి! ఈమధ్య మీ దగ్గరికి ఓసారివద్దామనికూడా అనుకున్నాను."

యజమాని వింటూ—"పెళ్ళిచేసుకున్నావా? ఊఁ అయితే ఇంతకీ చేసేసుకున్నావన్న మాట పెళ్ళి!" అన్నాడు. ఆ మాటమీద

ఆగిపోయింతగా నమ్మకం కుదిరిన తగు

తర్వాత కొంచెం గంభీరంగా "పోనీ చేసుకునేవాడివి మా అమ్మాయినే ఎందుకు చేసుకోక పోయావ్, బాబూ? మా అమ్మాయి చేసిన తప్పేముంది చెప్పు?" అన్నాడు.

కుముద్ మెదలకుండా ఊరుకున్నాడు. యజమాని కొంత సేపు ఏదో పరధ్యానంగా కూర్చున్నాడు.

"ఇలాంటి పిల దొరకదు కుముద్; నువ్వు చూశావుగా దాన్ని. అలాంటి పిల సాధారణంగా దొరుకుతుందంటావా? నువ్వే చెప్పు పోనీ...అప్పుడది నీకంత నచ్చలేదు. ఇంతకంటె పిచ్చి ఎక్కడైనా ఉంటుందా?"

యజమాని చాలాసేపు కూర్చుని, చాలా సంగతులు మాట్లాడాడు. కుముదుడితో ఓ ఒడంబడిక కూడా కుదిరింది. కుముద్ మళ్లీ వాళ్ళ సమాజంలో చేరేట్లు—అడ్వాన్సుగా తీసుకున్న డబ్బుని పెళ్లికి కానుకగా యిచ్చినట్లు కొట్టేసేట్లు ఒడంబడిక...కుముదుడితో నెగటం కష్టం. యజమానిని నిలువునా ముంచిందీ విడిచిపెట్ట లేదా అతడు :

"సమాజాన్ని మళ్ళీ మంచి కట్టుదిట్టం చేయాలి బాబూ: ఊరికే వేషం మాత్రం వేస్తే సాగదు."

"కుముద్ నవ్వుతూ"—అదెలా సాగుతుంది? సమాజం కట్టుదిట్టంగా లేకపోతే మా వేషాలు మాత్రం రాణిస్తాయా?" అన్నాడు.

యజమాని నోటినిండా నవ్వి, ఆనాటికి వెళ్లిపోయాడు.

కుముద్ మళ్ళీ యధాగాన సమాజంలో చేరుతాడు, ఊరూరా తిరుగుతూ మళ్లీ ప్రవీర రాకుమారుని వేషాలు వేస్తాడు. మతి ఏమవుతుంది? ఎక్కడుంటుంది ఆమె? ఎవరిదగ్గిర ఉంటుంది? ఇది సులభ సమస్య కాదు. కాని మతికా బెంగేమీ ఉన్నట్లు తోచదసలు. ఆనందంలో—మైకంలో ఉక్కిరిబిక్కిరవుతోందామె. బెంగపెట్టుకునే సతో కూడా క్రమంగా లోపించినట్లుంది ఆమెలో.

కుముద్ చివరికి ప్రస్తావన తెచ్చాడు. "నేను జట్టుతో కలసి తిరుగుతుంటె నువ్వెక్కడుంటావ్ మతీ?" అని అడిగాడు.

మతి తలవంచుకు "మీరే చెప్పండి" అన్నది.

"గాంవాందియా వెడతావా?"

"గాంవాందియాకా" మతి గతుక్కుమంది. గాంవాందియా సంగతి మనసులోంచి తుడిచేసుకోమని ఆదేశించిన వ్యక్తే—తనంతట తానే అక్కడికి వెళ్లమని చెపుతున్నాడు మళ్ళీ. కుముదుడి కళ్ళతో ఆమెకళ్లు కలిశాయి.

కుముదుడి కళ్లలో ఏమిటి వెతుకుతోంది మతి? కుముద్ క్షణ క్షణానికీ రంగు ఫిరాయిస్తూంటాడు. ఇవాళ చెప్పింది రేపు ఎగరగొట్టేస్తాడు. అయినా మతిలాంటి పిల్లని ముగ్ధురాల్ని చేసేటంత మూర్తి చెందని ప్రత్యేకత ఏదయినా ఉండి ఉంటుందా?

"గాంవాందియా వెళ్లమంటారా?"

"వెళ్లి కొన్ని నెలలపాటు అక్కడ ఉండు. నేనిక్కడ కొన్ని సర్దుబాటూ అవీ చేసుకుంటాను."

"ఏం సరుబాట్లు చేసుకుంటారు?"

కుముద్ గంభీరంగా—"సమాజాన్ని ఓ దారికి తీసుకువస్తాను. కాస్త డబ్బూ అదీ కూడబెడతాను. అన్ని సర్దుబాట్లూ అలాగే ఉండిపోయాయి కదా!" అన్నాడు.

చాలా విచక్షణతో అన్నమాటే. అయినా ఆమాట మతికి కష్టంగానే తోచింది. కుముద్ ఇలా మాట్లాటం నప్పదు. మూడు మాసాలక్రితం కుముద్ ఈమాత్రం విచక్షణ చూపి ఉన్నట్లయితే మతి చాలా సంతోషించేది. కాని ఇప్పుడామె అలాంటిదాన్ని కోరటం లేదు. ప్రతిదానికి కోతలుకోస్తూ; పనిఅంటే బద్ధకించి పడుకుంటూ, తనచేత కాళ్ళు పిసికించుకుంటూ ఉండే కుముద్ అంటేనే ఇవం ఇప్పుడామెకి.

"వచ్చి తీసుకువెళ్లమని మీ అన్నయ్యకి ఓ ఉత్తరం రాయి."

"మీరు రాయరాదూ?"

"ఆహాఁ నువ్వేరాయి."

మతి గంభీరంగా "అయితే పోనీ మీరు అడ్రస్ రాసిపెట్టండి" అన్నది.

మతి రాసిన ఈ ఉత్తరం చూసుకుని—పరాన్, శశి ఇదరూ కలకత్తా వచ్చారు. శశి ఊరికే మతిని చూదామని కాదు, వేరేపని ఉండి వచ్చాడు. శశి కుముద్‌కి ఎన్నో విషయాలు చెప్పదామను కున్నాడు. కాని ఏమీ చెప్పటం పడలేదు. శశి మతినిచూసి తెల్లబోయాడు. గాంవాందియాలో తన కళ్లముందు పెరిగి పెద్దదయిన పిల్లేనా ఈ మతి? తానేదో ఎన్నడూ చూసియెరగని యువతి, ఇన్నాళ్ళూ యెక్కడో ఉండి, ఇవాళే మొదటిసారిగా తన యెదుటికి వచ్చి నుంచున్నట్లుంది ఈమె. అమాయకంగా కళ్లు అప్పగించిచూసే ఆమె దృష్టి ఎంత స్నిగ్ధోజ్వలంగా మారిందిప్పుడు! ఆమె నడక, ఆ తీరు ఎంత అందంగా మారిందిప్పుడు! ఆమెలోని ప్రతి కదలిక ఇప్పుడెంతో మనోహరంగా కన్పిస్తున్నట్లుంది. ఆమె శరీరం, మనస్సు కూడా అహరహమూ ఎవరి ఆకర్షణకో, ఆహ్వానానికో ఆత్మాతురతతో ఎదురు చూస్తున్నట్లు తోచిందతడికి.

"మతి ఇప్పుడెలా కన్పిస్తోంది శశి?" అని అడిగాడు కుముద్ ఎవరూ లేనప్పుడు.

"నువ్వు ఆమెని ఏంచేశావ్ కుముద్ ?"

"ఏమీ చెయ్యలేదు. మాట్లాడినప్పుడు మాట్లాడుతూ లేనప్పుడు మెదలకుండా ఊరుకుంటూంటాను"

బిందులోనూ వచ్చింది మార్పు—ఈమెలోనూ వచ్చింది. శశి ఆలోచనలోపడి, "గాంవాదియా పంపుతున్నావ్ కాని, అక్కడ ఉండగలదో లేదో ఆలోచిస్తున్నాను కుముద్" అన్నాడు.

"అదేమిటలా అంటావ్ శశీ? గాంవాందియాలో పుట్టి పెరిగినది అక్కడికి వెడితే ఉండలేదా ?"

బిందుకూడా గాంవాందియాలో పెరిగినదే. అక్కడికి వస్తే ఉండలేకపోయింది. కాని శశి ఇంక ఏమీ మాట్లాడలేదు. కోజిల్లా అతడి కెలాగో ఉంది మనస్సు. మతి కళ్ళలో కన్పించే మెరుపు కుసుమ కళ్ళలో కన్పిస్తూఉంటుందా అని ఆలోచించాడు. ఉహూఁ. ఆమె కళ్లలో ఈ మెరుపు లేదు. కుముద్ ముందు తాను తక్కువవాడినే అన్న భావం మళ్ళీ శశికి ఈనాడూ కలిగింది.

ఆనందంతో, సౌఖ్యంతో కళకళలాడుతూన్న మతి ముఖం, గుర్పాటు కలిగించే ఆమె మందగమనపు తీరు చూడటంతో మధ్య మధ్య కుముద్ విషయమై అతడికి కలుగుతూండే అసహ్యభావం అంతా ఇప్పుడు తుడుచుకుపోయినట్లుంది. కుముద్ జీవితపు మాల మంత్రమేదో అతడికిప్పటికీ అంతుపట్టలేదు శశి ఇవాళ అదే ఆలోచిస్తున్నాడు. కుముద్‌లో ఏముంది? అతడి జీవితం మొదట్నుంచీ అంతా మోసపుచ్చటమే అయినా ఆమె జీవితాన్నింత ఐశ్వర్యవంతం చెయ్యగలిగిన రహస్యమైన సంపద ఏముంది అతడికి?

ఇన్నాళ్లూ ఒక ఉత్తరమ్కక్కయినా రాయకపోయినందుకు మతి మొదట్లో శశి–పరాన్‌ల యెదుటికి రావటానికి కొంచెం సంకోచించింది. కాని ఈ విషయాన్ని వాళ్ళంత నేరంకింద ఎత్తిచూపక పోవటంతో ఆమెకా సంకోచం కాసేపట్లోనే మాయమయింది. పరాన్ బాగా చిక్కిపోయాడు. పీక్కుపోయినట్లున్న అతడి ముఖం చూసేసరికి ఆమెకి లోపల చాలా జాలేసింది. అతడి కేదైనా సుస్తీ చేసిందా అని గుచ్చి గుచ్చి అడిగింది. తర్వాత ఊళ్లో సంగతులు, మోక్షదా కుసుమల సంగతులు తరిచి తరిచి అడిగి తెలుసుకుంది. మతి కొంచెం సిగ్గరి, రవంత తెంపరి! ఒక యింటికోడలై అన్న యెదుట, శశియెదుట ఇదే తొలిసారిగా నిలబడటం. ఆమె తన యింట్లో, తన సంసారంలో పుట్టింటి సంగతులు తెలుసుకుంటూ

# ★ జీవనలీల ★

కొంచెం గృహిణిలా గాంభీర్యాన్ని వ్యక్తపరచటం అనేది ఆమెకి న్యాయమైన అధికారమే. భాద్రపదమాసపు ఉబ్బ: మతి విసనకర్ర తీసుకుని వారికి విసురుతూ కూర్చుని, దాహానికి చల్లటినీళ్లు తెచ్చి ఇచ్చింది. ఆమె ప్రతిపనీ ఎంతో ఒబ్బికగా ఉన్నాయి ఇప్పుడు. మతి ఆ రోజున ఎంతో శ్రద్ధగా వంటచేసింది. భోజనం ముందు కూర్చుని కళి ఆమెవంటను చాలా మెచ్చుకున్నాడు. కాని పరాన్ అంత ఇదిగా భోంచెయ్యలేదు. మతి బ్రతిమాలగా బ్రతిమాలగా "గొంతు పచ్చిపుండులా ఉంది మతీ! ఇంతకారం తినలేదు" అన్నాడు ఫరాన్.

"గొంతు పుండు అయిందా? ఎందుకని?"

మతి అంత కంగారుగా అడగటంమాని తెల్లబోతూ కళి నవ్వటం మరిచిపోయాడు. అంత మనస్సు ఉప్పొంగిపోతున్న స్థితిలో ఉన్న వాళ్లకికూడా ఎవరిగొంతో పుండయిందన్నా ఇంత వ్యాకుల పడుతుందా మనస్సు పరాణ్ ఇవన్నీ తెలిసినవాడు కాడు. అంచేత అతడు నవ్వుతూ "గొంతు ఎందుకు పుండు అయిందో నాకేం తెలుస్తుంది? చినబాబుగారు డాక్టరు. వారిని అడుగు" అన్నాడు.

మతి మరింత కళకళపడుతూ "అయితే మరి నువ్విలా భోంచేస్తున్నావ్? ముందు ఎందుకు చెప్పలేదు? కూరలో కారం తగ్గించే దాన్నిగా!" అన్నది.

"కారం తక్కువ వేసినా కూరలే తినలేను అసలు."

"అయితే పాలు త్రాగు, పంచదార వేసి ఇస్తాను."

ఈసారి పరాన్‌కి కళ్ళు చెమ్మగిలాయి. అతడేదో వ్యవసాయం చేసుకు బ్రతికే మోటుమనిషి. జీవితంలో ఎన్నడూ ఎవరూ అతణ్ణింతగా ఆదరించి యెరుగరు.

మతి మనస్సును గాంవాందియావైపుకే తరాసే ఎక్కువగా ఆకర్షిస్తున్నాడు. గొంతు పుండు అవటంవల్ల అతడేమీ తినలేక పోయాడు. ఆ తినలేకపోవడం మూలంగానే అలాగుండే అన్నయ్య ఇలా చిక్కిపోయాడు. గాంవాందియా వెళ్లాక అన్నయ్య భోజనం విషయమై ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలి తాను; తన సుఖ-సౌకర్యాల విషయం ఏమీ పట్టించుకోనే పట్టించుకోడు అన్నయ్య. ఎన్ని పనులు, ఎన్ని ఉపచారాలు చెయ్యటం నేర్చుకుంది తాను; ఎంత చలాకీగా, ఎంత నేర్పరిలా తయారయింది తాను; తన పత్రాఅంతా అందరికీ చూపాలనే ఆరాటంకూడా కలగటం ప్రారంభమైందిమతికి. అందరూ తనని చూసి తెలబోవాలి. కుసుమ ఏమంటుందో ఏమో చూడాలి. ఊళ్ళో ఆడవాళ్ళంతా వచ్చి "ఇన్నాళ్ళూ ఎక్కడున్నావ్? ఏమిటి సంగతులు?" ఎంతో ఆదుర్దాగా అడుగుతారు.

రెండురోజులు పోయాక కుముద్ వెళ్ళిపోతాడు. చాలా దూరంనుంచి వినోదినీ భాగవత సమాజానికి ఆహ్వానం వచ్చింది. కుముద్ ఏం వేషం వేస్తాడు? ఆ ప్రవీరరాజపుత్రుని వేషమేనా?

"అయ్యో, మతి ఇహ ప్రవీర రాకుమారుని వేషంలో కుముదుణ్ణి చూడలేదు. ఒళ్లు పులకరింపజేసే అతడి "డైలాగ్స్"ని వినలేదు. విగులతో బుంగమీసం పెట్టుకు కూర్చోడంకంటె చెయ్యకలిగిందేముంది? మతి ఆడది—ఇల్లాలు! మానవులు ఇష్టంవచ్చినట్లు మారగలిగే అవకాశం ఉంటేనా! అవసరం అయినపుడు ఆడవాళ్ళు మగవాళ్ళుగా—మగవాళ్ళు ఆడవాళ్ళుగా మారగలిగితేనా!...

"మారుతావులే మతీ: ఈ రోజుల్లో అంతే" అన్నాడు కుమార్.

కుముదుణ్ణి గట్టిగా కౌగిలించుకుని "ఫోండి!" అన్నది మతి.

కుముద్ నవ్వాడు. "అదేమిటె: నువ్వు స్వయంగా చూసే ఉన్నావ్‌గా! జయ మగవాడు, వనవిహారి ఆడది. కాదూ?"

మతి నవ్వలేదు.

"జయాదీదిని ఒకసారి వెళ్లి చూసి రాకూడదూ?"

"వెళతా, వెళతా. తొందరేముంది?"

అంటూ కుముద్ ఆవలించాడు.

రామన్న విరహచ్ఛాయ, గాంవాందియా వెడుతున్నాకదా అనే ఆనందరేఖ మతిముఖంలో రెండురోజులు తొణికిసలాడాయి.

తర్వాత కుముదుకు వెళిపోయేరోజు వచ్చింది.

సాయంత్రం రైలు. కుముద్ వెళ్లేసమయం దగ్గిర పడుతున్న కొద్దీ మతిమనస్సులో కంగారు బయలుదేరింది. ఇంత కష్టంగా ఉండటం మతికే ఆశ్చర్యం వేసింది. తనఊరు వదిలి వచ్చేప్పుడూ

[46-వ పేజీ చూడండి]

# బంగారయ్య చచ్చాడు!

"బంగారయ్య చచ్చిపోయాట్ట.....శవం దొరికింది" తెల్లవారేపాటికి పుసులూరంతా గొల్లుమంది వార్త!

"ఆ...నిజంగానా?" కొందరు ఆశ్చర్యపోయారు. "చచ్చాడూ?...పీడ వదలింది" మృదువుగా అన్నారు మరి కొందరు;

"ఆ...బంగారయ్య, ఏమిటి చావటం ఏమిటి" అనుమానాన్ని ప్రకటించిన వారూ లేకపోలేదు.

ఎవరేమనుకుంటేనేం బంగారయ్య చచ్చాడు; బంగారయ్య కొడుకు సత్యం శవాన్ని కారుమీద పుసులూరు తీసికొని వచ్చాడు; తండోపతండాలుగా జనం చూచివస్తున్నారు బంగారయ్య శవాన్ని.

కాని, ఒక్కరు కాకపోతే, ఒక్కరైనా 'పాపం' అన్న మానాన పోలేదు.

ప్రక్కింటి అబ్బాయికి పడిశెం పట్టిందన్నా, ఎదురింటి అమ్మాయికి ఆరోగ్యం బాగులేదన్నా, 600 సం॥ క్రిందట భూకంపంలో, 6 వేల మంది మరణించారన్నా, అటంబాంబు ప్రేలితే, బహుళ ప్రజానీకం నశిస్తుందన్నా కళ్ళ వెంట నీళ్లు జలజలా రాల్చి, చిర్రున చీది బడిపంతులు జోగయ్యగారి భార్య సోమిదేవమ్మ సైతం 'అయ్యో పాపం' అనకపోగా, "పోయాడూ! పీడ విరగడయింది—" అంది.

ఎన్ని కొంపలుముంచి, ఎంత పాపాన్ని తెమ్ముకొన్నాడో....ఇలాంటి దిక్కులేని చావు చచ్చాడు" అన్నారంతా

లక్షాధికారి బంగారయ్య దిక్కులేని చావే చచ్చాడు...; శవం నీటిలో నాని, నాని, చివరికి గుర్తుపట్టలేని స్థితిలో మూడు రోజులకు చిక్కింది.

దిక్కు మొక్కు లేకుండా, నెత్తిన గుడ్డతో పుసులూరు చేరిన బంగారయ్య...చివరకి గుర్తుపట్టలేని చావే చచ్చాడు...

* * *

సరిగ్గా 20 సం॥రాల నాటి మాట. బంగారయ్య నెత్తిన గుడ్డ వేసికొని పెళ్ళాంతో సహా పుసులూరు చేరాడు. పుసులూరు చేరిన రెండు మూడు రోజులలోనే కరణం, మునసబుగార్లతో సంప్రదించి, పెద్దకాపు గారితో మాట్లాడి, ఒక పూరిగుడిసెలో కాఫీ యిడ్లీల వ్యాపారం సాగించాడు, పొట్టకూటికి. క్రొత్తలో భుక్తికి కరువైనా, సరిక్రొత్త నాగరకతా విన్యాస విలాస భంగిమలతో పెంపొందుతూ, పట్టణపు పోలికలను తనలో పులుముకొంటున్న 'పుసులూరు'లో బంగారయ్య వ్యాపారం బాగనే సాగింది. గిర్రున సంవత్సరం తిరిగేపాటికి బంగారయ్య కాఫీగుడిసె కొత్త పెంకుటిల్లు ఆకృతిదాల్చి బంగారువిలాస్‌గా మారింది. ఆ సంవత్సరమే బంగారయ్య రూపాయికి, అణావడ్డీ వ్యాపారం, చిన్నచిన్న నగలు కుదువపెట్టుకొని పైకం యిచ్చే వ్యవహారం మొదలెట్టాడు. మరో సంవత్సరం దాటేపాటికి, కాఫీహోటలు మానివేసి టోకువ్యాపారం. వడ్డీవ్యాపారం, కాంట్రాక్టులు, కమీషన్ వ్యాపారాలలోకి దిగింది బంగారయ్యపని–పట్టిందల్లా బంగారమయింది, కమీషన్ వ్యాపారంలో రాబడి పెరిగిపోయింది.

**గంధం యాజ్ఞవల్క్య శర్మ**

వడ్డీవ్యాపారం సహాయంతో ...కొన్ని పేదల కొంపలను కూల్చివేసి పెద్ద "బంగారు నిలయాన్నే" కట్టించాడు బంగారయ్య.

పుసులూరు చేరిన నాలుగు సంవత్సరాలలో అదృష్టదేవత బంగారయ్యను అవహించి పుసులూరు లక్షాధికారిగా నిలబెట్టింది.

బంగారయ్య పెద్ద పలుకుబడిదారు; పెత్తందారు. బీదసాదలను వడ్డీతో పీల్చి పిప్పి చేసివేశాడు. దానధర్మాలు చేయటం కాని, ఇంట్లో వ్రతాలు, పండుగలు చేయటంకాని, లాంటి అలవాటులేని బంగారయ్య లక్షాధికారి కాక మరేమౌతాడు?

ఎంగిలిచేత్తో కాకిని తోలటంవలన, కొన్ని మెతుకులు ఎలా పడిపోతాయో! ఒక మెతుకే, ఒక బ్రతుకు కెలా సమమవుతుందో బంగారయ్యకు బాగ తెలుసు.

పిసినారి...కర్కోటకుడు; దయ, కరుణ అనేవి కంచుకాగడాలతో వెదకినా పొరపాటునైనా కన్పించవు—గడువు దినానికి వడ్డీలో పైకం చెల్లించకపోతే, ఆ, ఆభాగ్యుణ్ణి కోర్టుచుట్టూ త్రిప్పి ఖర్చులతో సహా రాబట్టేదాకా నిద్రించేవాడు కాదు. రావలసినదాంట్లో దమ్మిడి, అయినా వసూలు కాకుండా వుండటానికి వీలులేదు; ఎవరైనా "దయచూపండి" అన్నారా! వాళ్లకు మూడురోజులపాటు ఉపన్యాసమిచ్చి ఆ మహోపన్యాసంలో, తనెంత కష్టపడి 'దమ్మిడీలను' సంపాదించింది, తెలియచెప్పేవాడు.

బంగారయ్య కొడుకు, సత్యం సైతం ఎన్ని విశాల భావాలు వున్నవాడైనా తండ్రిని చూచేపాటికి నోరుతెరలేక పోయేవాడు.

"కాని వదలమనంగానే సరికాదు, ఆ "కాని" సంపాదించు తెలుస్తుంది కష్టం. అనేవాడు సత్యాన్ని బంగారయ్య ఎప్పుడైనా, ఏ సందర్భంలోనైనా, "కాని," "అర్ధ" దగ్గర సత్యం కొద్దిగా తత్సారంగా మాట్లాడితే. అంతేకాదు, ఆ రోజల్లా బంగారయ్య, కొంపమునిగినట్లు తనలో తనే అరచుకొంటూ, గుండెలు బాదుకొంటూ, తన తదనంతరం సత్యం ధన మెలా దుర్వినియోగపరుస్తాడో, ఊహించుకొంటూ, అలా వూహించుకొని 'అయ్యో' అనుకొంటూ గడిపేవాడు.

అవకాశం చిక్కినప్పుడల్లా సత్యాన్ని పిలిచి. నాయనా! సత్యం!, "ధనం" "మానవుడు" "విలువలు" అంటూ ఉపన్యాసం మొదలెట్టి చివరకు 'ధనం గొప్పది' అంటూ ముగించేవాడు. సత్యం మాత్రం, తనకుతండ్రి పద్ధతులు నచ్చకపోయినా, మాట మీరలేక, నోరుమూసికొని వూరుకోవలసి వచ్చేది.

'బంగారయ్య' అంటే చాలు, అందరి హృదయాలలోను, "పిసినారి" బంగారయ్యే ప్రత్యక్షమయ్యేవాడు.

ఇంతకూ....ప్రాపంచికమైన సకల వసురాసులలోను, అతిప్రధానమైన 'ధనం' అనబడే వస్తువుతో తన జీవితాన్ని గట్టిగా బంధించుకొన్న బంగారయ్య అంత ధనాన్ని వదలి చనిపోతాడని ఎవరనుకొన్నారు?

అయినా "పాపీ చిరాయుః" అని బంగారయ్యకు చావేమిటి?

కాని బంగారయ్య చచ్చాడు.

* * *

మూడురోజులు ఒకటే వర్షం; పడమర కొండలమీద కుంభ పోతపోసింది. తెల్లవారేపాటికి నాగులేరు నురుగులు కక్కింది; పుసులూరులోకి నీళ్ళువచ్చాయి; పుసులూరులోకి

# ★ బంగారయ్య చచ్చాడు! ★

నీళ్ళు వచ్చాయంటే దిగదల 'ఊరు' 'పాలెం' మునిగిపోయింది అన్నారంతా!

ఇంకొక్కడి 'పాలెం' అంతా వరదలపాలు 50 సం॥ రాల క్రిందటి వరదల్లో పోయినట్టే సర్వం నాశనమయింది" అన్నారు. 6, 7 పుష్కరాలు గడచిన పెద్దలంతా.

"బంగారయ్య గుండెల్లో రాయిపడింది" — పాలెంలో రైతు 'రంగయ్య' యివ్వవలసిన సైకం 4 వేల రూపాయలు ఖాళీ అన్నమాట వాడు కొత్త "హరీ" అంటె తినకు తువరం, బంగారయ్య వలుగరయిదుగురిని సలహా అడిగాడు—"ఇంకొక్కడి రంగయ్య... పాలెమే, దక్కటం కష్టం" అన్నారంతా.

చివరకి బంగారయ్య 'పాలెం' వెళ్లటానికి నిశ్చయించాడు.

నాగులేరు "ఉగ్రరూపులు" "పగులల" మీనుంచే బ్రహ్మదేవుడుకూడ దాట్ళటం కష్టం.

పాడు 4 వేలు పోతే పోయాయి. వద్దు అన్నారు బంగారయ్య ఇంట్లో!

కాని బంగారయ్య కళ్లలో 4 వేల, రూపాయల నోటు నీళ్ళలోపడి కొట్టుకొని పోతున్నటు కనిపించాయి; ఆనీటిలో కొట్టుకొనిపోతున్న నోట్లను తినాలాగైనా సాధించాలనిపించింది; బయలుదేరాడు—. అతనిని ఆపటానికి జరిపిన ప్రయత్నం విఫలమయింది.

"నేను వెళేపాటికి రంగయ్య కొన ప్రాణాలతో వున్నా సైకం పట్టుకొస్తాను—" అంటూ బయలుదేరాడు బంగారయ్య.

కనుచూపుమేర అంతా నీళ్ళే!

నాగులేరు దాటించటానికి ఎవరూ ముందుకురాలేదు. చివరకు తనే, ఒక చిన్న పడవలో, బయలుదేరాడు పాలెంకేసి; అంతా ఆశ్చర్యంగా చూచారు. ఒడ్డునుండి 'సత్యం' 'వద్దు' అని కాళ్లా వేళ్ళాపడి బతిమాలాడు;

'పిచ్చివాడా! నాలుగువేలకన్నా నా ప్రాణం గొప్పదా" అని ప్రశ్నించాడు బంగారయ్య—.

ఆచిన్న 'డింగి' బయలుదేరింది; కనుచూపుమేరవరకు చూచారంతా... పడవను; పడవ పాలెంకేసి మలుపు తిరిగింది;

అంతే! ఒకటి, రెండు, మూడు... రోజులు గడచిపోయాయి; వరద తిగ్గుముఖం పట్టింది. కాని బంగారయ్య రాలేదు; అప్పటికి రహదారు బాగుపడాయి. పాలెం, పుసులూరుమధ్య ప్రయాణా సానయి; పాలెం వరదకు కొద్దిగా నష్టపడా, అంతగా నష్టపడలేదు, మురుగు కాలవమూలంగా;

ఇంతకూ బంగారయ్య పాలెం చేరలేదట. సత్యం 'పోలీసు రిపోరు' యిచ్చాడు; వెతికించాడు. నాలవనాడు ఆ వూరికి 5 మైళ్లలో మునిగిపోయిన పడవ కన్పించింది. ఆ పడవకు, అరమైలు పైన శవం దొరికింది. గుర్తుపట్టలేని స్థితిలో వుంది, శవంకి బంగారయ్య కట్టుకొన్న నీరు కావిరంగు పంచె వలన గుర్తించారు; శవాన్ని. సత్యం కారులో తీసుకొని వచ్చాడు. ఉత్తరక్రియలు జరిపాడు. పెద పెట్టున దినవారాలు నెరవేర్చాడు... పీనుగ దిక్కుకి అన్నదానం జరిగింది;

తన తండ్రి బ్రతికివుండగా చేసిన పాపాలన్నీ కడిగివేయాలని . సంకల్పించాడు సత్యం; తండ్రికి చేసిన కర్మలకే 4 వేల రూపాయలు ఖర్చుచేసాడు; చాలమంది ప్రొనోట్లు త్రిప్పి యిచ్చివేశాడు; వడవ పెట్టబడి తనదగ్గరవున్న సొమ్ములను, ఎవరివి వారికి యిచ్చివేసాడు. తండ్రిపేరుతో స్కూలు పెట్టటానికి 10 వేల రూపాయిలు చందా ప్రకటించాడు.

బంగారయ్య చనిపోయిన 12 దినాలకల్లా సత్యం 20 వేల రూపాయిలు ఖర్చుచేసాడు. ప్రజాసేకర్యార్థం, మరికొంత ధనాన్ని వినియోగిస్తానని పెద్దలముందు ప్రకటించాడు.

"బంగారయ్య చచ్చాడు, ఊరు బాగుపడుతోంది" అన్నారంతా!

కాని 'విధి' దృష్టిలో, ఎలాంటి విచిత్ర సంఘటనలు జరుగుతాయో చెప్పలేం! విధి విలాస విన్యాసభంగిమల మాటులో, ఎంతటి ఆశ్చర్యాన్ని గొలిపే సంఘటనలు మాటు మణగివుంటాయో?

చచ్చాడన్న బంగారయ్య, సజీవంగా తిరిగి, 18వ రోజు, పుసులూరు, గుండెలు బాదుకొంటూ వచ్చాడు; అందరి గుండెలు ఒక్కసారి ఆగి మళ్ళీ కొట్టుకొన్నాయి.

ఇంతకూ, చచ్చిన బంగారయ్య చావలేదట. ఆ పడవ తల్లక్రిందు లవ్వగానే, నీటివాలున ఈదుతూ, కొట్టుకొనిపోయాట. చావవలసిన బంగారయ్య, అదృష్టం బాగుండి, ఒక తాటిదూలం దొరికింది; దాని సహాయంతో, సరిగా 10 మైళ్ళ దూరంలో వున్న ఊరికట్టు చేరాడు బంగారయ్య. తీరా విచారిస్తే, అది రామాపురమని, ఆ రామాపురంలో, 200 రూపాయిలు ఇవ్వవలసినవాడు ఒకడున్నట్టు తెలిసింది; ఈ 18 రోజులు వాడి దుంప తెంచి ఆ సైకం వసూలుచేసి కొని మరీ, తిరిగి కొంపచేరాడు బంగారయ్య ఈలోగా పుసులూరులో, కాని రంగు పంచెగల శవాన్ని బంగారయ్య శవమని తగలపెట్టటం జరిగింది—" 20 వేల రూపాయిలు నామరూపాలు లేకుండా హరించిపోయాయి. బ్రతికివున్న బంగారయ్యకు కర్మలు జరిగాయి.

చచ్చిన బంగారయ్య 18వ రోజు వచ్చి, సత్యం చేసిన 20 వేల రూపాయిల ఖర్చు చూచి, గుండెఆగి మళ్ళీ చచ్చాడు;

ఇంతకూ, బంగారయ్య చచ్చాడు!! ★

# గుండె గొంతుకలోన

## సత్యం శంకరమంచి

'స్త్రీ మనస్సుని నమ్మకూడదు'—ఇది మురారి ఆఖరుగా అన్న మాటలు.

అవును నమ్మకూడదు. వాళ్లకి నమ్మించటం చేతకాదు. తాను మనసా నమ్మినట్లు ప్రవర్తించటం తన హృదిలో నిక్షేపించుకున్న భావాన్ని బయటపెట్టి, తాను విశ్వసించిందాన్ని విప్పి చెప్పటం అందరి మానవులపట్ల సహజమైనా అబలకు—ముఖ్యంగా తనకు సాహసం. 'నా మనసులోని మాట ఇది' అని చెప్పటానికి ఏదో సిగ్గు, భయం సిగ్గూ భయంకంటె బలవత్తరమైనది. సున్నితమైన దన ఏదో అంతర్యామిత మైన శక్తి అడ్డు తగులుతుంది. తాను నమ్మినదాన్ని పొడిపొడిగా అక్షర రూపంలో చెప్పలేని కారణాన, తాను చీకటి ముసుగులో తన్నుకోల్పోతున్నానని తెలిసినా సరే, తన జీవన తారకలు సమసించబోతున్న విషయం స్పష్టమైనా సరే, తన వివేకం 'నీ గొయ్యి నువ్వే తవ్వుకొంటున్నావ్' అని నచ్చచెప్పినా సరే—తను మాటాడదు. తను హృదయపూర్వకంగా విశ్వసించిన భావానికి అక్షరరూపం ఇవ్వలేదు. తన నోటితో బయటపెటలేదు. దానికి కారణం స్త్రీత్వానికి అంటిపెట్టుకున్న అశక్తతే. అయితే మురారి మాటలు అక్షరాలా నిజం.

తన హృదయకవాటం మురారికీ, శ్రీపతికీ సర్వకాలాల్లోనూ స్వాగతం పలికింది. ఇద్దరూ తన గుండెలో అడుగులు పెట్టారు. అవి చెరగని ముద్రలు. వాటిని తను భద్రంగా దాచుకుంటుంది.

మురారి తన హృదయ ద్వారానికి మామిడాకుల తోరణం కట్టి మురిసిపోతే, శ్రీపతి తన గుండెలో మల్లెలు పూయించాడు.

మురారి సామాన్య మానవుడు. మానవుడికుంటే కష్టమూ సుఖమూ, అందులోని ఆనందం విచారం సమ్మిశ్రితం చేసిన జీవితానికి ప్రతిమూర్తి.

శ్రీపతి కవి. భావుకుడు. ఊహతో మనిషిగా తన బ్రతుకుని అధిగమించి, ఆకాశాలు దాటిపోయి, లోకాన్ని విస్మరించి, భావనాతీతమైనదానికి ప్రాణంపోయగల మధుర స్వప్నం—అతని భావనతో జోడుకలిపి గుండె శ్రుతిచేసికొంటే 'విమల గాంధర్వం' వినిపిస్తుంది.

'లోకాల కావల, అనంతమైన సముద్రాల కవతలిఒడ్డున, చిన్న గుడిసెకట్టుకుని అందులో నేనూ శ్రీపతీ అయితే—

జనసంచారంలేని ఆ ప్రదేశంలో ఎటు చూసినా జలమయమై సాగరుడు పొంగులెత్తుతుంటే కుర్రాళ్లాంటి అలలు తరుముకొస్తుంటే—నేనూ శ్రీపతీ ఆ చల్లటి నీళ్లలో తనమెత్తి తలమునకలుగా ఈదులాడి స్నానాలుచేసి—పచ్చటి ఇసుకలో కాళ్ళు దూర్చి, అలచిప్పల్లో నేనాడుకుంటుంటే, ఇసుకపొరల్లోంచి ఎండ్రకాయ బుసబుస తోసుకొచ్చి, నన్ను చూసి ఒక్కసారి కొండెలతో మూతితిప్పి బిలబిల సాగిపోతుంటే తదేకంగా చూస్తున్న నేను. నాకు తెలియకుండా వెనకగా వచ్చి అగోజా సముద్రంలో దొరికిన ముత్యాలు హారంగా కూర్చి శ్రీపతి నామెళ్లో అలంకరించితే—అతని చేతివేళ్లు గిలిగింతలు పెట్టగా, మనసు మురిసిపోయి తనువు సిగ్గయిపోయి, శ్రీపతి కళ్ళల్లోకి చూస్తూ సాయంసంధ్యని చూట్టంకూడా మర్చిపోతే—

ఇది వట్టి భావన. అసాధ్యమైన దాన్ని సాధ్యమైనటు భావించటం వెర్రి అని తెలిసినా తను ఊహచేయకుండా ఉండలేదు. ఎంతటి ఊహచేసినా ఎన్నెన్ని ఆనందలోకాలు విహరించి వచ్చినా, ఎంతటి మహదానందాన్ని పొందినా, ఆ అనుభూతి క్షణికం. అది తాత్కాలికమని తెలిసినా దాని మీదనే మనసు పోతోంది. ఊహలో ఎంతెంత ఎత్తులకు పోగలిగినా తన కాళ్ళు నేలమీద ఉన్నాయని మర్చిపోలేకపోవటం చిత్రం. శ్రీపతి తన్ని సముద్రాల కవతలికి తీసుకుపోయినా తన మనసు ఆలిచిప్పలు సాయంసంధ్యని దాటిపోలేకపోయింది. అంతటి ఊహచివర కడుపులో ఆకలి కదిలింది. ఏమయినా ఆ భావనానందంలో మనసు కుప్పిగంతులు వేస్తుంది. అశాశ్వతమైతే నేం అనిత్యమైతే నేం—అది కావాలి.

మురారినికూర్చిన ఆలోచనలు వేరు. శ్రీపతితో సాన్నిహిత్యాన్ని పోలిస్తే శాశ్వతమనిపిస్తుంది. మానవులుగా బతుకుతూ అందులో ఉండే ఆనందం పంచుకోవటం, కష్టమొచ్చినప్పుడు బాధపడుతూ, సుఖం వచ్చినప్పుడు కులాసాగా ఉంటూ చెయ్యీ చెయ్యీ కలుపుకు జీవించటం.

మురారితో సంసారం ముచ్చటగా ఉంటుంది. అద్దె ఇంట్లో చాలీచాలని జీతంతో గడుపుతూ—వాటికి తోడుగా ఓ పాపాయి పేరుకోసం ఇద్దరం పోట్లాడుకుంటాం. తనమాట సాగలేదని మురారి చిన్నబుచ్చుకుంటే నేను లాలించి బుజ్జగిస్తే, చిన్నపిల్లాడిలా అయిపోయి మారాముచేస్తే—పాప తన్ని వచ్చీరానిమాటల్లో 'అమ్మా' అని పిలిస్తే—ఒక్కోసారి పాపని గట్టిగా ముద్దుపెట్టుకున్నందుకు, పాపకి కోపమొచ్చి చిట్టిగోళ్లతో నా మొహమంతా రక్కి, బుగ్గలన్నీ పీకి, జుట్టు లాగేస్తుంటే నేను మళ్లీ మళ్లీ ముద్దాడితే కోపం పెరిగిపోయి, ఏం చేయలేక, అసహాయంగా ఏడుస్తుంటే నా గుండె తరుక్కుపోయి 'నాయన్ని' హృదికి హత్తుకుని పాలిస్తే—

లేనిరోజు విచారిస్తూ. ఆ విచారంలో ఒకళ్లకొకళ్లం ధైర్యం చెప్పుకుంటూ, లేనిరోజునాటి అనుభవం తర్వాత ఉన్ననాటి సుఖాన్ని పూర్తిగా అనుభవిస్తూ, కోపం చిరాకూ, శాంతి సహనం, విరాగ నిస్పృహా, ఆశ ధైర్యం, కష్టం సుఖం, దుఃఖం సంతోషం ఆనందం విచారాలమధ్య నలుగుతూ, మెలుగుతూ మెలితిరిగిపోతూ, తేరుకుంటూ, తియ్యగా, హాయిగా మనిషిగా ఈ గడ్డమీద జీవిగా బతికితే—

శ్రీపతి కవిత్వం వింటే తను కరిగిపోతుంది. మురారిని చూస్తే తనలో తియ్యటి బాధ మూలుగుతుంది. బాధలోని మాధుర్యం చూపిస్తాడు మురారి. భావనలోని ఆనందం అందిస్తాడు శ్రీపతి. శ్రీపతి ఆనందంలో కాలక్షేపం. మురారి ఈ లోకపు తియ్యటిబాధలు.

తనకు రెండూ కావాలి రెంటికీ తను కావాలి. ఆ లోకాల కేళి సంచుకుంటూ ఈ లోకంలో తియ్యగా మూల్గాలి. ఆ లోకాల భావనలో పరవశం చెందినా ఈ లోకం సుఖదుఃఖాల మధ్య నలిగి, అలిసిపోయి, బాధగా హాయిగా కంట నీరెట్టుకోవాలి.

కాని రెంటిలో ఒకదాన్నే ఎంచుకోవాలి. తప్పదు. తను ఊహ చేయలేని మెరుగా ఫ్రక్తే బావుండేది.

(43 వ పేజి చూడుము)

# ఊడ చెప్పిన  సాక్ష్యం

అదొక ఎలిమెంటరీ స్కూలు. హెడ్మాస్టారు అయిదవ తరగతి పిల్లలకి డిక్టేషన్ చెబుతున్నారు. ఇంతలో మెంబరుగారి పాలేరువచ్చి హెడ్మాస్టారిని మెంబరుగారు రమ్మంటున్నారు అని చెప్పాడు. ఎందుకని అడిగారు హెడ్మాస్టారు. ఏమో నాకేం తెలుసునండి అన్నాడు పాలేరు.

హెడ్మాస్టారు పిల్లలవంక తిరిగి ఎన్ని పేర్లయ్యాయిరా అన్నారు. మానేటరు ఎనిమిది పేర్లయ్యాయి అన్నాడు. ఒకళ్ళ పలకలు ఒకళ్ళు మార్చుకుని దిద్దుకోండి అని చెప్పి హెడ్మాస్టారు మెంబరుగారింటికి వెళ్ళారు.

మానేటరు ప్రకాశరావు ఆవూరి పెత్తందారుగారి కొడుకు. ప్రకాశరావు చెప్పగా పిల్లలంతా పలకలు మార్చుకొని దిద్దుతున్నారు. మెంబరుగారి అబ్బాయి రంగారావుకూడా అయిదవ తరగతే చదువుతున్నాడు. రంగారావు పలక బ్రహ్మయ్య అనే కుర్రాడు దిద్దుతున్నాడు. రంగారావు తనదగరవున్న పలక దిద్దకుండా బ్రహ్మయ్య వంకే చూస్తున్నాడు. ఎన్ని తప్పులు వేస్తున్నాడా అని కనిపెడుతున్నాడు. అన్ని పేరు కొట్టేస్తున్నాడు బ్రహ్మయ్య. కొట్టెయ్యడం చూస్తోనే వున్నాడు రంగారావు. వళ్లు మండిపోతోంది. పళ్లు పటపట లాడిస్తున్నాడు. తనవంక బ్రహ్మయ్య చూస్తాడేమో కబడ్దార్ అని చెబుదామని రంగారావు పకిలిస్తున్నాడు. దగ్గుతున్నాడు. ఏవైనాసరే యివేవి పట్టించుకోకుండా పలకదిద్దేసి క్రిందపెట్టేశాడు బ్రహ్మయ్య. క్రిందపెట్టేశాక రంగారావువంక చూశాడు. బుర్ర ఊపుతూ కోపంగా చూస్తున్నాడు రంగారావు. కొంచెం భయమేసింది బ్రహ్మయ్యకు. అయినానరే యేం చేస్తాడు. రంగారావు పలకలో ఒక్క పేరుకూడా రైటులేదు. అన్నీ తప్పులే. తలవంచుకు కూర్చున్నాడు బ్రహ్మయ్య. ఇదంతా కనిపెట్టకపోలేదు మానేటరు ప్రకాశరావు.

ఇంతలో హెడ్మాస్టరు వచ్చారు. పలకలు దిద్దడం అయిందిరా అన్నారు. అయింది అన్నాడు మానేటరు. పలకలు మాస్టారు తిరిగి చూడడానికి తీరుబడియెక్కడ! రైటయిన వాళ్ళునుంచోండిరా అన్నారు మాస్టారు. బ్రహ్మయ్య ఒక్కడే నుంచున్నాడు. ఒకతప్పు వాళ్ళునుంచోండి. రెండు తప్పులవాళ్ళు. అంటూ ఆఖర్ని సున్న వచ్చిన వాళ్ళు నుంచోండి అనేసరికి రంగారావు ఒక్కడేనుంచున్నాడు. చచ్చేటంత సిగ్గేసింది రంగారావుకి. అంతకన్న రెట్టింపు కోపం బ్రహ్మయ్యమీద వస్తోంది. కొంచెం పాలు ఉడుకుమోతనంకూడావచ్చి కళ్ళనీళ్ళు తిరిగాయి. నుంచున్నవాడు ఊరుకో

## యం.యస్.సుందరమ్మ

వచ్చా. హెడ్మాస్టారివంక చూడడానికి సిగుఅయితే పోనీ తలకాయవంచుకో వచ్చుగా. బ్రహ్మయ్యవంక చూస్తూ కళ్ళు ఎర్రజేసిపళ్ళుకొరుకుతున్నాడు. బ్రహ్మయ్య హెడ్మాస్టారివంక భయంతో చూస్తున్నాడు మధ్య మధ్య రంగారావు వంకచూస్తూ. హెడ్మాస్టారు రంగారావుని చూచి మెంబరుగారి అబ్బాయి అవడంచేత ఏవి అనలేక తలతిప్పుకున్నాడు. ఈ ముగురి భావాలు కనిపెట్టక పోలేదు మానేటరు ప్రకాశరావు.

ఒక్కొక్క తప్పు అయిదేసిసార్లు రాసి రేపుపొద్దున్న చూపించండి అన్నారు హెడ్మాస్టారు.

స్కూలు వదిలేశారు. పిల్లలంతా వెడుతున్నారు. ముందు బ్రహ్మయ్య వెడుతున్నాడు. వెనకాలరంగారావు వెడుతున్నాడు. రంగావు పరుగెత్తుకువెళ్ళి బ్రహ్మయ్యమీదపడ్డాడు. పడి తన్నేసరికి బ్రహ్మయ్య మీదకు [illegible] వెనక్కు తిరిగి ఏమిట్రా అల్లాతోసావు అన్నాడు. అక్కడికీ మాటాడకుండా వళ్ళుదులుపుకుని వెడుతున్నాడు బ్రహ్మయ్య.

బతుకు తక్కువగా బడాయి యెక్కువగా అన్నాడు రంగారావు. దానికీ బ్రహ్మయ్య మాట్లాడలేదు.

'ఓరేయ్ కోటయ్య, మొన్నా...మన బళ్ళోకి...వాడెవడో సర్కసు పనులు చేసేవాడొచ్చినప్పుడూ...అందర్ని తలో అణా తెచ్చుకోమన్నారూ...ఎవరూ? మాస్టారు అప్పుడు డబ్బులులేవని యేడిస్తేను పోనీలే అని ఓ పైసకి అణాయిచ్చావు. ఆ పైసకి



విశ్వాసం ఉందను కుంటున్నావా యేమిటి?' అన్నాడు ప్రక్కవాడితో రంగారావు.

ఆ మాటలు శూలాల్లా గుచ్చుకున్నాయి బ్రహ్మయ్యకి. అయితే తనేమీ అనాయుమ్మని రంగారావుని బ్రతిమాలలేడే. తనే గొప్పకి పోనిస్తానమ్మని బలవంతంగా లాక్కెళ్లాడు. వీణ్ణి యెవడిమ్మని యేడిశాడు. వీడు అజా యిచ్చారుగదా అని అన్నీ పేర్లు శుద్ధ తప్పులు అయితే, రైటు వెయ్యమనా వీడి ఉద్దేశం! అని బ్రహ్మయ్య మనస్సులో అనుకున్నాడే గాని పైకి పలెత్తు మాట అనలేడు. అంటే బ్రతకనివ్వడా రంగారావు. రంగారావు మెంబరుగారి అబ్బాయి. బ్రహ్మయ్య ఒక దిక్కుమాలినవాడు. తండ్రిని చిన్నతనంలోనే పోగొట్టుకున్నాడు. తల్లి గొప్పవారింట్లో చిన్నపని పెద్దపని చేసి వారు దయతో యిచ్చిన బియ్యం అవీ తెచ్చుకుని తినని చదివిస్తోంది.

ఇదంతా వింటూనే ఉన్నాడు వెనకాల వస్తున్న మా పెటరు ప్రకాశరావు.

బ్రహ్మయ్య మాట్లాడకపోవడంతో మరింత రెచ్చిపోతున్నాడు రంగారావు.

'ఒరేయ్ ఒక విధవకి చొక్కాలు లేవని వాళ్ళ అమ్మవచ్చి అడిగితేను మా అమ్మకా చొక్కాలు రెండిచ్చింది. అవ్వి తొడుక్కునే బళ్ళోకి వస్తాడు అబోడి వెధవ. ఆ మాత్రం విశ్వాసంకూడా లేదు వెధవకి. మొత్తం అన్నీ సున్నాలు చుట్టేశాడు' అన్నాడు మళ్ళీ పక్కవాడితో రంగారావు బ్రహ్మయ్య వంక చూస్తూనే.

బ్రహ్మయ్యకి కళ్ళ నీళ్ళు తిరిగాయి, చొక్కా వంక చూచుకున్నాడు. అప్పటి కప్పుడే చొక్కాని చింపేద్దామా అన్నంత కోపం వచ్చింది చొక్కా మీద. కాని యేమీ చెయ్యలేకపోయాడు. కళ్ళు తుడుచుకున్నాడు బ్రహ్మయ్య, ఇదంతా చూస్తూనే ఉన్నాడు ప్రకాశరావు.

ముందుగా రంగారావు యిలు వచ్చింది. బ్రహ్మయ్య వంక చూస్తూ కాండ్రగించి ఉమ్మేసి లోపలికి వెళ్ళిపోయాడు రంగారావు.

మళ్ళీ యింకోసారి కళ్ళ నీళ్ళు తిరిగాయి బ్రహ్మయ్యకు. మళ్ళీ తుడుచుకున్నాడు. కొంచెం దూరం వెళ్ళి పుస్తకాలు ఒక అరుగుమీద పెట్టుకుని ఆ చిరుగుల చొక్కా విప్పి ముక్కలుముక్కలు కింద చింపేశాడు పళ్ళు కొరుకుతూ మరీ చింపుతున్నాడు చొక్కాని బ్రహ్మయ్య. ఇదంతా చూస్తున్న ప్రకాశరావు హృదయంలో యేదో బాధొచ్చి కళ్ళనీళ్ళు తిరిగాయి. అయితే రంగారావు నోటికి జడిసి ఎప్పుడూ వాడిజోలికిపోడు. ప్రకాశరావు కూడా మన కెందుకన్నట్టు ఊరుకున్నాడు. కాని బ్రహ్మయ్య బాధ చూస్తూంటే తనకీ బాధగానే వుంది. బ్రహ్మయ్య దగ్గరకు వచ్చాడు. బ్రహ్మయ్య కసితో ఆ చిరిగిన చొక్కా పీలికల్ని క్రింద గుమ్మంలో పడేసి కాలితో తొక్కుతున్నాడు, చూచాడు ప్రకాశరావు.

"బ్రహ్మయ్యా! మా యింటికి రా, చేసిస్తాను నా చొక్కా తొడుక్కుందువు గాని" అన్నాడు.

"ఎందుకులే, రేపు యెప్పుడేనా నీ పలక దిద్దివలసివచ్చినప్పుడు అన్నీ తప్పులయి నేను సున్న చుడితే మళ్ళీ నన్ను చొక్కా యిచ్చావని చెప్పడానికా" అన్నాడు బ్రహ్మయ్య కళ్ళ నీళ్లతో.

ప్రకాశరావు కూడా మాట్లాడలేక పోయాడు. నిజమే వాడన్న మాటలో తప్పేముంది అనుకున్నాడు.

ఎవరి యిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు.

బ్రహ్మయ్యని తల్లి అడిగింది చొక్కా యేదని. జరిగిన సంగతంతా చెప్పాడు బ్రహ్మయ్య. తల్లి కంగారుపడి "నువ్వు చొక్కా చింపెయ్యడం ఆ రంగారావు చూడలేదుకదా" అంది.

చూసేయేం! ఎందుకంత భయం? అనుకున్నాడు బ్రహ్మయ్య.

అధయుం ఏవిటో అందరి దయాధర్మాల మీద ఆధారపడి బ్రతుకుతున్న ఆతల్లికి తెలుస్తుందిగాని బ్రహ్మయ్యకేం తెలుస్తుంది.

"మరి రేపు యేం తొడుక్కువెడతావు స్కూలుకు" అంది తల్లి.

చొక్కా లేకుండానే వెడతానన్నాడు బ్రహ్మయ్య.

ఆరాత్రి తెల్లవార్లూ నిద్రపట్టలేదు బ్రహ్మయ్యకు. ఇందులో తన తప్పేముంది. రంగారావుకు తనమీద యెందుకంత కోపం? తాను అన్నీ తప్పులురాసి రైట్లు వెయ్యమనా వాడి ఉద్దేశం? రేపు స్కూలుకు వెళ్ళి హెడ్మాస్టారుతో జరిగిన సంగతంతా చెబితే ...చెబితేమాత్రం ఏంలాభం?... హెడ్మాస్టారుకి మెంబరుగారన్నా మెంబరుగారి అబ్బాయన్నా భయమే...తనతల్లి వెళ్ళి మా అబ్బాయికి చొక్కాలులేవని అడిగి తెచ్చింది గదా వాడిష్టమొచ్చినట్టు కూశాడు రంగారావు.'

అని మనస్సులో బాధపడుతున్న బ్రహ్మయ్య అకస్మాత్తుగా లేచి తల్లిని లేపాడు. కంగారుపడుతూ తల్లి లేచింది. "ఇంకెప్పుడూ వాళ్ళకోసం ఎవరినీ బట్టలు అడగొద్దమ్మా" అన్నాడు కన్నీళ్ళతో.

కొడుకు ఆ వేదనను అర్థంచేసికున్న ఆ తల్లి 'అలాగేలే, అడగనులే, పడుకో' అని బుజగించింది.

అక్కడ ప్రకాశరావుకి యెందుకో నిద్ర పటలేదు. బ్రహ్మయ్య చొక్కా చింపెయ్యడం తాను చొక్కా యిస్తానవశం రహ్యాదున్న నువ్వుకూడా యిలాగే చెప్పుతావని యెంతో బాధతో బ్రహ్మయ్య అనడం యింకా జ్ఞప్తికి వస్తున్నాయి.

తెల్లవారింది.

ఏడుగంటలకే స్కూలు. అందరు స్కూలుకు వెళ్ళిపోయారు. చొక్కా లేకుండానే వెళ్ళాడు బ్రహ్మయ్య. అదిచూచి రంగారావు తనప్రక్కనున్నవాడితో ఒకడికి పొగరువచ్చిందిరా. ఆ పొగరంతా చొక్కామీద చూపించాడు. ఎందుకొచ్చిన పొగరు. బతకలేనివాడికి పొగరు యెక్కువే' అన్నాడు: బ్రహ్మయ్యకు ఆ మాటలు వినబడకపోలేదు. అయితేమాత్రం యేంమాట్లాడతాడు.

రాత్రి నిద్రపట్టక ఆలస్యంగా లేచిన ప్రకాశరావు టైంఅయిపోయిందని కంగారుగానే వస్తున్నాడు.

అయిదవతరగతి ప్యాసయి ఆ సంవత్సరమే స్కూలు మానేసిన రంగారావు అక్క పద్మ వయ్యారంగా జడ ముందుకు వేసుకుని గుమ్మంలో నిలబడి ప్రకాశరావుతో 'మా తమ్ముడు యిందాకే స్కూలుకు వెళ్ళి

(45-వ పేజీ చూడండి)



# ఆంధ్ర భోజుడు
# ఆనంద గజపతి

మల్లాది సత్యనారాయణ



ఆగ్రా పదునెనిమిదవ శతాబ్దపు కటకడిపతి గోజాలు. ఆనాడు చరిత్రలో విజయనగర సంస్థానము అన్ని విధముల అగ్రస్థాన మలంకరించినది. ఇంచుమించుగా యీనాటి విశాఖపట్టణంజిల్లా, గంజాంజిల్లాలో కొంతిభాగము కలిసిన ఆనాటి విజయనగర సంస్థానము వైశాల్యము 2140 చదరపు మైళ్ళు. 1800 గ్రామములు. 9.00,000 జనసంఖ్య, 80 లక్షల రూపాయల ఆదాయముకలిగిన సంస్థానమది.

ఈ సంస్థానమును పాలించిన రాజులు పూసపాటివంశజులు. ఈ వంశములోని భాషాభిమానులచేత రచింపబడిన కృష్ణవిజయము, ఉషాభ్యుదయము, విష్ణుభక్తి సుధాకరము అను మూడు పద్యగ్రంథములనుండి తెలియవచ్చిన విషయములనుబట్టి కృష్ణాజిల్లాలోని పూసపాడు అను గ్రామమునుబట్టి వీరి వంశమునకు పూసపాటి వంశమను పేరువచ్చెననియు, వీరివంశములోని తమ్మిరాజు అప్పుడు నందపురమును పరిపాలించుచున్న గజపతిరాజులను ఓడించుటచేత ఆనాటినుండి వీరికి గజపతి బిరుదము వచ్చెననియు తెలియుచున్నది.

మరియు క్రీ. శ. 591 ప్రాంతమున విజయవాడను ముఖ్యపట్టణముగా చేసికొని విశాలరాజ్యమును పాలించిన మాధవవర్మ వీరి మూలపురుషుడనియు, ఆయన కనకదుర్గ భక్తుడనియు ఆ ఆచారమునుబట్టి ఆ వంశమువారికి కనకదుర్గ కులదేవతయనియు తెలియుచున్నది.

మొదట ఈ పూసపాటి వంశజులు కృష్ణాజిల్లావారనియు, వారిలో కృష్ణవిజయము అను గ్రంథమును రచించిన తమ్మిరాజు క్రీ. శ. 1652 లో, విజయనగరమునకు పది మైళ్ళ దూరములోనున్న భోగాపురం, కుమిలి అను పరగణాలను శ్రీకాకుళం ఫౌజుదారయిన షేక్ మహమ్మదుఖానుద్వారా కౌలుకు తీసికొనెనని తెలియుచున్నది. కాని యీ విషయమునే మరియొకవిధముగకూడ చెప్పెదరు. పూసపాటి సీతారామచంద్రుడు తమ్మిరాజును దత్తత చేసికొనెననియు, సీతారామచంద్రుడు బసవరాజునకు బంధువనియు, బసవరాజు ఓరిస్సాను పాలించుచున్న గజపతులలో నొకని కూతురును వివాహమాడి కట్నముగా భోగాపురం, పొట్నూరు పరగణాలను గ్రహించెననియు అవిక్రమముగా సీతారామచంద్రుని వారసత్వముయ్యెననియు వానినుండి దానిదత్తత కుమారుడు తమ్మిరాజునకు సంక్రమించెననియు చెప్పుకొనెదరు.

తమ్మిరాజు క్రీ. శ. 1699 లో ఆనందరాజును దత్తతచేసికొనెను. ఆ ఆనందరాజు కుమారుడే అబాలగోపాలమునకు తెలిసిన బొబ్బిలి యుద్ధమునందలి విజయరామరాజు.

విజయరామరాజే క్రీ. శ. 1718 లో ఈనాడు విజయనగరమునందున్న కోటను నిర్మించి తన కార్యస్థానముగా చేసికొనినట్లు చరిత్రవలన తెలియుచున్నది.

పిమ్మట విజయనగరమువారికి బొబ్బిలి వారికి మనస్పర్థలు నానాటికి పెరిగి క్రీ. శ. 1757 లో బొబ్బిలి యుద్ధమునకు కారణమాయెను. విజయరామరాజు ఫ్రెంచి గవర్నరగు బుస్సీతో యేకమై బొబ్బిలిపై యుద్ధము చేసెను. కాని విజయరామరాజు అనుభవించినది లేక బొబ్బిలి ఓడిపోయిన మూడవనాటిరాత్రే శత్రువులచేతిలో చిత్రవధచేయబడెను.

పిమ్మట విజయరామరాజు దత్తపుత్రుడైన ఆనందగజపతి రాజ్యమునకువచ్చెను. విష్ణుభక్తిసుధాకర మనుగ్రంథమున ఆనందగజపతియొక్క దౌష్ట్యము వర్ణింపబడినది. ఆనందగజపతి ఇంగ్లీషువారితో స్నేహముగా ఉండి వారికి సముద్రపు రేవుపట్టణములను వర్తకము నిమిత్తము యిచ్చెననియు, పూరీనుండి విజయవాడవరకు, వింధ్యపర్వతముల నుండి సముద్రమువరకుగల భూభాగమును ఏకచ్ఛత్రాధిపత్యముగా పాలించెననియు తెలియుచున్నది.

ఆనందగజపతి తరువాత పుత్రుడు నారాయణగజపతి, ఆయనతరువాత వారికుమారుడు రెండవ విజయరామగజపతి రాజ్యమేలిరి.

ఈ విజయరామగజపతికి ఆనందగజపతి, సీతారామరాజు అను యిరువురు పుత్రులును, ఒక పుత్రికయు జన్మించిరి. వీరిలో పెద్దవాడైన ఆనంద గజపతియే రెండవ ఆనంద గజపతియై ఆంధ్ర భోజుడని ప్రఖ్యాతి గాంచిన మహాపురుషుడు.

ఆనంద గజపతి క్రీ. శ. 1850 లో జన్మించెను. ఇతడు క్రీ. శ. 1879 లో రాజ్యమునకు వచ్చి 1897 వరకు రాజ్యమును పాలించెను.

ఈతని తండ్రియగు రెండవ విజయరామ గజపతి మంచి బలశాలియు బుద్ధిశాలియు అగుటచే తన కుమారుడగు ఆనందగజపతికి బాల్యమునందే శరీర వ్యాయామము, అశ్వారోహణ, మున్నగునవి నేర్పించుటయే గాక ఆంధ్ర గీర్వాణాంగ్ల పారసీకాది ఇరువది భాషలయందు తీర్పని జేసెను. దేశ భాషలందే గాక, ఇతర దేశాల భాషలను పరిశీలించి నేర్చుకొనుటలో కూడ ఆనందగజపతి యొక్క ఉత్సాహమును, శ్రద్ధను చూపెను.

నాటి ఆంధ్రదేశమున పండితాగ్రగణ్యులని ప్రఖ్యాతి వడసిన హరిశాస్త్రిగారు ఆనంద గజపతికి గీర్వాణ విద్య నేర్పుటకును, అనేక భాషలయందు తీర్పుడైన లింగం లక్ష్మాజీ పండితుడు ఆంగ్లవిద్య నేర్పుటకును ఆనందగజపతి తండ్రిచే నియమితులై తమ తమ కర్తవ్యముల నెంతయుశ్రమున నిర్వర్తించి రెండవ విజయరామ గజపతిచే బహుమతుల నందిరి.

భాషాభిమానియు భాషాపోషకుడు మాత్రమే గాక, సంగీతాభిమానియగు రెండవ విజయరామగజపతి తన కుమారుడగు ఆనంద గజపతికి ప్రఖ్యాత సంగీత విద్వాంసులను తెప్పించి సంగీతము నేర్పించెను.

ఒకప్రక్క వ్యాయామము నందును సాహిత్యమందును, మరియొకప్రక్క సంగీతమునందును పరిపూర్ణ విజ్ఞానమును బడసిన ఆనందగజపతి తన తండ్రితో జే

మంతయు పర్యటనచేసి యూరోప్‌లో లోకానుభవము గడించెను.

ఆజానుబాహువు సుందరరూపి యగు ఆనందగజపతికి పదునెనిమిదవ యేట ఉపనయనము, ఇరువదవయేట వివాహము జరిగెను. సకలభాషలయందు, సకలశాస్త్రములయందు అరువది నాలుగు కళలయందు ఆరితేరిన ఆనందగజపతి తండ్రి తదనంతరము క్రీ. శ. 1879 లో రాజ్యాభిషిక్తుడాయెను.

చిన్నతనమునుండియు కూపస్థమండూకమువలె కోటగోడల మధ్యనుండి బయటికిరాక భిన్నమానవ ప్రవృత్తుల నెరుంగక సకలభోగభాగ్యముల తులదూగుచు భూమిపై కాలూనక పెంపబడి అధికారగర్వమున కన్నుగానక హృదయము నెచట నోతాకటు పెట్టి ప్రవర్తించు రాజులవలెగాక, అనేక భాషల సౌమనస్యమును గమనించుచు, వివిధ శాస్త్ర సంప్రదాయములను గుర్తించుచు, సమస్త కళల సౌకుమార్యమును స్వీకరించుచు జ్ఞానము వచ్చిన పిదప తండ్రితో దేశాటనము చేయునపుడు భిన్నప్రవృత్తులుగల మానవులను వారి వారి ఆర్థిక సాంఘిక పరిస్థితులను అవగతము చేసికొనుచు, దేశకాల పరిస్థితులతో సమన్వయము చేసికొనుచు స్వానుభవమున హృదయ వైశాల్యమును గడించిన ఆనందగజపతి తన పరిపాలనమున, అఖండ ఖ్యాతిగాంచిన తన తండ్రికన్న మిన్నయని అనిపించుకొనుచు అఖిల రాజమండలికి అగ్రస్థానమును వహించుటలో ఆశ్చర్యమేమున్నది?

ఆనందగజపతి రసహృదయము ఆశ్రితుల కాటపట్టు; దీనులకు పట్టుగొమ్మ. మనోగతమును గుర్తెరింగి అడిగించుకొనకయే ఆదరించెడి పరమ ధార్మికుడు, సర్వకళాకోవిదుడు. సమస్త విద్యాప్రవీణుడైన నీ రాజు తన సభను సంగీతకళాకోవిదులతోను, సకలశాస్త్ర పారంగతులగు పండితులతోను అలంకరించుకొని బహుపండిత పోషకుడయ్యెను. పండితబృంద పరివేష్టితుడై సర్వదా విద్యాగోష్ఠియందు కాలము గడుపు నీ ప్రభువు విద్యావ్యాప్తికై పాఠశాలల నభివృద్ధిపఱచి పోషించెను. తన ఆస్థానమున పండితులను పోషించుచు వారిచే దర్శనములకు తెలుగున వ్యాఖ్యానములు రచించునట్లు చేసెను. ఆంగ్లభాషలోనికి తర్జుమా చేయబడిన సవ్యాఖ్యాన ఋగ్వేద సంహిత ముద్రణకై మేక్స్ ముల్లర్‌కు విరాళ మొసంగి ఇతర దేశీయుల దృష్టిలో హిందూదేశ దాతృత్వమును చాటిన మహానుభావుడు ఆనందగజపతి. వాచస్పత్య నిఘంటు రచన నిమిత్తము తారానాథతర్క వాచస్పతికి, "విజయనగర సంస్కృత సీరీస్" అను అముద్రితగ్రంథశ్రేణిని ముద్రించుటకు విరాళము నొసంగి భాషాసేవకు



ఆ నం ద గ జ ప తి

నడుముకట్టిన పరమయోగ్యుడు ఆనంద గజపతి.

విజయనగరమున వీరి తండ్రిగారిచే నెలకొల్పబడిన ఆంగ్లకళాశాల ఈయన పోషణయందు ఫస్టుగ్రేడు కళాశాలగా అభివృద్ధి గాంచినది. అందలి విద్యార్థుల కన్ని విధముల సహాయపడి విద్యాపోషణకు దోహద మొసంగిన దీ ఆనందగజపతియే. సంఘమునందు విద్య పురుషుల కెంత అవసరమో స్త్రీలకును అంతే అవసరమను భావ ముదయించిన నీగజపతి స్త్రీలకు ప్రత్యేక పాఠశాలల నేర్పరచి పోషించుటలో గొప్ప సంస్కర్త అనిపించుకొనెను.

ఇంతియేగాక తెలుగుజిల్లాలకు ప్రత్యేకముగా విశ్వవిద్యాలయ మెంతయేని ఆవశ్యకమని గుర్తించి విజయనగరమున విశ్వవిద్యాలయమును స్థాపించుట కెంతయేని కృషి సల్పెను. 47 వ యేట నే వీరిని మృత్యుదేవత తనపాలబెట్టుకొనుటచే కృతకృత్యుడు కాలేకపోయెను.

ఈ మహారాజా యింపీరియల్, ప్రావిన్షియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్సుకు సభ్యుడుగా నామినేట్ చేయబడి సాంఘికాభివృద్ధికి తనశక్తినంతను ఉపయోగించి అనేకబిల్లులను రూపొందించి సభ్యుడుగా తన కార్యనిర్వహణమునందు కృతకృత్యుడాయెను. ఆసమయమునందే బ్రాహ్మణులను పీడించుచున్న కన్యాశుల్కమను దురాచారమును, దాని ప్రాబల్యమును, దరిద్రులపై అది చేయు అధికారమును కనులారగాంచిన ఆనందగజపతి దాని నిర్మూలనకు నడుముకట్టి శాసనసభయందు ఒకబిల్లును ప్రవేశపెట్టుటకు ప్రయత్నించెను. కాని హృదయవైశాల్యము కలిగిన ఆనందగజపతికి మానవహృదయ పరివర్తనకు శాసనములు సహకరించక మరింత మొరటు పడునట్లు చేయునను తలంపు కలిగినది. దానిఫలితమే శ్రీ గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కమను నాటకరూపమున వెలసినది. ప్రజలలో పరివర్తనకు కన్యాశుల్కములోని కష్టసుఖములను చిత్రించి వారియెదుట పెటిన కొంతకాలమునకైనను పరివర్తన కలుగునను నమ్మకమే కన్యాశుల్కమను దృశ్యకావ్యావిష్కరణకు కారణభూతమైనది.

క్రీ. శ. 1886 లో ఆనందగజపతి శ్రీ గురజాడ అప్పారావుగారిని ప్రోత్సహించి సామాన్యప్రజానీకాని కందుబాటులో నుండు వాడుకభాషలో ఈ కన్యాశుల్క

# ఆంధ్రభోజుడు ఆనంద గజపతి

కును నాటకమును వ్రాయించెను. ఈ నాటకముతో అదివరకున్న అనువాద నాటకరచనాచారం క్రొత్త పోకడలతో నిలసిల్ల నారంభించినది.

కన్యాశుల్క నాటకము ఆనాటి ప్రతిలోని ఆనందగజపతి బొమ్మయు, దానిక్రింద వ్రాయబడిన అప్పారావుగారి పసిడి పలుకులును దీనికి నిదర్శనములు. ఈనాటి నాటక ప్రతియందు ఆచిత్రమును ఆ పసిడి పలుకులను మృగ్యమగుట ఆంధ్రుల అభాగ్యము!

ఆంధ్ర గీర్వాణభాషలయందు దారితేరిన కవనము నలగలిగిన శ్రీ ఆనందగజపతి పండితగోష్ఠిలో సదాకాలము గడుపుచు, కౌర్యారియోగాని శాసనసభకు గాని మదరాసు పోవునపుడు కూడ పండితబృందమును విడువలేక వెంటనిడుకొని పోవువాడన్న వారి విద్యాభక్తి వెల్లడియగుచున్నది.

ఈ కవిపోషకుని సభయందు అగ్రగణ్యుడు ముడుంబై నరసింహాచార్యస్వామి. ఈయన భగవత్కవిపుంగవుడు, ఇంకను వ్యాకరణశాస్త్రమునందు దారితేరిన పేరి కాశీనాథశాస్త్రి, హరికథా పితామహుడు ఆదిభట్ల నారాయణదాసు వీరి ఆస్థానమందు ఈ మహారాజుచే పోషింపబడి అఖండ ప్రఖ్యాతిని గాంచినవారిలో అగ్రగణ్యులు. ఇంకను కొల్లూరి కామశాస్త్రి, మండాచిటి కామశాస్త్రి, ఈయన కుమారుడు లక్ష్మీకామశాస్త్రి గార్లుకూడా వీరి సభయందుండెడివారు. ఈ పండితబృందమంతయు సరస్వతి ఉన్నచోట లక్ష్మి ఉండదనే అపవాదు లేకుండా ఆనందగజపతి పోషణలో నిశ్చింతగా కాలము గడిపెడివారు.

మరియును ఆనందగజపతి గొప్పదాతయనుటకు అనేక తార్కాణములు నేటికిని గలవు. అలహాబాదు విశ్వవిద్యాలయములోని సెనేటు హాలు, మద్రాసులోని విక్టోరియా మెమోరియల్ భవనము, కలకత్తా బౌబజారులోని 'ఇండియన్ అసోసియేషన్ ఫర్ ది అడ్వాన్సుమెంటు ఆఫ్ సైన్సు' అను సంస్థయున్న భవనమును, ఆనంద గజపతి యొసగిన విరాళములచే వెలసినవన్న, విజయనగరరాజులకే గాక ఆంధ్రులకే గర్వకారణము.

ఆనందగజపతి తాను యువరాజుగా నున్నప్పుడే గొట్టుముక్కల కృష్ణంరాజు సహాయమున తనవద్ద కరుదెంచిన ముడుంబై నరసింహాచార్యస్వామియొక్క అఖండ ప్రతిభావంతమగు కవిత్వపాటవమునకు, వ్యాకరణ ఛందో లక్షణముల ప్రతిభకు అచ్చెరువొంది, బహూకరించి తన తండ్రి ఆస్థానమున నొక స్థానమును కల్పింపజేసెను. వారు ఆ సభాస్థానము నలంకరించినది కృష్ణలీలా మహోత్సవ సమయము. తన తండ్రి అయిన విజయరామగజపతి ఆస్థానమున ఈ కవిని ఆనందగజపతి ప్రవేశపెట్టగా, నరసింహాచార్యస్వామి ఈ క్రింది పద్యమును చదివెను:

ఈ జగమందు నిందు నటు
తెలుసుకు గనువింపొనర్చు పై యోజక
శంక రాజకుటుపులము పందియ మొంద
దెంగుడుర్ రాజనుమాట మా విజయ
రామ నరేంద్రు నకే ప్రసంగుపై
రాజులు లోకవహ్ని మది
రాజుటరాజులనంగ జెల్లెడిన్.

అప్పుడు ఆనందపరవశుడైన ఆనందగజపతి ఆ పద్యమునందలి స్వారస్యమును విమర్శించి తండ్రికి చూపి ఆ కవిప్రతిభను వెల్లడి చేసెను.

అట్టి నరసింహాచార్యస్వామి విజయరామ గజపతి తదనంతరము ఆనందగజపతి ఆస్థానమందలి విద్వత్పరిషత్తునందు అగ్రస్థానమలంకరించుకొనుటలో అబ్బురమేమున్నది? ఈయనయందు ఆనందగజపతికి అమితమైన గౌరవాదరాభిమానము లుండెడివి. ఆనందగజపతి ఆస్థానమున నీ నరసింహాచార్యస్వామివారు వేదవ్యాసునిగూర్చి నలుబదిరోజులు పంచాగ్నిమధ్యమున తపం బొనరించి వ్యాససాక్షాత్కారమున అప్రతిభను సంపాదించి దర్శనములన్నిటికిని వ్యాఖ్యానములను రచించినాడన్న ఆనాటి కవిపుంగవులసాయి, చిత్తస్వాస్థ్యము వెల్లడి అయి యీనాటి పోషణ శూన్యమైన కవిత్వ స్థాయి మనసును కలచివేయుదా!

విజయనగరం మహారాజావారి కళాశాలలో కొన్నాళ్ళు హూణ విద్యాభ్యాసము చేసి గీర్వాణాంధ్రభాషలలో దారితేరి కొన్ని యక్షగానములు, హరికథా ప్రబంధములు రచించి, తన జీవితమునంతను హరికథల కంకితముచేసి చల్లపల్లి గా బా

వారిచే, గజయాన, గండపెండేర సత్కార ముల బొంది అనేక సంస్థానముల రాజులచే సత్కరింపబడుచు దేశపర్యట నము గావించి, మైసూరు మహారాజుచేత నున్నత సత్కారములకు పాత్రుడై ఆంధ్ర జాతి ఆబాలగోపాలము నోట హరికథా పితామహుడనిపించుకున్న ఆదిభట్ల నారా యణదాసు గారిని ఆనంద గజపతి తన ఆస్థాన పండితునిగా జేసినన్న ఆ మహారాజు రస హృదయము కవితాపోషణ వెల్లడియగు చున్నది.

అమలాపురముతాలూకా అయినవిల్లి గ్రామములో క్రీ. శ. 1815 లో జన్మించిన బులుసు పాపయ్యశాస్త్రిగారు చతుర్వేదము లను మీమాంసలను, పురాణములను నేర్చిన మహాపండితులు. వీరు మైసూరునందు విద్యా రణ్య వేదభాష్యమును, అధ్యయనము చేసిరి. వీరు ఆంధ్రదేశ మంతటను సభలలో విజ్ఞాన గోష్ఠులు జరిపి సత్కారముల బొందిరి. మైసూరు మహారాజు చేతను, పిఠాపురం మహారాజు చేతను అధిక సత్కారముల బడసిరి. ఆనంద గజపతి మహారాజు వీరి విద్యాధిక్యతను గమనించి ప్రతి సంవత్సరము వారికి కానుకగా వెయ్యిన్నూట పదహారు రూపా యలు యిచ్చుచుండెడివారు. ఒకప్పుడు ఆనందగజపతి తన సభలో రెండువందల మంది పండితు లుండగా 'ఏ కార్యమందైనను యజుర్వేదముతో ఆశీర్వచనమును ప్రారం భించుటకు కారణ మేమని ప్రశ్నింప యెవ్వ రును చెప్పలేక పోయిరట. అప్పుడు పాపయ్య శాస్త్రిగారు లేచి 'తస్య యజురేవ శిరః' అని ఒక్క వేదవాక్యములోనే సమాధాన మిచ్చి రట. ఆనాటి నుండి ఆనందగజపతి పాపయ్య శాస్త్రిగారిని ప్రతి సంవత్సరము సత్కరించు చుండెడివారట.

బొబ్బిలి తాలూకా పాలతేరు గ్రామము నందు క్రీ. శ. 1833 లో జన్మించిన మండ పాక పార్వతీశ్వర శాస్త్రి గారు కూడా సంస్కృతాంధ్రములలో పాండిత్యమును సంపాదించి యయాతి చరిత్ర, బొబ్బిలి మహారాజ వంశావళి, రాధాకృష్ణ సంవా దము, కాంచీ మాహాత్మ్యము, మున్నగు గ్రంథముల రచించి సమస్యాపూరణమున సాటిలేని ప్రతిభను సంపాదించి ఆనంద గజపతి ఆదరణను సత్కారములను పొందిరి.

తూర్పుగోదావరిజిల్లా నరసాపురం తాలూకా కుమ్మలూరు గ్రామమునందు క్రీ. శ. 1846 లో జన్మించిన శ్రీపాద రామశాస్త్రి గారు కాశీ, బరోడా మున్నగు రాజాస్థాన ముల దర్శించి శాస్త్ర చర్చలలో గెలిచి బిరుదుపత్రములు బడసిరి. అట్టి వీరు కూడ ఆనందగజపతి పోషణలో విజయనగరమున నివసించి ఆ నేకులకు శాస్త్రపాఠములు చెప్పి నవీనతర్క విద్యను ఆంధ్ర దేశమున ప్రవేశ పెట్టిన ఖ్యాతిని గడించిరి. నవీన గౌతము డను బిరుదు సంపాదించిరి.

ఆంధ్రులలో ఎం. ఏ. పట్టము పొందిన మొట్టమొదటి కొద్దిమందిలో కిడాంబి రామానుజాచార్యులు గారు ఒకరు. వీరు ఆనందగజపతిగారి ఆదరణమున విజయనగ రము హైస్కూలులో క్రీ. శ. 1874 లో ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణుడై, తర్వాత మహా రాజిచ్చిన వేతనముతో చెన్నపురి ప్రెసి డెన్సీ కళాశాలలో చదివి ఎం. ఏ. పట్టము పొందినన్న యువరాజుగా నున్నప్పుడే ఆనందగజపతిలో యీవిద్యాపోషణ బీజము మొలకెత్తియున్నదన్నమాట. పిమ్మట రామాను జాచార్యులు గారు ఆనందగజపతి మహారాజు గారి ఆహ్వానమున విద్యాభ్యాసము పూర్తి కాగానే తిరిగి విజయనగరమున కరుదెంచి శ్రీ వారి కళాశాలలో వైస్ ప్రిన్సిపాల్ గా నియమితులై కొద్ది రోజుల్లోనే కళాశాల ప్రధానాచార్యులైరి.

ఇట్లు ఆశ్రితుల కండయై, కవి పండిత పోషకుడై విద్యాభివృద్ధికి కృషి చేసిన ఆనంద గజపతి మహారాజుకు ఆంధ్ర భోజుడను బిరుదు ఎంతైనను తగియున్నది.

ఆనందగజపతి ఆస్థానమున గాత్రపాటలో ప్రఖ్యాతి గాంచిన పప్పు వెంకన్న గారు, ధార్వాడ మాధవరావుగారు, వీణ వాయిద్య మున గణుతికెక్కిన దూర్వాసుల సూర్య నారాయణ శాస్త్రి గారు, గురురాయా చార్యుల వెంకటరమణ దాసు గారు, కరి పద్మనాభాచార్యులవారు, చితారు వాద్య ములో మెహతెబ్ ఖాన్ అను మహమ్మ దీయుడు ఉండెడివారు.

అన్నిటికన్న మనకెంతో ఆశ్చర్యమును కలిగించు విషయమొకటి కలదు. అదియేదన, శ్రీవారి ఆస్థానమందున్న గురురాయా చార్యుల రమణదాసు గారికి వీణ వాద్యమున ఆనందగజపతి మహారాజే గురువు అన్న విష యము విన్న మనకెంతో వింతగా నుండును. దీనినిబట్టి వీణావాద్యమున ఆ మహారాజెంత పండితుడో స్పష్టమగుచున్నది.

ఆ రోజులలో సంగీతమునకు పుట్టినిల్లు తంజావూరు; అత్తవారిల్లు విజయనగరము అని చెప్పెడి వాడుకనుబట్టి ఆనందగజ పతికిగల సంగీతప్రియత్వము, పోషణ, సేవ, వెల్లడి యగుచున్నవి.

క్రీ. శ. 1858 లో బొబ్బిలిలో నందిగానం వారి వంశములో జన్మించిన వెంకయ్య గాన విద్యనే కులవిద్యగా నభ్యసించి యిటు గాత్రములోను అటు వీణావాద్యమునను అపార కృషిచేసి గాత్రమున వైద్యనాథ అయ్యరు అను మహావిద్వాంసుని శిష్యుడై అఖండప్రఖ్యాతి గాంచి ఆనందగజపతికి తన పాండిత్యమును చూపవలెనని కుతూ హలము గలిగెను. వినోదమునకై ఆనంద గజ పతితో చదరంగమాడెడు వెలిదిండి జోగా రావు అనువాని సహాయమున ఆనందగజపతి సభలో ప్రవేశించెను. ఈయన గానమును విన్న ఆనందగజపతి ఈయనను తమ సభకు వచ్చుచుండుమని చెప్పెను. వెంకయ్యగారు బొబ్బిలి యాస్థాన పండితుడగుటచే వీరికాలు వున కుదురలేదు. కాని తీరిక సమయమందు విజయనగరము వారి సభకు వచ్చుచుండెడి వాడు.

ఆనందగజపతి సభకు అభిరాం పిళ్ళే అను దాక్షిణాత్య గాయకుడు వచ్చి తన నేర్పరి తనమును రాజుముందు చూపించెను. అంత నీ మహారాజు తన ఆస్థాన గానకళాకోవిదుల ఒకరి తరువాత నొకరిని కచ్చేరీ చేయ వలసినదిగా ఆజ్ఞాపించెను. ఆ సమయ మున ఆస్థానములో నున్న నందిగానం వెంకయ్య కూడా తన విద్యను ప్రదర్శింప అభిరాంపిళ్ళే నందిగానం వెంకయ్యను మూర్తీమే మెచ్చుకొనెను.

ఎటి పండితుడు వచ్చినను ఆనంద గజపతి ఆస్థానమునందలి పండితులతో వ్యాకరణమున గెలువలేక పోయెడివారను ఒక వదంతి కూడ కలదు.

ఈ ప్రభువు తన సంస్థాన వ్యవహారముల నన్నిటిని దివానుపైననే విడిచిపెట్టి తాను పండితులతోను, శాస్త్రచర్చలతోను, కవితా గోష్ఠితోను కాలము గడిపెడువాడు. సామంత రాజులకు కూడా శక్యము గాని ఆయన దర్శ నము పండితులకు సులభముగ లభించెడిదని చెప్పుకొనెదరు. దర్శించిన పండితులు కవులు వట్టి చేతులతో గాక సర్వదా పారితోషిక ములతో పోవుచుండెడివారు.

మహారాజావారు సంస్కృత నాటక సమా జమునొకదానిని స్థాపించి పోషించెడివారు. దీనినిబట్టి చూడ గీర్వాణాభివృద్ధికై ఆ మహా రాజు మనస్సెంత ఉవ్విళ్ళూరెనో మనము ఊహించవచ్చును. ఆనందగజపతి చరిత్రలో ఆనాడు విద్యకుగల ఉన్నతస్థాయి, కవి పండితుల ఆదరణ, సమర్థనీయమగు కవితా పటిమ, కవులస్థాయి, మనకు గోచర మగుటయేగాక ఆంధ్రదేశమున కఖండఖ్యాతిని చేకూర్చెననుటలో సందేహము లేదు.

పరిపాలనా విధానమునందు కూడా ఆనంద గజపతి మంచిపేరు సంపాదించెను. సమర్థత, గౌరవము, అనుభవము కలిగిన కొందరిని తనకు సలహాదార్లుగా నియమించుకొని పరి పాలనా విధానమున ప్రజల కష్టసుఖముల గమనించుటయందు వారి సలహాలను గైకొ నెడివాడు. అట్టి మహానుభావుడు ఆంధ్రభో జుడు తన 47 వ సంవత్సరమున అనగా క్రీ. శ. 1897 స్వర్గస్థుడాయెను. ★




[ఆదిపర్వము — పంచమాశ్వాసము]

క. వ్యసనవివర్జిత మాన, వ్యసగోత్రపవిత్ర విష్ణువర్ధననృప స
ప్తసముద్రముద్రితాఖిల, వసుధాజనగీతకీర్తి వాసవమూర్తీ.

పవమయూరము. రాజకులశేఖర పరంతప వివేక
భ్రాజిత జగద్వలయ భాసురసముద్య
త్తేజ నిరవద్య యువతీమదన వీరో
గ్రాజివిజయా త్రిభువనాంకుశ నరేంద్రా.

గద్యము. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతంబునం
దాదిపర్వంబున ధృతరాష్ట్రపాండురాజుల వివాహంబును పాండురాజ దిగ్విజయం
బును పాండవధార్తరాష్ట్ర సంభవంబును పాండురాజనిర్యాణంబును కృపద్రోణ
జన్మకథనంబును గుమారాస్త్రవిద్యాగ్రహణంబును నన్నది పంచమాశ్వాసము.

## ఆదిపర్వము షష్ఠాశ్వాసము

శ్రీజయవిభాసి వినమ
ద్రాజన్యకిరీటమణి విరాజితపాదాం
భోజ భువనైకసుందర
రాజాన్వయతిలక రాజరాజనరేంద్రా.

వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె నట్లు కృతాస్త్రశస్త్రులయిన రాజకుమారుల విద్యాకౌశలంబు వ్యాస గాంగేయవిదురకృపశల్యశకునిసోమదత్తాదుల సమక్షంబునం జూప సమకట్టి యొక్కనాడు ద్రోణుండు ధృతరాష్ట్రున కిట్లనియె.

## కుమారాస్త్ర విద్యాసందర్శనకథాప్రారంభము

క. ఘోరాస్త్రశస్త్రవిద్యల, నారూఢములందు నిపుణు లైరి కుమారుల్
వీరలయవిరలవిద్యాపారము సను టెఱుఁగవలయు భవదీయసభన్.

వ. అనిన నట్లచేయుదు నని ధృతరాష్ట్రుండు గుమారుల విద్యాసందర్శనరంగంబు రమ్యంబుగాఁ జేయింపు మని విదురుం బంచిన నతండు వల్లెయని శాస్త్రవిహిత ప్రమాణోపేత వృత్తాయామంబును సపాకృతవృక్షగుల్మవల్లీకవల్మీకంబును నంగీకృతపూర్వోత్తరప్లవంబును సమీకృతనిమ్నోన్నత ప్రదేశంబును దూరీకృతకంటకపాషాణశల్యశకలంబును విరజీకృత [illegible]ధూసరస్థలంబును విరచిత బహువిధ ప్రేక్షాగారమంచక ప్రపంచంబును నానాధ్వజపటపల్లవతోరణ చందనమా[illegible]ద్వారదేశంబును బ్రతిదిశవిర్వర్తిత శాంతికబలివిధానంబునుంగాఁ జేయించినం బంచాంగశుద్ధదిన శుభము[illegible]బున ధృతరాష్ట్రుండు గాంధారీపురస్కృత దేవీశతపరివృతుండై వివిధభూషణభూషితానేక విలాసినీనివహంబుతోఁ జనుదెంచి విలంబిత కదంబకస్థూలముక్తాఫలదామరమణీయంబై యాబద్ధమరకత వజ్ర వైడూర్య పద్మరాగ ప్రవాళప్రభాప్రకరవ్యతికర విరచితాపూర్వ సురచాప గౌరవంబై యతిమనోహరంబైన శాతకుంభమయప్రేక్షాగారంబున నున్న.

తే. అందుఁ గర మొప్పి సుందరీ బృంద మఖిల, రత్నరాజితకనకధరాధరేంద్ర
కందరాంతరమున నున్న సుందరామ్ర, తాశనాంగనాబృందంబు ననుకరించె.

తే. సుతులవిద్యాప్రవీణతఁ జూచువేడ్కఁ, నెంతయును సంతసంబునఁ గుంతిదేవి
రాజసన్నిధి గాంధారరాజపుత్రి, కెలన నుండె నున్మీలిత నలిననేత్ర.

సీ. వ్యాసపురస్కృతాపనిదేవనివహంబుఁ, గృపశల్యశకునిగాంగేయవిదుర
సోమదత్తాదిభాసురగురుబాంధవ, మిత్రవర్గంబు నమేయమంత్రి
సామంతమండలేశ్వరసమూహంబును, గాయక వైతాళికప్రవరులుఁ
దమతమనియమిత స్థానంబులం దోలి, నుండిరి బోరన నులిసె భేరు

ఆ. లత్రురదర్శనాగతాఖిలక్షత్రియ, వైశ్యశూద్రవివిధ వర్ణజనుల
కలకలంబు ప్రళయకాలసంక్షోభితాంభోనిధిస్వనంబుఁ బోలెఁ జెలఁగె,

వ. అట్టియవసరంబున నాచార్యుండు శుక్లాంబరాభరణమాల్యానులేపనయజ్ఞోపవీతపలితకేశశ్మశ్రుశోభితదేహుండై రంగమధ్యంబున నశ్వత్థామసహితుండై విముక్తజలదజాలవియన్మధ్యంబున నంగారకసహితుండైన యాదిత్యుండునుం బోలె నున్న నగణ్యభూసురవరేణ్య పుణ్యాహవాచనానంతరంబున.

శా. ద్రోణాచార్యపితుండ నొప్పి కృతహస్తుల్ బద్ధగోధాంగుళి
త్రాణుల్ మార్గణపూర్ణతూణులు మహాధన్వుల్ కుమారుల్ తను
త్రాణోపేతులు రంగమధ్యమున నంతట్ నిల్చి రుద్యద్గుణ
శ్రేణీరమ్యులు ధర్మజప్రముఖులై జ్యేష్ఠానుపూర్వంబుగాన్.

వ. అట్లు నిలిచి యాచార్యు ననుమతంబున.

సీ. అసిచర్మకౌశలం బమరంగఁ జూపెదు, వారును దృఢసౌష్ఠవంబు లొప్పఁ
దమతమనామాంకితము లైన శరముల, నేర్పడ లక్ష్యంబు లేయువారు
హయమదద్విరదరథారూఢదక్షతఁ, బ్రకటించువారును బ్రాసశక్తి
కుంతతోమరగదా కుశలత్వ మెఱిఁగించు, వారును గా నిట్లు వసుధలోన

ఆ. రాజసుతులతోడ రమణఁ బాండవధృత, రాష్ట్రసుతులు వృద్ధ రాజులొద్దఁ
దద్దయు మదమునఁ దమతమవిద్యల, మెఱసి రెల్లజనులు మెచ్చిపొగడ.

## భీమదుర్యోధనులు దమగదాకౌశలంబు చూపుట

వ. అంత ననంతబలపరాక్రము లగు భీమదుర్యోధను లుద్యద్గదాహస్తులయి మహామత్సరంబుతో నేకశృంగసముత్తుంగశైలద్వయంబు ననుకరించుచు వశానిమిత్తక్రుద్ధగంధసింధురంబులుంబోలె నొండొరులం దాఁకి సవ్యాపసవ్యమండలమార్గంబుల గదా కౌశలంబు మెఱయునెడ.

మ. అవనీచక్రము పాదఘాతహతి న ల్లాడంగ నత్యుచ్చభై
రవహుంకారరవంబునన్ వియదగారం బెల్ల భేదిల్లఁ బాం
డవకౌరవ్యగదావిఘట్టన మకాండప్రోత్థ మై భావిపాం
డవకౌరవ్యరణాభిసూచనపటిష్ఠం బయ్యె ఘోరాకృతిన్.

క. ఆరాజసుతులవిద్యాపారగపటుచేష్టితములఁ బరువడి నగ్గాం
ధారీధృతరాష్ట్రుల కతిధీరుఁడు విదురుండు సెప్పి తెలుపుచు నుండెన్.

వ. అంత భీమదుర్యోధనుల గదాకౌశలంబు సూచుజనుల పక్షపాతజనిత పరస్పరక్రోధవచనంబులు విని ద్రోణుండు రంగభంగభయంబున నశ్వత్థామం బంచి వారినిద్దఱ వారించి వారాశియుంబోలె బోరన మ్రోయుచున్నవాదిత్రశబ్దంబు లుడిచి నా ప్రియశిష్యుం డయిన యర్జును ధనుఃకౌశలంబుఁ జూడుండనిన నయ్యాచార్యువచనానంతరంబున.

ఉ. హారివిచిత్రహేమకవచావృతుఁ డున్నతచాపచారుదీ
ర్ఘోరుభుజుండు భాస్వదసితోత్పలవర్ణుఁడు సేంద్రచాపశం
పారుచిమేఘమో యనఁగఁ బాండవమధ్యముఁ డొప్పి బద్ధతూ
ణీరుఁడు రంగమధ్యమున నిల్చె జనంబులు దన్నుఁ జూడఁగన్.

క. నరు నింద్రాత్మజు నింద్రావరజసఖున్ వీరుఁ బాండవప్రవరు ధను
ర్ధరుఁ జూచి చూప రెల్లం, బరమాద్భుతచిత్తు లగుచుఁ బలికిరి దమలోన్. 

గుపొరుగువాళ్ళ చెవులో
అయ్యో! పాపం! పేద
...' అని కన్నీళ్ళ

ఆ పందిరిమంచం కొస్తా
ఏదూ! మరోపదిరోజులు
. అని ప్రశ్నార్థకంగా
బలువంపు!

పెట్టకోమాకు...అన్నీ
న్ని సార్లు దచ్చిబతికడం'
కోశించాడు. అంజ
చ్చి, 'అయ్యో! అది
దమ్మెయ్యడమేకి వాళ్ల
డ పడుకొని ఎన్ని ఎన్ని
వేల సుఖాలు మంచం
మాకిపోయాయి! ఎన్ని
ఇగిరిపోయాయి!
మ్మెయ్యడమేకి!' అంజ
డు.
ఊరు ఊరుకోటుందా!
పారేసాను. ఇంత కాలం
రేమోనని ఆగాను. ఇక

... ఇంకెందుకీ దొంగ
హత్య చేసుకోదలుచు
రాముడు.
జనేయులు.
. ఎముకలగూళ్ళ
గమన్నా అనుభవించి
సుఖం...పీకలు మునిగే
నా చవిచూసేగా!'
..ఇంకొన్నాళ్లు...'
గేది లేదు. తల బద్దలు
. ఎ జమీందారు
లు చాక్కా తోదు

అవులించాడు రాత్రి
ని అవులింతలు...
లేం! వాడిబుద బయల
ఉద్యోగంసంచి తొల
తమంది పిల్లలూ, పిచ్చి
కొదుకు తాగకపోం!
మా పోస్తాడు.'
టకుంది. సలసల మరుగు
మ్యం కడిగిపోసింది.
నికీ అంతం లేదూ!
మకు పడుతోందో

అంజనేయులు కళ్ళ
శాడు. తెప్పలు బరు
మనిత కుర్చీ ఫెళ్ళ ఫెళ్ళ
తుంది. ఆత్మారాముడి

అంతరాళంలో ఆక్రందించే తొందర అరి కట్టాలి!

'నీవు ఛావాలనుకొంటున్నావు! ఈ బయటికి నడు...' ఆత్మారాముడు అరిచాడు.

'పెళ్ళాం... పిల్లలు...సంసారం ఇవన్ని విడిచి సేమరాలేను. నన్ను విడు. ఉన్నన్నాళ్లు ఇన్ని గంజి నీళ్లు పోస్తా...'

అంజనేయులు కళ్లు తడిచేసుకుని, చేత్తో తుడిచేసుకున్నాడు. బడుగు జీవితాల ఉద్ధరణకి ప్రభుత్వం అశ్రద్ధను గురించి ఆలోచిస్తున్నాడు. తనలాంటి ఫాళీన్నిలక్షలు!!

'ఇలాంటి లంచగొండలవల్లనే ప్రభుత్వయంత్రాంగం దెబ్బతింటోంది... చేతగాకపోతే, నోరుమూసుకూరు కోవాలి! మావంటి వాళ్ళకెంత దెబ్బ!' అని ఆరోజు ఆఫీసరు ఒంటికాలిమీద లేచాడు కన్నుమని.

'బీదవాడు పాపం!' అన్నారు అందరూ. ఆ సానుభూతితో బతకగలనని, ధైర్యంతో ఇంటికి తిరిగివచ్చేశాడు అంతే!

ఇంటో ఉంటూన్న చెంబూ, ముంతా పురాతన కాలంనాటి వగుపులూ అన్నీ బూజు దులిపాడు. పనికిరానివి తనకి పనికి వచ్చేవి...అన్నీ బయటబడి, అంజనేయులుకి ఇన్నాళ్ళూ సంరక్షించి నందుకు కృతజ్ఞత చెప్పుకొని నిష్క్రమించాయి ఒకటొకటిగా. ఇక మిగిలింది పందిరి మంచం...

కళ్లలో నీళ్ళు తిరుగుతున్నాయి. ఆత్మారాముడు అలసటొచ్చి, తీవంతచ్చి పడున్నాడు.

'అదమ్మేస్తే పిల్లలంతా నేలమీద పడుకోవాలి పాపం!' అన్నాడు సానుభూతిగానైక!

'ఏడిసినట్టే వుంది! ఇలా ఆలోచిస్తూ కూచోండి! పస్తులు పడుకోందురు గాని... మీ సంగతేం అంతుపట్టటంలేదు. ఎన్నాళ్లని ఇరుగుపొరుగుల మీదపడి తింటాం! మీరు మరో ఉద్యోగానికి ప్రయత్నించినా పనిజరగనపుడు ఏది దారి! ఎప్పుడో ఏదో వసుందని కూచుంటే, అడుక్కు తిన్నట్టే!'

'ఆఁ బాగా జ్ఞాపకం వచ్చింది. ఇప్పు డెనుక్కు తిన్న వాళ్ళంతా బతికి చెడినవాళ్ళే'

'ఆఁ అంతవరకూ వచ్చింది! ఇంతబతుకూ బతికి ఇంటివెనకాల చచ్చినట్టు అదొకాటి తక్కువైంది మనకి!'

అంజనేయుల్ను నోరు కట్టుపడిపోయింది. ఆత్మారాముడు అలసటగా గుండెగూడులో తెక్కిలు కప్పుకుని నిద్రపోతున్నాడు. మధ్యాహ్నం కూడా వెళ్ళిపోతోంది. ఇక సాయంత్రం కొడాని కెంతసేపు!

పొద్దుణించీ, ఆత్మ ఆత్మలా లేదు తెగ హోరు. ఎందుకో మారిపోయింది!! ఈ గూడు వదిలి పరిగెత్తాలనంటుంది! హోరున తుపానులా రేగుతుంది. వేధిసుంది. వ్యధ పడుతుంది. భార్యకిదెం పట్టటంలేదు. తమాయించుకోలేక వాగుతుంది.

'లెంసి భోజనానికి'

'చివరి మెతుకులు' అనుకొని చూసు



ఆందోళన

—చిత్రం: వి. అచ్యుతరా

న్నాడు భోజనానికి మరదా. ఒక్క మెతుకూ గొంతు దిగడం లేదు. బలవంతంగా నాలుగు ముద్దలు!...

'మరీ తిండి తినడం మానేశారు ఈమధ్య! ఏదైనా రోగమా ఏమిటో!' అని ఇల్లాలు గొణిగింది.

'ఇక ఈరోజుతో అన్ని రోగాలు వదులుతాయి' ఆత్మ ...డు కలు విరుచుకొంటూ లేచాడు. అంజ...లు పడక కుర్చీమీద కూర్చున్నాడో . ఫెళ్ళ ఫెళ్ళ విరిగిపడి నేలతల్లిని కవుగలించుకొంది. పక పక నవ్వాడు ఫెళ్ళ ఫెళ్ళ వినగుతోంటే...

'అదేమిటండి! నిక్షేపంలాంటి కుర్చీనిక కొటి పక పక నవ్వుతారు. పిచ్చా ఏమన్నానా? మీ వేషం ఏమిటో నా కర్థం కావటం లేదు'

కోపునెమ్మ గొంతు పూడుకపోయింది.

'ఇప్పణ్ణించే, నువ్వు బతకడం మొదలెడతావు. నువ్వుపోగానే, పిల్లాజలాని మీ అత్తవారు తీసుకపోతారు. వాళ్ళే పోషతారు. నాకే చింతా లేదు. ఊబయ్యు లేదు. అనిశల చీకటి పోతోంది'..... ఆత్మారాముడు ఆదేశించాడు.

'చివరి సారి పిల్లల మొహం చూసి వస్తా. ఇల్లాలితో ఒక్కసారి, మంతనమాడి వస్తా!

# ఆత్మసందేశం

ఆంజనేయులు అంజలిఘటించాడు.

'పిల్లలేరీ!'

'ఇంకా బడినించిరాలే! ఏం వాళ్ళెందుకు కావలసి వచ్చారు! పుణ్యమా? పురుషామా?'

'ఏమీ లేదు'. కన్నీళ్ళు తుడుచుకొన్నాడు. 'చూడు రాఘవా' ఇప్పట్నుంచే నువ్వు సుఖపడతావు? ఏవీ నీ చేతులు?... పాపం వడలిపోయిన నీ చెక్కిళ్ళకి నీ కళ్లలో జాలీడ చూచుకో నివ్వవూ?... పందిరి మంచంమీద ఒక్క సారి...'

'అయ్యో! అయ్యో! ఏమిటండీ కర్మ! మీకు మతిపోయింది, ఉద్యోగంపోయి. నాకు భయం వేస్తోంది.'

తిన్నర్థం చేసుకోలేదు తన రాఘవ... కొన్ని ఘడియలవరకే తనకీ ప్రపంచంతో సంబంధం... అని తెలుసుకోలేనిమూర్ఖురాలు. అదే వేళకి, 'పిన్నిగారూ! పిన్నిగారు' అంటూ పక్కింటి వాళ్ళమ్మాయి వచ్చింది. మంచి శకునం. చక్కగా జడ వేసుకొని జడగంటలు పెట్టుకొంది. ఒక పక్క తెంప పిన్ను... తలలో చేమంతి పూదండ... కాటుక కళ్ళతో కలివిడిగా పలకరిస్తోంది. ఏదో ఆ వయసులో ఎవరికో అందవలసిన అందం తొణుకులాడుతోంది.

ఇలాంటి శుభముహూర్తపు బంతరాత్రి పెట్టుకొన్న ఘడియలు. కన్నె పిల శకునం... ఆంజనేయులు ఆవురు ఆవురుమని చూపులతో మింగేసేలా చూశాడు.

ఆ చూపుల ఆకలికి తట్టుకోలేక, 'పిన్నిగారూ! పిన్నిగారూ!' అంటూ అమ్మాయి రాఘవమ్మ వళ్ళో దూరింది.

'ఆంజనేయులు బాబాయి కళ్ళలో ఏదో భయంగావుంది' అని గొణిగింది.

ఆంజనేయులు ప్రసన్నంగా మారిపోయి, 'అమ్మడూ! ఇలారా తల్లీ! నిన్నుచూస్తే ఏదో ఆశగావుంది.' అని ఆప్యాయంగా పిలిచాడు.

'వెళ్ళు అమ్మడూ! ఏం అనరు' అంది రాఘవమ్మ.

బెదురు బెదురుగా లేచి, లేచి పిలలా నడిచింది ఆంజనేయులు దగ్గరికి. ఆప్యాయంగా దగ్గరికి తీసుకొన్నాడు. బుగలు పుణికాడు. తల నిమిరాడు. 'అమ్మడూ! చచ్చి నీ కడుపున పుడతా' అని గొణుక్కున్నాడు లోలోపల...

కళ్ళలో గూడుకట్టుకొన్న మేఘాలు కన్నీళ్ళు వర్షించాలని తొందరిస్తున్నయ్!

వెంటనే లేచాడు. ముందుకు నడిచాడు. రాఘవమ్మ తేలి తేలి చూసింది, గుమ్మం



కుతుబ్ మీనార్ పైనుంచి ఢిల్లీలో ఒకదృశ్యం
—ఫోటో: డి. రామచంద్రరావు.

దాటడం...

...లోకమంతా తన వెంటబడుతున్నట్టుంది. పసిదయసులూ, స్నేహితులూ ఎరిగిన మొహాలూ అంతా తన్ని సాధించడానికి వెంటబడుతోన్నట్టుంది! తనకూడా పర్వెత్తుకొచ్చి, తను చేసేది తొంగిచూడాలన్నట్టుంది!

ఇకముందు ఈ బజారు... ఈ లోకం... ఈ తాయిగోడు తను చూడక, తను వినక వెల వెల బోతాయి. అంతా తన అడుగుల వెనక అంగారిపోతయి. అందరికీ తుది దర్శనం... అందర్నించీ వీడ్కోలు...

వసంతవిలాస్ కాఫీహోటలుకీ, కిళ్ళీ కొట్టు రాజాకి మరణసందేశం... లైబ్రరీకి పేపరుకి తుది పలకరింపు... అన్నింటినీ, దాటుకొంటూ తనలోనించి ప్రగల్భిస్తోన్న నవ్వు బజారంతా మారుమోగుతోంది. తన వైపే చూస్తోన్నట్టు లోకం నటిస్తోంది. తన మనస్సు ప్రతిబింబిస్తోంది.

పగిలిన అద్దంలాంటి మనస్సు...

ఆత్మారాముడి అంతరంగతరంగోత్సాహం...

పక్కనించి మోటారుకారు దూసుకుపోయింది. సెంటర్లో పోలీసు మెడబట్టి పక్కకు నెట్టాడు.

సంధ్య చల్లగా చేజారిపోతోంది. గుంపులు గుంపులుగా కూడుకొంటోన్న లోకం... తెప తెప వెలుగుతోన్న దీపాలు...

చెవిలో దూసుకుపోతోన్న రహస్యం తన పెదవుల్ని పలకరించడం లేదు.

జనం ఆకాశంమీదికి చూస్తోంది.

'ఏమిటేమిటి? చివరిసారి చూసిపోతా! అదేదో చూసి హత్య చేసుకుంటా' అన్నాడు ఆత్మారాముడు.

'అంజనేయులూ; చివరిసారి నాకింత మేత పడేయ్యవూ?' అని గొణుక్కొన్నాడు ఆత్మారాముడు.

'ఇక నీకూ నాకూ సంబంధం లేదుపో? ఉండమంటే ఉరకలేస్తున్నావు... నాకేం?'

కడుపునిండా నవ్వుకొన్నాడు అంజనేయులు. జనం విరగబడి, తలలెత్తి ఆకాశంలోకి కళ్ళు దూర్చి చూస్తున్నారు. చావడానికేదిదారి? ఎలా విముక్తి? కాలవలో పడితే, పడవవాళ్ళు రక్షిస్తారు. రైలుకింద తలపెడితే...అమ్మో! భయంకరమైన చావు! తల తెగి ఏపాముల పుట్టమీదో బంతిలా ఎగిరి పడుతుంది.

రకరకాల చావులూహించుకు చూశాడు. తల పగలగొట్టుకోడానికి, ఏ రాయయితేనేం ఎలాగో, ఓలాగ ఆత్మ తననించి వేరుపడాలని చూస్తోంది. ఈ ఎముకల పంజరంలోంచి చిలకెగిరిపోతే చాలు...ఏ మహారాజు కడుపులోనో దూరొచ్చు.

గుంపులో కలకలం చెలరేగింది. మెడలు విరగబడి చూస్తున్నాయి.

అదిగో! తోకచుక్కలా...ఎఱ్ఱని అగ్నిగోళంలా... మొదటి దాన్నంటి మరో పాట? మన పుణ్యం పండి. సాధారణంగా నే కనిపిస్తోంది.

అంజనేయులు కలవరపడ్డాడు.

"ఏమిటదీ?" అనడిగాడు.

"స్పుత్నిక్కు. సెకండుకి 8000 మీటర్ల వేగంతో భూమిచుట్టూ ప్రదక్షిణం చేసే ఉపగ్రహం. రష్యావాళ్ళు ప్రపంచ చరిత్రలో కొత్త అధ్యాయాన్ని సృష్టించారు?

అని జవాబొచ్చింది. మరికొంత ముందుకు సాగాడు. అక్కడా జనం విరగబడి చూస్తున్నారు.

దీనితో చంద్ర లోకం కూడా వెళ్ళి పోతారట! ఇంక కొన్ని సంవత్సరాలలో.

"ఇది రెండో దీ గంటన్నరలో భూమంతా గిర గిర తిరిగి వచ్చేస్తుందట"

మానవుడు సాధించలేని మహాతేదీ లేదు. ప్రకృతి ప్రతీక్షణం మానవుని పాదాలముందు ఓటమిని ఒప్పుకొని కూలబడుతోంది.

"రష్యావోడు ఆకాశంలో దీపం వెలిగించి తిప్పుతున్నాడంట...ఇదే నిత్రంకి అందులో ఓ కుక్క కూడా నంట"

పల్లెటివాడి గొంతు చెవిలో దూసుకుపోయింది.

ఇంత చచ్చేచావులోనూ పక్కుమని నవ్వాడు. ఆచిత్రం అందరికీ అన్నిరకాలుగా కనిపిస్తోంది.

"ఆకాశంలో వికసించిన పచ్చ పసుపు బంతి పువులా..."

'ఎగురుతోన్న ఎఱ్ఱని దీపపక్షిలా...'

తనకి మాత్రం ఈలోకంలో ఈగృహంలో సాధించలేనిదే వుంది? అంతా భ్రమ...అంతా నటన ఈ నాటకం పూర్తికాగానే, రంగు కొటాకడిగేసుకున్నటే...జీవితం...

ఆత్మారాముడు ఆలోచనలో పడిపోయాడు. చావా? బ్రతుకా?

"ఇక చావనక్కర్లేదు బతికుంటే చంద్రలోకం పోవచ్చునదు."

అన్నాడు ఆత్మారాముడు.

అంజనేయులు చుక్కలోకి చూశాడు.

పక్కనున్న పెద్దమనిషి దగ్గర టెలిస్కోపు చూశాడు. తనకళ్ళముందు కుక్క తొంగున దూకి పరుగెడుతోన్నట్టుంది.

"అమ్మయ్యా" అనుకుని నిట్టూర్చాడు.

'అబ్బె! కన్నెపిల శకునం మంచిది కాదు. దారిలో నే దగా జరిగింది. చావతలపింది బతికి పోయాను'

అనుకొన్నాడు అంజనేయులు. అమ్మను రాఘవమ్మ వళ్ళో చెనురుగా వాలినదృశ్యం కన్నీటి తెరమీద ప్రదర్శించింది.

ఆత్మారాముడు గుండె గూడులో ముడుచుకు పోయాడు ఎవర్నని ఏం లాభం? రాఘవమ్మ జీవితరాజ్యం పాలించడానికి అకారజాపుతో బంధింపబడి, ఇలా వెదుక్కుంటూ వెనక్కు తిరిగాడు. హృదయమంతో తేలికపడి, ఏదో సాధించాలనే ఆశ అపాదమస్తకం విద్యుత్తరంగంలా నరాల్లో ప్రవహిస్తోంది. 

# నక్షత్ర ఫలితాలు

[4-2-59 మొదలు 10-2-59 వరకు]

గ్రహ స్థితి.

| | | | |
|---|---|---|---|
| శ | | శు | |
| కు | ధనుర్మకర కుంభ మీనములలో చంద్రుడు. | | |
| ర బు | | | |
| కే | గు | | రా |

*** అశ్విని [చూ, చే, చో, లా] ***

ఈవారము అనుకూలత కన్నా ప్రతికూలతె యెక్కువ. యత్న కార్యములు శ్రమాధిక్యముతో ఫలించును. కోర్టు దావాలు అనుకూలిస్తవి. పరోపకారానికి యత్నపడి సాగక నిందలు పొందుతారు. భార్య ఆరోగ్యము సరిగాయుండదు. ఇచ్చి పుచ్చుకునే పట్ల వివాదాలు ఉద్యోగస్తులకు అధికారుల ఇబ్బడి వున్నా తోటివారి సహకారము లభిస్తుంది. వర్తకులకు వారమంతా నిరాశ. విద్యార్థులకు చదువు బాగా సాగదు.

*** భరణి [లీ, లూ, లే, లో] ***

ఈవారము ఎన్ని ఆటంకములు వచ్చిన పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభమును పొందుతారు. ఆశించిన డబ్బు సమయానికి అందక అప్పుచేస్తారు. సోదర సహాయము కలుగుతుంది. ఆత్మీయులవల్ల నిందలు పొందుతారు. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు భూస్వాములకు ఇంజనీరింగు శాఖ ఉద్యోగులకు, రంగుల లోహపుసామాన్ల వ్యాపారస్తులకు కష్టములో కూడిన లాభము. 7వ ప్రమాదభయం.

*** కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] ***

ఈవారము మీకు యోగప్రదము. బంధువుల సహాయముతోనూ, అధికారుల సహాయముతోనూ ఆటంకములను గడిచి ఫలం పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. వైద్య జ్యోతిష శాస్త్ర ప్రసంగాలు చేస్తారు ఈశాన్య దిక్కునుండి శుభవార్త తెలుస్తుంది. విద్యార్థులకు మంచికాలము, కవులకు- శిల్పులకు నటీనటులకు యోగకాలం 5,6,9,10 ధనలాభము కార్యసిద్ధి.

*** రోహిణి [ఓ, వా, వీ, వూ] ***

ఈవారము మీకు యోగదాయకముగా వుంటుంది. ఆశించినసొమ్ము చేతికి వస్తుంది. నూతన కార్యములు ప్రారంభిస్తారు. కోర్టు దావాలలో అనుకూలత వుంటుంది. పండిత గోష్ఠిజరిపి నూతనవిషయాలు తెలుసుకుంటారు. వారమంతా శుభయోగములున్నా కొంతఆందోళనతో కూడివుంటుంది. 5, 6, 9, 10 ధనలాభము, కార్యసిద్ధి. పుత్రుల లాభాభివృద్ధి. 7, 8 అధిక ఖర్చులు. విద్యార్థులకు చదువు బాగాసాగుతుంది. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగా వుంటుంది.

## బి. నరసింగరావు

*** మృగశిర [వే, వో, కా, కి] ***

ఈవారము వినోదములలో పాల్గొనుట, దధి-క్షీర, మధురపదార్థ యుక్తసుభోజనము రజితపాత్రలలో భుజించుట, తలచిన కార్యములలో జయము, నీటిమీద ప్రయాణము, తెల్లటివస్త్రములు కొనుట మొదలగు యోగములు కలుగును. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవపదార్థ జన్యముల క్రయ విక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము. విద్యార్థులకు మంచికాలము. 7, 8 అధిక ఖర్చులు, ఆందోళన.

*** ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] ***

ఈవారము ధనధాన్యవృద్ధి, కృషిమూలకముగా లాభము, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, ఇషవస్తులాభము. పరోపకారమువల్ల కీర్తివంటి రాజయోగములు కలుగును. విద్యార్థులు వినోదములలో పాల్గొన్నా చదువు బాగాసాగుతుంది. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు రెట్టింపులాభము కలుగును. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు, యోగకాలము. ఆప్తులతో బ్రిడ్జి వినోదము.

*** పునర్వసు [కే. కో. హా-హీ] ***

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ. రాబడి తక్కువ. గృహోపకరణములు తీరనందున కలతలు. ఆరోగ్యము సరిగాలేని సూచనలు కనపడగానే ఔషధ చికిత్స పొందడమే కాకుండా గ్రహరాజైన రవికి శాంతి చేయించుట మేలు. ఉద్యోగస్తులకు కొత్తసమస్యలు. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. రాజకీయవాదులకు ఆందోళన. 7, 8 ఆరోగ్య భంగము, అధిక ఖర్చులు. 9, 10 మిత్రవర్గ సహాయము, ధనలాభము. ప్రయాణము.

*** పుష్యమి [హూ. హే. హో. డా.] ***

ఈ వారము మీకు మిశ్రమయోగము. మొదట్లో నిరాశగా వున్నా మిత్రసహాయము వల్ల కార్యలాభమును పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు ఏమంత బాగుండదు. విద్యార్థులకు బద్ధకమువల్ల చదువు సాగదు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగములు వున్నా మిత్రసహాయము, కార్యసిద్ధి, విదేశీయుల పరిచయము, విచిత్ర వస్తు సంపాదనవంటి శుభయోగములు కూడా వుంటవి.

*** ఆశ్లేష [డీ. డూ. డే. డో] ***

ఈ వారము మీరు సహాయము పొందదలుచుకున్న వ్యక్తిమూలముగా కార్యహాని అవుతుంది. ధనాభావంకూడా ఎక్కువ. ఇంటివారి ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. ఆధ్యాత్మిక చింతవల దైవము పై భారమువేసి కార్యలాభము పొందుతారు. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వ్యాపారస్తులకు నిరాశ. విద్యార్థులకు మంచికాలము కాదు. పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, విచిత్రములను చూచుట జరుగును. వారమంతా అవయోగ, శుభయోగ మిశ్రమముగా వుంటుంది

*** మఖ [మా మీ మూ మే] ***

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలతె ఎక్కువ. యత్న కార్యములు ఎక్కువ శ్రమతో ఫలిస్తాయి. కోర్టు దావాలు అనుకూలిస్తవి. ఇతరులకు సహాయము చేయబూని ఫలించక నిందలు పొందుతారు. ఇచ్చిపుచ్చుకోవడాలలో వివాదాలు ఏర్పడతాయి. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ, తోటివారి సహకారము వుంటాయి. వర్తకులకు వారమంతా నిరాశ, వారాంతమున మేలు. 7, 8 భార్య అనారోగ్యముచే ఆందోళన. విద్యార్థులకు చదువు బాగా సాగదు.

## ధరలు:

నూలు వస్త్రములు: సమస్థాయిలో వుండును.

నూనెగింజలు: మార్పులేదు.

ఆహారధాన్యములు: నిలకడగా వుండును.

బెల్లము, పంచదార: మార్పులేదు.

చింతపండు: స్వల్పము గాతగ్గును.

పప్పుదినుసులు: సమస్థాయిలో వుండును.

వెండి,బంగారము: స్వల్ప తేడాలో వుండును.

* * *

జన్మనక్షత్రమునుబట్టిగాని, జన్మనక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్లననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకోనునది. కృష్ణుడను పేరునకు మృగశిరానక్షత్రమును, కృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడను పేరునకు హస్తయును,భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయున్నూ చూచుకోనునది.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### (మో, టా, టీ,టూ)

ఈ వారము ఎన్ని ఆటంకములు వచ్చినా పట్టుదలతో ప్రయత్నించడమువల్ల కార్యసిద్ధి అవుతుంది. ఆశించిన సొమ్ము సమయానికి అందక అప్పుచేస్తారు. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు, లోహారంగుల వ్యాపారస్థులకు కష్టముతో కూడిన లాభము. గనుల యజమానులకు, యంత్రములు నడుపు నిపుణులకు ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు మేలుకాలము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

ఈ వారము మీకుయోగకాలము. బంధు సహాయము, అధికారుల సహాయము కలుగుట చేత ఆటంకములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. శాస్త్ర ప్రసంగాలలో పాల్గొంటారు. కవులు నూతన రచనలు చేస్తారు. బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషిస్తారు. విద్యార్థులకు ఉత్సాహముగా వుంటుంది. గణితశాస్త్రజ్ఞులకు. కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలము.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మీకు మంచి భాగ్యయోగము. అనుకున్న డబ్బు చేతికి వస్తుంది.ఇబ్బందులు తీరుతవి దావాలలో గెలుపు పొందుతారు. బిడ్డల అభివృద్ధికి చేసే ప్రయత్నాలు ఫలిస్తవి. విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. న్యాయస్థాన ఉద్యోగులకు, న్యాయవాదులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుకాలము.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము మీకు యోగదాయకము. ధనయోగము వుంటుంది. సంగీత సభలు, కవితాగోష్ఠి వంటి వినోదాలలో పాల్గొని మృష్టాన్న భోజనము వెండి పాత్రలలో చేస్తారు. శుభకార్యాలలో పాల్గొంటారు. నూలు, బట్టలు, బియ్యము, వెండి వర్తకులకులాభము. విద్యార్థులు ఉత్సాహముగా చదువుకుంటారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగా వుంటుంది.

### * స్వాతి [రూ, రే, రో, తా]*

ఈ వారముకూడా గత వారమువలెనే మీకు యోగదాయకముగా వుంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభదాయకముగా ముగుస్తవి. శుభ పుణ్యకార్యాలలో పాల్గొంటారు. నూతన గృహనిర్మాణమునకు ప్రయత్నిస్తారు.ఉద్యోగస్థులకు హోదా పెరుగుతుంది. వర్తకులకు విలువగల వస్తువుల క్రయ విక్రయములలో ఎక్కువ లాభము. వారమంతా శుభయోగములతో కూడివున్నా కుటుంబకలహము చే ఆందోళన కలుగుతుంది. వారాంతమున స్త్రీలతో నూ, మిత్రులతో నూ విందు, వినోదము.

### * విశాఖ [తీ, తూ, తే, తో]

ఈ వారము రాబడి తక్కువ. ఖర్చులు ఎక్కువ గృహావసరములు తీరక స్పర్థలు వస్తవి. అనారోగ్యసూచనలు కనబడగానే ఔషధచికిత్స పొందడం, రవికి శాంతి చేయించడము మంచిది. ఉద్యోగస్థులకు కొత్తసమస్యలు. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా జరగదు. వారమంతా భయాందోళనలతో కూడివున్నా పితృవర్గమునుండి సహాయము, కార్యలాభము కలుగుతవి.

### అనూరాధ [నా, నీ, నూ, నే]

ఈ వారము నిరాశగావున్నా మిత్రసహాయమువల్ల కార్యలాభము అవుతుంది. ఇంట్లో వున్నవారి అనారోగ్యమువల్ల ఆందోళన కలుగుతుంది. ఉద్యోగస్థులకు స్వల్ప అనుకూలత. వర్తకులకు వారాంతమందు లాభము. వారమంతా ఉద్రేకముగా వుంటుంది. విదేశీయులపరిచయము, అపురూపవస్తుసంపాదన. 7, 8 ఎక్కువఖర్చు, మనోవ్యధ.

### *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము మీకు మిశ్రమయోగము. ఆశించినసహాయము లభించక, అవసరములుతీరక ఆందోళన కలుగుతుంది. అయినప్పటికీ దైవానుగ్రహమువల్ల కష్టములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఉద్యోగస్థులకు అధికారుల ఆదరణ. వర్తకులకుచాంచల్యము, పుణ్యపురుషుల సాంగత్యమువల్ల మనోవికాసము కలుగుతుంది. వారమంతా అశాంతిగా వున్నా సముద్రద్రవ్యలాభము పొందుతారు. 7, 8 అధిక ఖర్చులు.

 # నక్షత్రఫలితాలు 

*** మూల [యే, యో, బా, బీ] ***

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత యెక్కువ. ఇచ్చి పుచ్చుకునేపట్ల వివాదాలు వచ్చి మనోవ్యథ కలుగుతుంది. కోర్టు వ్యవహారములు అనుకూలించినా అమిత ఖర్చులవల్ల సంతోషము వుండదు. భార్యకు అనారోగ్యము కలిగే సూచన లున్నవి. మినుములు, కొర్రలు, రాగులు, ఉప్పు, నువ్వులు, నూనె వ్యాపారస్తులకు లాభయోగము. ఇతర జాతులవారివల గౌరవము కలుగుతుంది. 7, 8, భార్యకు అనారోగ్యము, బంధువుల రాక, అధిక ఖర్చులు.

***పూర్వాషాఢ [బూ, ధ, భా, డా]***

ఈ వారము ఎంత ప్రయత్నించినా యత్నకార్యములకు ఆటంకములు కలుగుతునే వుంటవి. అయినను పట్టుదలవల కార్యలాభము పొందుతారు. సోదర సహాయమువల్ల ఒడిదుడుకులు సరుకుంటాయి. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల-యజమానులకు, లోహ, ఖనిజ వ్యాపారులకు, పోలీసుశాఖ ఉద్యోగులకు మేలుకాలము. 7 న ప్రమాదభయం 8 న అధికఖర్చులు.

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

ఈ వారము మీకు యోగదాయకము. ప్రయత్నించినపనులు నెరవేరుతవి. ధనలాభము కలుగుతుంది. ఈశాన్యదిక్కునుండి క్షేమవార్త తెలుస్తుంది. శుభకార్యములలో పాల్గొంటారు. బంధుదర్శనము, గణిత జ్యోతిష శాస్త్రచర్చలు జరుపుతారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ఇత్తడి, కంచు వర్తకులకు లాభదాయకము. కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలము. 8 అధికఖర్చులు. 9, 10 కార్యసిద్ధి.

*** శ్రవణము [జూ, జే, జో, ఘా]***

ఈ వారము మీకు శుభయోగము. ఆశించిన డబ్బు చేతికి వస్తుంది. ఇంట్లో శుభకార్యాలకు ప్రయత్నములు చేస్తారు. పుణ్యకార్యాచరణ, ప్రభుత్వ సన్మానము, శాస్త్రచర్చలు వంటివి జరుగుతవి. విద్యార్థులు నూతనాంశాలను నేర్చుకుంటారు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగా వుంటుంది. ఇంట్లోవున్నవారి అనారోగ్యంవల కలిగిన ఆందోళన తొలగుతుంది. పిల్లల క్షేమలాభములకొరకు కొన్నియేర్పాట్లు చేస్తారు.

*** ధనిష్ఠ [గా, గీ, గూ, గే] ***

ఈవారము మీరు తలపెటిన కార్యాలలో జయము పొందుతారు. బంధుమిత్రులతో మృష్టాన్నభోజనము చేస్తారు. వినోదములలో పాల్గొంటారు. విద్యార్థులకు చదువు ఉత్సాహముగా సాగుతుంది. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవపదార్థజనిత వస్తువుల వర్తకులకు లాభదాయకము. కవులకు, గాయకులకు, కళాకారులకు నటీనటులకు మేలుకాలము.

*** శతభిషం [గో, సా, సీ, సూ]***

ఈవారము మీకు యోగప్రదము. ధనధాన్యవృద్ధి వుంటుంది. వివాహాది కార్యాలోచనలు ఫలప్రాప్తి పొందుతాయి. ఇవ వస్తులాభము, పరోపకారమువల్ల కీర్తి కలుగుతవి. విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు ఎక్కువలాభము. వాహనయోగము కలుగుతుంది. కవులకు గాయకులకు కళాకారులకు, నటీనటులకు యోగకాలము

***పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]***

ఈ వారము కార్యభారము ఎక్కువ. వింతమాటలు వినుట, పరాక్రమమువల ఘనత, ప్రయాణము, ధనలాభము ఉండును. అకాల భోజనమువల అనారోగ్యము కనబడగానే జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. రాజకీయవాదులకు వారమంతా అలజడితోపాటు అనుకూలత. 7, 8 అనారోగ్యము. 9, 10 పిత్రువంశ సహాయము, కార్యలాభము.

***ఉత్తరాభాద్ర [దూ, శం, ఛా, ధా]***

ఈ వారము యత్నకార్యములకు అలస్యము. వర్తకులకు లాభముతక్కువ. ఆత్మీయుల ఆరోగ్యము చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు వనపర్వతప్రాంతములకు బదిలీ అయే సూచన లున్నవి. రహస్యములను కనిపెట్టుటకు నియోగించబడుతారు. వారమంతా చికాకుగా వున్నా వారాంతమందు అజ్ఞాతమిత్రుని సహాయమువల్ల కార్యసిద్ధి జరుగుతుంది.

*** రేవతి [దే, దో, చా, చీ] ***

ఈ వారము ధనాభావము ఎక్కువ. ఎవరిసహాయమువల్ల కార్యసాధన చేదామనుకున్నారో వారివల్లనే ఆటంకములు కలుగుతవి. అయినా దైవబలమువల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది. ఇంట్లో వారి ఆరోగ్యము బాగుండదు. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వర్తకులకు నిరాశ. విద్యార్థులకు మంచిరోజులు కావు. వారమంతా ఆందోళనవున్నా సాధు సాంగత్యము, పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, విష్ణు ప్రవృత్తి లాభము కలుగును.



# సృష్టి మర్మము



పాంథుఁడొకడు పనిమీదను
ప్రక్కఊరు జేరదలచి
కాలినడక నేగుచుండ
కాళ్లుగాలె నెండవడికి.

చెంతనున్న గొప్పమఱ్ఱి
చెంత జేరి వంతదీర
కొంతసేపు విశ్రమించి
సేదదీఱి యేగదలచె;

మఱ్ఱిచెట్టు కల్లంతన
మట్టిగుట్ట; దానిపైన
దట్టముగా నల్లుకొన్న
దొక గుమ్మడి, కాయలతో;

చల్లగాలి మేనుసోక
మెల్లగనట మేనువాల్చి
పైకిజూచి, ప్రక్కనున్న
పాదుజూచి తలయూచెను;

"సృష్టికర్త యవివేకముఁ
జూడఁజూడ నవ్వువచ్చు.
తెల్లవాఱె నతని తెలివి!
దేవుం డవివేకి నిజము;

కానంత గుమ్మడికిని
కడవలంత కాయలుంచె,
ఊరంత మఱ్ఱికి మరి
ఉస్తికాయ లంతలౌర!

వ్యత్యస్తము జేసెనౌర
సత్యాతిశయముగ వీనిని;
ఇంతపెద్ద మఱ్ఱికి దగి
నంతకాయ లుండవలదె ?"
అని తలచుచు నిద్రించెను.

పక్షుల కలకలములతో
నాక్షణమున మేలుకాంచి
పైన ప్రక్క చుట్టుపట్ల
పడిన మఱ్ఱిపండ్ల జూచి:

"నిజముగ దేవుడె వివేకి
నేనె తెలివి లేనివాడ
అజ్ఞని సృష్టి మర్మ మెఱుగ
కాక్షేపించితి నకటా!

ఈ మఱ్ఱికి నిజముగ నా
గుమ్మడి వలె కాయలున్న
ఒక్కకాయతో నా తల
ప్రక్కలు గాకుండునా ?"

భగవంతుడు బాగుగ,
నాలోచించియె సృజియించెను
నీడనిచ్చు నీ మఱ్ఱికి
నింత చిన్నకాయలు."

అని తలపోయుచు నాతడు
భక్తిభావ మెదనుసోక
భగవంతుని స్తుతియించుచు
నచటు బాసి యేగెను.

 తిప్పావఝుల వెంకట్రామయ్య 

# యుక్తిపరుడు

[వసంతరావు రామకృష్ణరావు]

చాలకాలం క్రిందట శ్రుతకీర్తి అనే రాజు అవంతీదేశాన్ని పాలిస్తూ ఉండేవాడు. ఆ మహారాజు ధైర్య సాహసాలలోనే గాకుండా విద్యా విజ్ఞానాలలో కూడా అపారమైన పేరు ప్రఖ్యాతులు గడించుకొన్నవాడు. అతడు గొప్పకళాభిమానియై ఎంతోమంది కవులనూ, గాయకులనూ, పండితులనూ ఆదరించి వారికి అగ్రహారాదిదానాలు పరితృప్తిగా ఇచ్చేవాడు. ప్రజలందరూ శ్రుతకీర్తి పరిపాలనలో హాయిగా జీవించేవారు.

పర్వసమయాలలో, ముఖ్యంగా దసరా పండుగలలో ఆ రాజు అనేక విద్వాంసుల సభలనూ, పండిత గోష్ఠులనూ ఏర్పాటుచేసి అందరికీ మణిమయాదులు కానుకలుగా ఇచ్చేవాడు. ఆ కారణంచేత దేశంలోని పలుతావులనుండి కవిపండితగాయక వైతాళికులు వచ్చి, శ్రుతకీర్తి దానధర్మాలను బడసిపోతూ ఉండేవారు.

రాజు ఈ విధంగా దానధర్మాలు చేయడం, అతని ప్రధాన మంత్రి అయిన కృతవర్మకు నచ్చలేదు. అతడు రాజుగారితో ఇలా విన్నవించుకొన్నాడు: "ప్రభూ! తమరి వదాన్యత సాటిలేనిది. కాని ఇంత విస్తారంగా దానాలు చేసేట్లయితే కొలది కాలంలోనే మన ధనాగారంలో ఉన్న సంపదఅంతా హరించుకొనిపోతుంది. అప్పుడు ప్రజలమీద పన్నులు వేయాల్సిఉంటుంది. ప్రజలకు పన్నుల బాధ లేకుండా చెయ్యాలి అంటే ఒక్కటేమార్గం- కవులకు మీరిచ్చే కానుకలు బహు స్వల్పంగా ఉండాలి. కవులందరూ ఏవో పొగడుతూ శ్లోకాలు వ్రాసేవారే. వారిలో పాండిత్య ప్రకర్ష లేదనే చెప్పాలి-కాబట్టి వారికి వారు వ్రాసిన గంటమూ తాళపత్రమూ ఎంత బరువుఉంటే అంత ఎత్తు బంగారు ఇవ్వండి-వారు వ్రాసేది ఎంత బరువు తూగితే అంత బంగారు ఇస్తామని చాటింపు వేయిస్తాను. ఈ ప్రకారం చేస్తే దేశంలోని ఆర్థిక స్థితికి భంగమూ రాదు; ప్రభువు వారి వదాన్యతకు లోటూ ఉండదు."



చి॥ భమిడిపాటి సుబ్బలక్ష్మి బాలల సంఘం మొదటిపోటీలో ప్రథమ బహుమతిగెలుచుకున్న బాలిక: [B వర్గం; 1892] రచన: నచ్చిన పండుగ: "దీపావళి" వయస్సు: ఏడుసంవత్సరాల రెండు నెలలు. విశాఖపట్టణంలో చదువుకొంటున్నది.

శ్రుతకీర్తికి కృతవర్మ చెప్పిన దానితో ఏకీభవించక తప్పలేదు. ఇంతలో దసరాపండుగ వచ్చింది. శ్రుతకీర్తి వైభవోపేతంగా ఉత్సవాలు జరిపించి, కవులనూ, పండితులనూ యథాశక్తిని సత్కరించ సాగాడు. కవులందరికీ వారు వ్రాసిన తాళపత్రాలూ గంటమూ ఎంత బరువుతూగితే అంత బంగారం మాత్రమే లభించింది. వారికి సంతృప్తి కలగలేదు. అయినప్పటికీ ప్రభువు కరుణాకటాక్షవీక్షణము అంతే కదా అని సమాధాన పరుచుకొని ఎవరి ఇళ్లకు వారు వెళ్లిపోయారు.

ఆ రాజ్యంలో రామచంద్ర కవి ఒక్కడే ఇంకా రాజుగారి ఆస్థానానికి వెళ్లలేదు. తనసాటి కవిపండిత మిత్రులు దసరాపండుగ సందర్భంలో అల్ప పారితోషికాలతో రావడం, అంతకుముందు కవుల

వ్రాసిన దానిబరువును బట్టి పారితోషికం ఇవ్వబడుతుంది అనే చాటింపు వినడం జరిగింది. రామచంద్ర కవి ఒక యుక్తిపన్నాడు. తను మాత్రం చిన్న కానుకతో తృప్తిపడరాదని అతని నిశ్చయం.

ఆనాడు విజయదశమి-శ్రుతకీర్తి హితులూ, పురోహితులూ, మంత్రులూ, సామంతులూ, గాయక వైతాళికులూ — వీరందరితో కలసి నిండుసభలో కొలువుతీర్చి ఉన్నాడు- కృతవర్మ ఉచితాసనం మీద కూర్చొని ఉన్నాడు. ఆసమయంలో రామచంద్ర కవి శ్రుతకీర్తి కొలువులోనికి ప్రవేశించి, ధారాపాతంగా పది శ్లోకాలు చదివేడు. ఆశ్లోకాలు చాలా భావగంభీరతతో, అలంకారములతో నిండిఉండడంచేత, సభలో హర్షధ్వానాలు చెలరేగాయి. శ్రుతకీర్తికి ఆ కవికి తగిన సూడిదలు ఇచ్చి ఘనంగా సత్కరించాలని తోచింది. అతడు కృతవర్మకేసి చూసాడు. కృతవర్మ రాజాజ్ఞ పాటించి రామచంద్ర కవితో ఇలా అన్నాడు:

"కవీంద్రా! ప్రభువులు తాము రచించిన శ్లోకాలకు తగిన కానుక ఇచ్చి సత్కరించవలసినదని నన్ను ఆజ్ఞాపించారు. మీరు వ్రాసిన తాళపత్రాలూ, గంటమూ తెప్పించండి. అవి ఎంతబరువు తూగితే అంత బంగారు మీకు కానుకగా లభిస్తుంది." శ్రుతకీర్తి నిర్లిప్తతతో కృతవర్మకేసి చూడసాగాడు. అప్పుడు రామచంద్ర కవి రెండు చేతులూ జోడించి ప్రభువులకు నమస్కారం చేసి వినయంగా ఇలా విన్నవించుకొన్నాడు—" ప్రభువుల కృపా



చి॥ అమరవాది అనంతపద్మనాభం బాలల సంఘం మొదటి పోటీలో ప్రథమ బహుమతి గెలుచుకున్న సభ్యుడు: [A వర్గం: 789] రచన గండికోటయాత్ర: వయస్సు పన్నెండుసంవత్సరాల నాల్గు నెలలు: కడపజిల్లా ప్రొద్దుటూరు మునిసిపల్ హైస్కూలులో 6.వ ఫారం చదువుతున్నాడు.

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## బాలల సంఘం

GROUP
**A లేక B**

[సభ్యత్వపు దరఖాస్తు]

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ....

పుట్టినతేదీ, నెల, సంవత్సరం : జూలై 1 నాటికి వయస్సు ....
తండ్రి, లేక, సంరక్షకుని పూర్తి పేరు : ....
ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీధి నెంబరు] ....
* చదువుతున్న తరగతి, లేక, ఫారము ; ....
పాఠశాల పేరు : ....
ప్రధానోపాధ్యాయుని పేరు (తెలిస్తే) ;

ఆర్జి:
ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొన ప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

ఇట్లు

[తేదీ : -1958]

(సంతకము)

* వరా : ఏ పాఠశాలలోనూగాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడి' అని వ్రాయాలి.

**సంచిక: 4-2-59 | ఈ దరఖాస్తు 7-2-59 నాటికి మాకు చేరాలి |**



కృషి ఫలితం

—ఫొటో: సోమయాజులు]

## యుక్తి పరుడు

దృష్టికి ఇవే నా శ్రద్ధాంజలులు. నేను చదివిన పది శ్లోకాలూ మా గ్రామంలోనే ఉన్న పెద్ద బండ రాతి పలకమీద, గునపాం సహాయంతో వ్రాసాను. మా గ్రామంలో ఎక్కడా తాళపత్రాలు లభించలేదు. గంటమూ కనిపించలేదు. అందువల్ల బండరాతిమీద పలక చేసి ఆ శ్లోకాలు చెక్కాను. ప్రభువులు నన్ను కటాక్షించి, సేవకుల మూలంగా బండరాతిని కొలువుకి తెప్పించి, ఆ బండరాయి ఎంత బరువు తూగితే అంత బంగారు మీరు ప్రసాదించండి. ఇదిగో గునపాం ఇక్కడే ఉంది. ముందు దీని ఎత్తు బంగారు నాకు ప్రసాదించండి ప్రభువుల కరుణాకటాక్ష వీక్షణాలు చూస్తే నాకు పరవశంగా ఉన్నది."

ఈ వాక్యాలు వినేసరికి కృతవర్మకు ఆశ్చర్యమూ, కొంచెము కోపమూ కలిగాయి. శ్రుతకీర్తి రామచంద్ర కవి యుక్తిపరుడని గ్రహించుకొని మెల్లిగా చిరునవ్వు నవ్వాడు. కొలువులోని వారందరూ రామచంద్ర కవి యుక్తికి ఎంతో మెచ్చుకొన్నారు. శ్రుతకీర్తి సేవకులను పంపి, బండరాయిని తెప్పించి, ఆ బండరాయి బరువుకి సమానంగా, తన ధనాగారంలోని బంగారం తెప్పించి, రామచంద్ర కవికి ప్రసాదించి, ఆతనిని పలువిధాలు సత్కరించి సాగనంపాడు. ఆ రాజ్యంలోని ప్రజలందరూ రామచంద్ర కవి యుక్తి సంపదకూ, శ్రుతకీర్తియొక్క వదాన్య సంపత్తికీ, ఎంతో ఆనందించేరు. ★

# ★ గుండె గొంతుకలోన... ★

(23-పేజీ తరువాయి)

లేకపోతే భావనానంద మధురిమలో విశ్వాసరూపంగా అసువులు విడిచిపెట్టగల విలక్షణమైన జీవిగా పుట్టినా హాయిగా ఉండేది. తను ఏదీ కాదు. రెండూ కాక పోలేదు.

ఆరోజు తను పుట్టినరోజు. మురారీ శ్రీపతీ ఇద్దరూ విందుకొచ్చారు. ఇద్దరిలోని వైవిధ్యం స్పష్టంగా కన్పించింది. ఇద్దరూ కానుకలు తెచ్చారు. శ్రీపతి అందంగా గీతం రాసుకొచ్చాడు. ఈ పద్యం నైవేద్యంగా అర్పిస్తున్నా నన్నాడు. మురారి టాయిలెట్ సెట్టుతో కలిసిఉన్న పెద్దఅద్దం కొనిచ్చాడు. అది ముచ్చటగా ఉంది.

శ్రీపతి తన భావనకు చిహ్నంగా గీతం రాస్తే, మురారి శారీరకము, ప్రాపంచికమైన విషయాల్ని ప్రతిబింబింప చేసే అద్దాన్నిచ్చాడు. ఇంతటి భిన్నత్వంలోను తన్ను గురించిన ఏకత్వం కనిపిస్తోంది.

ఆరోజు ఉదయం అలంకరించుకుంటూ లక్ష్మి శ్రీపతి గీతం తలుచుకు మైమరిచిపోయింది. మనసు పరవశమైపోయి ఆనందమయమయింది. మత్తుగా కళ్ళు విప్పి చూస్తే ఎదురుగా తన ప్రతిబింబం - మురారి బహుమతి చేసిన అద్దంలో - మగతగా అలసిన కళ్ళు, సిగ్గుతో ఎర్రబడిన చెక్కిళ్ళు. శ్రీపతి గీతంద్వారా పొందిన తన్మయత్వంలో ఈ ప్రతిబింబాల్ని చూడలేకపోయింది. తన్ను అద్దంలో చూసుకుంటున్నప్పుడు ఆ ఆవేశం అందుకోలేకపోయింది. కలలో నా సతం కన్పించదు. నా సతం కల కాదు. రెంటిలో ఏదో ఒకటి తేల్చుకోవాలి. రెంటికీ మధ్య జరిగే ఘర్షణలో తను నలిగిపోతోంది. బక్కచిక్కి తూలిపోతోంది.

మరురోజు మురారి వచ్చాడు.

'శ్రీపతికి జ్వరం తగిలిందటగా!'

'ఏమో నాకు తెలియదు'

'పోనీ చూసిరాకపోయినావా?'

'నేనెందుకు చూసి రావటం?'

'అదేమిటి మురారీ! స్నేహితుడుకదా!'

'నీకు స్నేహితుడేమో. నాకేం కాదు... లక్ష్మీ ఒక్క సంగతి చెప్పనా...?' తటపటాయించాడు.

'నువ్వు శ్రీపతిని గురించి ఆలోచించటం నాకేమాత్రం ఇష్టంలేదు. శ్రీపతి నీలోకి చూస్తూ ఉద్రేక పడితే నా గుండెకు కోతలు పెట్టినట్టుంటుంది. ఇది నాలోని ఈర్ష్య అసూయవల్ల కావచ్చు. నేను మనిషిని. అసూయపడతాను. నా సర్వస్వంగా చూసుకునే వస్తువు మీద ఇంకొకరి ప్రభావాన్ని సహించేటంతి హృదయం నాకు లేదు. ఇది సంకుచితత్వం కాని, మరేదన్నా కాని, నువ్వు నాదానివి కావాలి. ఇది నా ఆశ. దాన్ని తీరాన అను. ఏమన్నా అను.' ఆయాస పడ్డాడు మురారి.

లక్ష్మి జాలిగా సముదాయించింది.

'శ్రీపతి నన్ను చూస్తే సహించలేవు. సరే! నేనింకొకర్ని చూస్తేనో...?' ప్రశ్న వేసింది.

మురారి నివ్వెరపోయాడు. అనుమానంగా లక్ష్మి కళ్ళల్లోకి చూశాడు. చిన్నబుచ్చుకున్నాడు.

'అది నువ్వే చెప్పాలి. ఎంత త్వరగా చెప్తే అంత మంచిది' గొణుక్కుంటూ లేచి వెళ్ళిపోయాడు. లక్ష్మి సన్నగా నవ్వుకుంది. ఇది మురారి. అందుకే అతనంటే మమత. శ్రీపతి ఈ భావాలకు అతీతుడు. అతనెవాడూ అసూయపడలేడు. తను అతని కావ్య కన్యక. తన్నుంచిత వేళం పొందు కాదు భావన చేస్తాడు.

శ్రీపతిని చూసివద్దామని బయలుదేరింది లక్ష్మి. మేడమెట్లు ఎక్కుతుండగానే, స్త్రీ కంఠం కిలకిల నవ్వటం, దానికి మొగ కంఠం జతకల్పటం వినిపించింది. ఎందుకో తనగుండె కలుక్కుమంది.

'రా లక్ష్మీ! అక్కడే నిల్చున్నావేం?' శ్రీపతి ఆహ్వానించాడు.




యెంకి రాలేదాని యేటో సూత్తావుంటె
యెనకాలగావచ్చి 'యెవురుసో' రంటాది!

—చిత్రం : వీరికోటి అచ్యుతరావు]

# ★ గుండె గొంతుకలోన... ★

'ఈమె జానకి. కొత్త శిష్యురాలు' పరిచయం చేశాడు.

ఎర్రగా బాజాగా ఉన్న ముఖం. అందం కొట్టొచ్చినట్లు కనిపించే రెండు కళ్లు.

'నమస్కారం'

'నమస్తే'

'జ్వరం తగ్గిపోయిందా' తను పరామర్శ చేసింది.

'కన్పించటంలా. ఖులాసాగా మాట్లాడుతున్నాగా'

'మరయితే నేనింక వెళ్తాను'

'కాఫీ తాగి పోదువుగాని'

కాఫీ తాగి దిగవచ్చేసింది. మేడ మెట్లు దిగుతుంటే మళ్ళీ నవ్వులు విన్పిస్తున్నాయి. ఇంటికొచ్చి ఆలోచించటం మొదలెట్టింది. తనమనసు మూగవోయింది. జానకిని చూసి అసూయ పడింది. శ్రీపతి జానకిని ప్రేమిస్తున్నాడేమో! గుండె ఈర్ష్య నింపుకుంది.



తనకు ప్రియమైనవస్తువు లాక్కొని పోబడుతున్నట్లు తోచింది. బాధగుంది.

చిన్న మురారి శ్రీపతి నాతో మాట్లాడతాడని ఈర్ష్యపడ్డాడు. తను ఈరోజు జానకి శ్రీపతితో మాట్లాడుతుందని అసూయ చెందుతోంది. ఈర్ష్యపడటంద్వారా లేశమాత్రం కూడా పరాధీనం కావటం సహించలేమని స్పష్టమౌతోంది. ఈర్ష్యా సమన్వితమైన ప్రేమ సమగ్రమైనదా? తను శ్రీపతి విషయంలో అసూయ చెందింది. మురారి విషయంలో కాదు. అతని విషయంలో పరాధీనత ప్రసక్తి లేదు. తన విషయంలో మురారి ఈర్ష్య చెందిన కారణంకూడా అదే. అయితే శ్రీపతి వీటికి అతీతుడు. తనది ఈర్ష్యపడగల స్వభావం. మురారిదీ అంతే — మురారిని చేసికొంటే—మరి శ్రీపతి కావ్యవస్తువుగా జన్మసార్థక్యాన్ని తలపోసినతను — సందిగ్ధంలో పడింది. తల పగిలిపోతోంది.

అమర్నాడు శ్రీపతి నవ్వుతూ వచ్చాడు. ఏమీ జరగనట్లు హాయిగా మాట్లాడాడు. కొత్తగీతం వినిపించాడు. మనోలోకంలోకి చెయ్యిపట్టి లాక్కెళ్ళాడు. మహతీనిక్వణాలు పలికించాడు. హృదయనందనంలో ఎన్నో వందలపుష్పాలు పూయించాడు.

'ఈ శ్రీపతి నా చేతులార జారవిడుచుకోవటం' దిగులుగా చూసింది లక్ష్మి.

పెళ్ళిసంబంధాలవాళ్ళు వచ్చి చూస్తున్నారు. వెళ్తున్నారు. తను సమాధానం చెప్పదు. తను మురారికీ, శ్రీపతికీ మధ్య నలిగిపోతోంది. ఇందులోంచి బయటపడాలి. ఇద్దరూ తనవైపు చేతులు చాచారు. తను అందిస్తే రెండు చేతులూ అందివ్వాలి. తనకు నాలుగు చేతులు లేవు.

మురారిని కాదనలేను. శ్రీపతిని ఒదులుకోలేదు. తను ఇద్దరిపట్ల మౌనం వహించింది. గుండె రాపిడిపడి పోతోంది. చిక్కు శల్యమైపోతోంది. తను ఏ ఒకరి సర్వస్వంగా ఉండి ఇంకొకర్ని చూడలేను. ఒకేమార్గం — ఇద్దరికీ కాకుండా పోవటం. ఈ వైవిధ్యం మధ్య మథింపబడే తన హృదయానికి శాంతి లేదు. ఆ సుఖపడే గీతం ఉంటే తనలో ఇంతటి విలక్షణత్వం ఉండేది కాదు. ఒక నిర్ణయానికి రాగల మనస్థైర్యం కలిగేది. ఒకరి జీవిత భాగస్వామిగా ఇంకొకర్ని చూటంకంటె ఇద్దరికీ కాకుండా ఇలా ఉండటమే మేలు. తనలో ఇద్దరు నిక్షేపించుకున్న భావాలు అంతరానమైనా తను ఆ ఇదిలో నిల్పుకున్నవి శాశ్వతంగా ఉంటాయి. చెక్కుచెదరవు.

'అమరావతి సంబంధం ఖాయం చేస్తానమ్మా' నాన్న.

పెళ్లిప్రయత్నాలు సాగుతున్నాయి. తోరణాలు కట్టున్నారు.

'తన దౌర్బల్యం కారణంగా వాళ్ళ జీవితాలు పాడవకూడదు' మనసులో భగవంతుణ్ని ప్రార్థించింది.

శ్రీపతి వచ్చాడు. తను ముఖం ఎట్లా చూపిస్తుంది. కాని చూడాలి. కరుగా ఉండాలి. తను పరమత్వం మూలంగా శ్రీపతి తన్నుంచి వేరై సుఖపడాలి.

ముఖంలో నవ్వు తెచ్చిపెట్టుకుంది లక్ష్మి.

కాని శ్రీపతి నేల చూస్తున్నాడు. లక్ష్మి కాళ్ళకు తీర్చిన పారాణి చూస్తున్నాడు.

'రేపు శాంతి నికేతనం వెళ్తున్నాను'

'ఉపశాంతి కోసమా?'

తల పైకెత్తి తనలోకి చూశాడు. ఆ కళ్లు చూడలేకపోయింది. శ్రీపతి తన కళ్ళలో సముద్రాలు ఇంకింపచేసికొన్నాడు. లక్ష్మి కళ్ళు మూసుకుంది.

కళ్ళు తెరిచేసరికి శ్రీపతి వెళ్లిపోయాడు. తన మీద రాసిన కవిత్వం అంతా బల్లమీద ఉంది. వణుకుతున్న చేతుల్తో దాన్ని అందుకుని గుండెకు హత్తుకుంది. తన గుండె రెండుగా కోసి ఇద్దరికీ పంచింది. ఆ కోతలో పొందిన బాధ, ఆ బాధలో స్రవించిన కన్నీళ్లు తనకు మిగిలాయి.

తనకుతానుగా మురారిని చూటానికి ప్రయాణమైంది. మురారి దిగులుపడ్డాడు. లక్ష్మికి తెలుసు దిగులుపడతాడని. కాని పట్టులేదు. ఏదో దిగమింగుకుని లక్ష్మిని పలకరించాడు. వివాహపు కానుక ఏదో అందించాడు. లక్ష్మి మ్రాన్పడిపోయింది. చైతన్యం పోయింది. మురారిని చూడలేకపోయింది. అతడు కరుడుగట్టిన దుఃఖంలా సిద్ధిపొందిన విగ్రహంలా కన్పించాడు.

'మురారీ నామీద కోపమా?'

'లేదు' దిగులుగా నవ్వాడు.

'పెళ్లికి రావా?'

'నేను శ్రీపతిని కాదు. ఊరువిడిచి వెళ్ళిపోవటానికి'

'శ్రీపతి నేమీ అనకు మురారీ! నేను బాధపడతాను'

తప్పుచేసినవాడిలా చూశాడు మురారి.

'నాకు ఒక్క కోరిక తీరుస్తావా?' ఆశగా చూస్తూ అడిగింది లక్ష్మి.

'చెప్పు.'

'మురారీ నన్ను ముద్దుపెట్టుకో—!'

మురారి దిగ్భ్రాంతుడయ్యాడు. ఎంతో భావంతో చూశాడు. లేచిపోబోయ్యాడు. లక్ష్మి కాళ్ళకు చుట్టేసుకుంది.

'నా జీవితంలో మనసారా ముద్దుపెట్టుకోవటం ఇదే తొలిసారి. ఇంక జరగదు.' మురారిపాదాలు ఆప్యాయంగా ముద్దుపెట్టుకుంది. నేలతగిలింది. ★

# ★ జడ చెప్పిన సాక్ష్యం ★

(25-వ పేజీ తరువాయి)

పోతే నువ్వు యిప్పుడు ఏడుస్తున్నావేం ప్రకాశరావు' అంది.

ప్రకాశరావు పద్మవంక చూచాడు. ఆలస్యమైంది అంటూ తొందరగానే వెళ్లిపోయాడు.

స్కూలులో హెడ్మాస్టారు రాగానే ముందు యింపోజిషన్ తీసుకు రమ్మన్నారు. చూపించిన వాళ్ళు చూపించారు. రాయలేదన్న వాళ్ళని వందేసిసార్లు రాసి రేపు తీసుకురమ్మన్నారు. అలా తీసుకురాకపోతే రోజల్లా బెంచీమీద నుంచోవాలన్నారు. ఇంతలో రంగారావు వంతు వచ్చింది. 'రాశానుగానండి మా నాన్నగారికి పలక కావలసివచ్చి నేను చెబుతానులే మాస్టారితో అని చెరిపేశారండి' అన్నాడు.

'పోనీలే కూర్చో' అన్నారు మాస్టారు.

ఇంతలో స్కూలు బంట్రోతు వచ్చి రాత్రి యెవరో తోటలో గులాబీ పువ్వులన్నీ కోసుకు పోయారండి అని చెప్పాడు.

మనబళ్ళో పిల్లలపనే అయి ఉంటుంది. అందరు మాస్టర్లతో కనుక్కోమని చెప్పి అని అయిదోతరగతి పిల్లలవంక తిరిగి 'నిజం చెప్పండి. మీలో యెవరేనా కోశారా? నిజం చెప్పకోండి. ఎలాగూ తెలియక మానదు' అని గద్దిస్తున్నారు మాస్టారు.

ఇంతలో రంగారావు లేచి నుంచుని నిన్న సాయంత్రం నేను బజారుకు వెళ్ళి వస్తున్నానండి.

ఊఁ వస్తూంటే అన్నారు మాస్టారు.

'బ్రహ్మయ్య ఒడినిండా గులాబీపువ్వులు పోసుకుని తోటలోనుండి అమాంతంగా బయటికి గోడ దూకాడండి' అన్నాడు రంగారావు.

'నుంచో బ్రహ్మయ్యా' అన్నారు హెడ్మాస్టారు.

బ్రహ్మయ్య బిక్కు బిక్కు మంటూ నుంచుని 'నేనా' అన్నాడు రంగారావు వంక తిరిగి.

'నన్ను దబాయించకు. ఏం పనియిది. గులాబిపువ్వులు కోసుకు పోతున్నావా అని నేను నిన్ను అడగలే' అని రంగారావు బ్రహ్మయ్య ముఖంమీద ముఖంపెట్టి అడుగుతున్నాడు.

బ్రహ్మయ్య కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. మాట్లాడలేకపోతున్నాడు.

'నిజం చెప్పు బ్రహ్మయ్యా' అంటున్నారు హెడ్మాస్టారు బెత్తం ఊపుతూ.

'మాస్టారూ! బాబ్బాబు మాస్టారితో చెప్పకు అని నా కాళ్ళు పట్టుకున్నాడు. మాసారూ! ఇంకా నామాట అబద్ధమైతే వాతో కోటయ్యకూడా ఉన్నాడు. వాణ్ణి అడగండి' అని అన్నాడు రంగారావు.

ఆ! నేనా! అని కంగారు పడుతున్నాడు కోటయ్య.

రంగారావు కోటయ్యవంక తిరిగి కన్నుగీటి 'అవును అల్లా జడుస్తావేం. వాతో పాటు నువ్వుకూడా ఉన్నావుగా. అది కాదు మాస్టారూ. బయటికి వెళ్ళాక బ్రహ్మయ్య తంతాడేమో నని కోటయ్య జడుస్తున్నాడు మాస్టారూ' అన్నాడు రంగారావు.

'నిజం చెప్పు కోటయ్యా భయం లేదు' అన్నారు మాస్టారు.

తెల్లమొఖం వేస్తున్నాడు కోటయ్య. రంగారావు కోటయ్య వంక చూస్తూ కళ్ళు పెద్దవి చేసి పళ్ళు కొరుకుతున్నాడు.

కోటయ్య జడిశాడు. 'అవును మాసారూ! బ్రహ్మయ్య ఒడినిండా పువ్వులు పోసుకుని గోడ దూకాడండి' అన్నాడు జడుస్తూనే రంగారావు ముఖంవంక చూస్తూ.

హెడ్మాస్టారికి కోపంవచ్చింది. బ్రహ్మయ్యని చెయ్యిపటమని బెత్తంతో కొడుతూ 'గాడిద, స్కూలు తోటలో గోడదూకి పువ్వులు కోసుకుపోతావురా' అని ఒక్కవరసని బాదుతున్నారు. చెయ్యి పట్టకపోతే వీపుమీద కొడుతున్నారు.

బ్రహ్మయ్య నేనె మీ యెరగనండి మాస్టారూ! అని యేడ్చేస్తున్నాడు.

ప్రకాశరావుకు, బాధ, కోపం కలిసే వచ్చాయి. వెంటనే లేచాడు. క్లాసులోంచి బయటికివచ్చాడు. తిన్నగా మెంబరుగారింటికి వెళ్ళాడు. గుమ్మంలోనే కనిపించింది పద్మ.

పద్మా! నువ్వోకసారి నుంచున్నపళంగా స్కూలుకురావాలి అన్నాడు ప్రకాశరావు.

'ఎందుకూ?' అంది పద్మ.

ఎందుకేమిటి? మాస్టారికి పిచ్చకోపంవచ్చి మీ తమ్ముడు రంగారావుని పట్టుకొని చావగొడుతున్నారు.

'ఎందుకూ కొట్టడం?'

'ఇంపోజిషన్ రాసుకు రాలేదని'

'రాసుకు రాకపోతే కొట్టెయ్యడమే' అంటూ పద్మ పరుగెత్తుకుంటూ స్కూలుకు వచ్చింది. వెనకాలే ప్రకాశరావు వచ్చాడు. పద్మ వస్తూనే 'ఏమండి మాసారూ! మా తమ్ముడు యింపోజిషన్ రాయకపోతే కొట్టారట' అంది.

తెల్లబోయారు హెడ్ మాస్టారు.

అదేమిటమ్మా పద్మా! మీ తమ్ముణ్ణెందుకు కొడతానమ్మా అన్నారు.

పద్మ ప్రకాశరావువంక చూచింది.

ప్రకాశరావు 'పద్మా! ఒక్కసారి నీ జడ మాస్టారికి చూపిస్తావా?' అన్నాడు.

'ఎందుకూ?' అంది పద్మ.

'అహా! ఆ గులాబీ పువ్వులు యెక్కడివో నని'

'మా రంగారావు ఎక్కడో కొనుక్కొచ్చావని నాకిచ్చాడు' అంది.

'అదిలే కావలసింది. ఇంక నువ్వు వెళ్ళొచ్చు పద్మా' అన్నాడు ప్రకాశరావు.

'ఇప్పటికైనా తెలిసిందా మాస్టారూ! గులాబీ పువ్వులు యెవరు కోసింది' అన్నాడు ప్రకాశరావు.

ఎవ్వరూ మాట్లాడలేదు. అంతలో రంగారావు లేచాడు.

'వెధవ బడి నేనసలు చదువుకోనే చదువుకోను. అందరు కలిసి నన్ను దొంగకింద కడతారా! ఉండండి మా నాన్నతో చెప్పి మీ పని మీ మేష్టారి పని పట్టకపోతే అప్పుడడగండి. బడి వదిలిపెట్టే బయటికి రండి ఒక్కొక్కడిపని చెబుతాను' అంటూ తిట్టుకుంటూ వెళ్ళిపోతున్నాడు రంగారావు.

కాళ్ళు చేతులు వణుకుతున్నాయి హెడ్మాస్టారికి. కోపంగా ఒక్కసారి ప్రకాశరావువంక చూచి 'స్కూలు వదిలి నువ్వెందుకు బయటికి వెళ్లావు' అని కొట్టినంత పనిచేసి రంగారావు రంగారావు అంటూ వెనకాలే పరుగెడుతున్నారు కంగారుగా. అంతటితో హెడ్మాస్టరి గొంతు ఊడిపోయింది. గొల్లుమన్నారు పిల్లలంతా. కాని చీవంతి చిరునవ్వయినా ప్రకాశరావుముఖం మీదకు రాలేదు సరికదా బ్రహ్మయ్యని చూచేసరికి గుండె గుభేలుమంది. కళ్ళనీళ్ళు తిరిగాయి. ★

# ★ జీవనలీల ★

(20 వ పేజీ తరువాయి)

మతి మనస్సుకి కష్టం వేసింది. అయితే ఆ కష్టం ఇలాంటిదికాదు. కష్టం ఎందుకు? తానేమయినా కుముదుణ్ణి పూర్తిగా పోగొట్టుకుంటోందా? ఓ పదిహేనురోజులు, లేదా ఓ నెలాళ్ళు కుముదుడు కనిపించడు. ఈ భాగ్యానికింత కంగారు దేనికి? అయినా మతి మనస్సు కుదటపడటంలేదు. శశి-కుముద్ కూర్చుని మాటాడుకుంటున్నారు. జాలిగా కుముదుడికేసి చూసింది మతి. ఆమె గుండెలు గుబ గుబలాడి పోతున్నాయి.

"రా, మతీ: మనం వెళ్లి కుముదుణ్ణి రైలెక్కించివద్దాం. ఏం?" అన్నాడు శశి.

'వస్తాను, రాను' అని మతి ఏమీ అనలేదు. వెళ్ళబోయేముందు చీరకట్టుకుని, జోళ్లు తొడుక్కుని ప్రయాణమై కూర్చుంది. కళ్లనీళ్లతో దిగులుగా ఉన్న ఆమె ముఖంకేసి చూడసాగాడు శశి. అపూర్వమైన ఓ భావోద్వేగంతో అతడూ క్రిందుమీదు అవుతున్నాడు. ప్రపంచంలో ఇలాంటివాళ్ళు చాలామంది ఉండొచ్చు బహుశా. మతిలాగా ప్రేమించినవాళ్ళే అయివుండొచ్చు వారంతా కాని మతి ఈ ప్రేమించటం ఎక్కడ నేర్చుకుంది? ఇంత గాఢానుభూతి ఎలా అలవడిందామెకి?

వాళ్లు స్టేషన్‌కి వెళ్ళేసరికి అప్పటికింకా ఎండబాగా ఉంది. రైలు బయలుదేరటానికింకా చాలా వ్యవధి ఉంది. రైల్లో జనం అంత మరీ ఎక్కువగా లేరు. కాసేపు రైల్లో కుముదుడితో మాట్లాడుతూ కూర్చుని, శశి పరానుని కూడా రమ్మని ఇద్దరూ పెట్టెలోంచి దిగారు. "మీరు కూర్చోండి. మేము కాసేపు అలా తిరిగి వస్తాం" అన్నాడు శశి.

వాళ్ళు వెళ్ళిపోయాక మతి వెలవెలపోతున్న ముఖంతో— "మీరు వెళ్లొద్దు. నేను ఉండలేను. చచ్చిపోతాను" అన్నది కుముద్‌తో.

"స్టేషన్‌దాకా సాగనంపటానికి వస్తే మనసుకి అలాగే ఉంటుంది మతీ!" అన్నాడు కుముద్.

"ఉహూఁ నిన్నమంచీ ఇలాగే ఉంది."

"నిన్నమంచి ఉందా? నిన్న ఏమీ అనలేదేం ఈ సంగతి? ఉంటే ఉందిలే పోనీ. ఇదీ ఓ రకమైన ఆనందమే."

ఆనందమా? ఆమెకి ప్రపంచమంతా చీకటి క్రమ్ముకు వస్తోంది. అన్నీ తెలిసిన కుముద్ ఇది తెలుసుకోలేడా ఏమిటి? కుముద్ లోని కాఠిన్యాన్ని మతి ప్రేమించటం నేర్చుకుంది అయినా ఆమెకిది ఆఘాతమే అయిందివాళ. ప్రక్క లైనుమీద యాత్రికులతో నిండిన రైలు అప్పుడే బయలుదేరి వెళ్ళింది. మతి మనస్సు ఆ చక్రాలక్రింద నలిగి పోతున్నట్లుంది. ఇంక వ్యవధి లేదు, వేరు ఉపాయమూ లేదు. కుముద్ ఇహ వెనక్కి తిరిగివచ్చేమార్గం లేదు. ఈ రైలు కదిలి వెళ్లగానే తనకుండే ప్రక్క లేపోతుంది. అయినా తానీ ప్రయాణాన్ని ఆపు చేయలేకపోయింది. ఇప్పుడు తన మనసులోని వ్యాకులపాటునంతా అతడికి వ్యక్తపరచటం ఎలా? ప్రయాణమై రైల్లో కూర్చున్నవాళ్ళెవరైనా వెనక్కి తిరిగి వస్తారా?

కుముదుడి కాళ్లు రెండూ పట్టుకుని ఏడుదామన్నా వీల్లేదు. రైల్లో జనమంతా గుడ్లప్పగించి తనకేసే చూస్తారు.

కుముద్ ఎప్పటిలాగానే నిబ్బరంతో అవీ యివీ మాట్లాడుతున్నాడు. మతికి గొంతు పట్టుకుపోతోంది దుఃఖంతో. అయినా ఎలాగో అతడికి సమాధానం ఇస్తూనే ఉంది. నిమిషాలు దొర్లిపోతున్నాయి. రైలు ఇహ రవంత సేపట్లో బయలుదేరుతుందనగా, శశి-పరాన్ తిరిగివచ్చారు. మతి ఏ దుర్ముహూర్తంలో వాళ్ళని కలకత్తా రమ్మని రాసిందో!

"రా, మతి ఇహ మనం దిగుదాం" అన్నాడు శశి.

"మీరు దిగండి. నేనొక్కమాట మాట్లాడి వస్తాను" అన్నది మతి.

అస్వాభావికమైన మతిలోని ఈ నిర్లజ్జకి శశి పరాన్ నిర్విణ్ణులయినారు. శశి కొంచెం కోపంతోనే దిగాడు రైల్లోంచి. ఎంత ప్రేమిస్తే మాత్రం ఇంత ఉందో లేదో ఈమెకప్పుడే అంత ఇదా?

కుముద్ చిరునవ్వునవ్వి, "పక్కా గృహిణిలా చేశావే మతీ! చెప్పు ఆ మాట ఏమిటో!" అన్నాడు.

"చెపుతా ఉండండి, వస్తున్నా."

అంటూ కుముదుణ్ణి కూడా తెల్లబోయేట్లు చేస్తూ 'లావేటరీ'కి వెళ్ళింది మతి. రైలుగంట కొట్టారు. గార్డు పచ్చజెండా ఎత్తాడు. ప్లాట్‌ఫాం మీద శశి పరాన్ కంగారు పడిపోతున్నారు. అయినా మతి పెట్టెలోంచి ఇవతలికి రాలేదు. రైలు కదిలి వెళుతూంటే దాని వెంటే నడిచివస్తూ "మేము కూడా ఎక్కమా ఏం కుముద్? ప్రక్క స్టేషన్‌లో నయినా దింపి తీసుకువెళతాం మతిని" అన్నాడు శశి.

"వద్దు. అంత అవసరంలేదులే! నేనే ఏదో ఏర్పాటు చేస్తాను శశీ!" అన్నాడు కుముద్.

రైలు ప్లాట్‌ఫాం దాటిపోయాక మతి బయటికివచ్చింది. "ఇకేమిటి? చివరికి దిగలేకపోయానే నేను!" అన్నది మతి.

"ఇంకెలా దిగుతావ్?"

"అయితే ఏమిటిహ చెయ్యటం?"

"ఏమీ చెయ్యక్కర్లేదులే, కూర్చో. ఇలా మాయపుచ్చటం దేనికో! వస్తావని సూటిగా చెపితే పోయేదిగా"

"వాళ్ళంతా ఉన్నారుగా! గొడవ చేస్తారని..." అన్నది మతి. పెట్టెలో జనం అంతా వారికేసే కుతూహలంగా చూడసాగారు. వాళ్ళిద్దరికీ మాత్రం ఆ ధ్యాస లేనే లేదు. రైలు వేగం హెచ్చిన కొద్దీ మతి ముఖంలోని విన్నదనం మాయంకాసాగింది. ఆమె వడి వడిగా కొన్ని విషయాలు నిట్టూర్చింది.

"వెంటవస్తున్నావ్ సరే, కాని ఎక్కడ ఉండటమో, ఏమి చెయ్యటమో అదేమయినా ఆలోచించావా?" అని అడిగాడు కుముద్.

కుముద్‌లాగానే బేఫర్వాగా "దాన్ని గురించి దిగులెందుకు? అన్నది.

గృహవిముఖుడు-దేశద్రిమ్మరి అయిన భర్తతోపాటు మతి మన పల్లెటూరి పిల్ల అయిన మతి-కూడా ఆ స్వతంత్ర జీవితాన్నే వరించింది. బహుశా ఏనాటికయినా ఆ ప్రేమ పక్షులు ఓ గూటికి చేరుకోవచ్చు. బహుశా వారికి కలగబోయే సంతానం కోసమయినా ఓ గూడు అవేది కుదుర్చుకోవటం తప్పనిసరి కావచ్చు. మామూలు జీవిత మర్యాదలూ, నీతి-నియమాలు వారికి విడిచిపెట్టడానికి వీలు కాకపోవచ్చు- ఆ సంగతులన్నీ ఇప్పుడేం చెప్పటానికి లేదు. వారికథ ప్రస్తుతానికి ఇక్కడితోనే సరి...

[ఇంకా ఉంది.]



# వనితాలోకం

## కుటుంబ నియంత్రణంలో—

# 'పెద్ద'వాళ్లూ, ప్రతిబంధకాలూ

జనాభా తగ్గాలంటూ ప్రభుత్వం వారు నెత్తిన నోరుపెట్టుకుని ఎంత మొత్తుకున్నా—మన ఆడవారికి మాత్రం చెవుల కెక్కడంలేదు. కారణం మన యిళ్లలో వున్న ఆడపెద్దలు—అది అన్యాయం అంటారు, లేదా శిశుహత్య అంటారు.

ఓ అత్తింటి కోడలు ఆరుగుర్ని కన్నతరువాత ఏడవకాన్పు కాస్త కష్టం కావడంవల్ల ఆసుపత్రికి వెళ్ళిందంటే అక్కడున్న డాక్టర్లు "ఏమ్మా ఆరుగురు పిల్లలున్నారంటున్నావు. యీసారైనా చిన్న ఆపరేషన్ చేయించుకోమ్మా! దానివల్ల నీ ఆరోగ్యం బాగుంటుంది, మీ భర్తకూ ఎంతో సుఖంగా వుంటుంది. పైగా దేశానికికూడా మేలుచేసిన దానవౌతావు" అంటే ఆమె ఒప్పుకోవటానికిష్టపడినా ఆమె అత్తగారు మాత్రం ఒప్పుకోనంటుంది. ఎంత మాత్రం వీలు లేదంటుంది. అలా ఒప్పుకోదలచుకున్న కోడలికి నయానో, భయానో కూడదని నచ్చచెబుతుంది. ఒక్కో అమ్మకు తొమ్మిది—పదుగురు పిల్లలున్నా, యింకా కావాలనే ఆశమాత్రం దూరంకాకుండా చూస్తారు. యిలా అతిగా పిల్లలు పుడుతుంటే దేశానికీ, తమ భర్తలకూ ఎంత భారమో కొంచెంకూడా ఆలోచించుకోనీయరు.

ఏదో కాస్త చదువుకున్నామె ఓ యిద్దరు పిల్లలైనతర్వాత, ఆ పిల్లల క్షేమం భర్త ఆర్థికపరిస్థితిని గురించి, తన ఆరోగ్యము కొరకు యిక ముందు పిల్లలు కలుగకుండా ఏదో మందు తినటం లేక ఆపరేషన్ లాంటిది చేయించుకుంటానంటే యింట్లో వున్న ముసలివారు ఎంత మాత్రం ఒప్పుకోరు. ఒక వేళ పెద్దలులేని సంసారమైతే భర్త అడ్డువస్తాడు వీరందరనూ ఎదిరించి ఆమె గర్భ నిరోధం చేయించుకున్నదే అనుకోండి. అప్పుడు ఆమెను ఎంతోమంది ఎన్నో విధాలుగా ఆడి పోసుకుంటారు. ఆమె పది మంది కలిసే చోటుకు వెళ్ళిందంటే అందరి చూపులు ఆమెమీదే. అందరూ ఆమెను వేలెత్తి చూపుతుంటారు. ముసలివాళ్ళు ఆమెను ఒక వింత జంతువులా చూస్తారు. ఆమెతో తమ తమ కోడళ్లను మాట్లాడ

బి. ఇందిరారాజ్ (ఒంగోలు)

నివ్వరు—సరిగదా ఆమె దగ్గరకెళ్ళి "ఏమమ్మాయీ! అలా చేయించుకున్నావు అలా చేయటంవల్ల ఎంత పాపం తెలుసా! శిశుహత్యా పాపానికి ఒడిగట్టావు గదటే" అంటారు తాము వెళ్ళి ఆ మహాపాపాన్ని చూచివచ్చినట్టు. ఆయిల్లాలు "యేదో లేపిన్ని తనిమంది పిల్లలెందుకు. లేరనకుండా రత్నాల్లా యిద్దరు చాలరూ!" అనేసరికి "ఏమో నమ్మా— అంతా మాయదారికాలం. ఆడదానికి చదువు లెక్కువయిం తర్వాత మరీ చిత్రంగా మారిపోయింది లోకం. భగవంతుడు ఫలం యిచ్చేటప్పుడు ఎంత మంది పిల్లలయితే మాత్రం తప్పేముంది. లేరన్న వారికిస్తాడా? వద్దన్న వారికి మానాడా? అంతా ఆయన లీల. అయినా నేనో మాటడిగితే నీవేమీ కోపగించుకోకమ్మాయ్! నీలా చదువుకున్న వాళ్లంతా ఒకరిద్దరు పిల్లలు పుట్టగానే డాక్టర్ల దగ్గరకు పరుగెత్తి యికపిల్లలువద్దంటే ఒక వేళ ఆ యిద్దరూ చనిపోతేనో?" అని అర్థంలేని ప్రశ్నలువేసి ఎదటివారి హృదయాల్ని గాయపరుస్తారు—యీ ముసలి అత్తగార్లు. వారి ఉద్దేశంలో ఎంత ఎక్కువ మంది పిల్లలుంటే అంతమంచిది ఎందుకంటే కొందరు చనిపోయినా కొందరు మిగులుతారని కాబోలు.

కోడలు కాపురానికొచ్చిన రెండుమూడేళ్లలోపల పిల్లలు పుట్టకపోతే యిక ఆ అమాయకుల్ని సాధించటానికి మొదలు పెడతారు. "దీనికింకేమి పిల్లలే లేతరనీ—" ఆ యెదిటింటి ప్రమీల నీతో సరిగానే కాపురానికొచ్చి అప్పుడే యిద్దరు పిల్లల తల్లయిందనీ— "నీవేమో గొడ్డుపోయిన చింత మొద్దువ"నీ అంటూ ఏదేదో దీవనలిస్తారు. అప్పుడు ఆ అమ్మాయి హృదయం ఎంతబాధ పడుతుందో ఆలోచించరు. తాము కూడా ఒకప్పుడు ఒక అత్తింటికోడలే కదా అన్న సంగతి మరుస్తారు. ఆ అమ్మాయి కూడా నా కడుపున పుట్టిన బిడ్డలాంటిదే కదా అనుకోరు. తమ బిడ్డలకు పిల్లలు లేకపోతే అంతా దాని ఖర్మ అని సమర్థించి వూరుకుంటారు. కోడళ్ళకు మాత్రం కర్మ అడ్డురాదు. కోడలికి సంతానంకలిగితే నొచ్చుకొని, కూతుళ్ళకైతే సంతోషించేవారు కూడా వుంటారు. ఎక్కువమంది పిల్లలుపుడుతుంటే "దానికేం! పందికన్నట్టు సంవత్సరానికొకటి వొప్పుక కంటూ వుంటుంద"నే అత్తగారు కూడా లేకపోలేదు. యీ రోజుల్లో కూడా యిలాంటి అత్తగారుంటారా! అని ఎంత మాత్రం అనుమానపడకండి కావలసినంత మంది వున్నారు.

# ★ పెద్దవాళ్ళూ, ప్రతిబంధకాలూ ★

నాకు తెలిసిన ఓ అత్తగారు కోడలికి సంతానం కలుగలేదని కొడుకుతో రెండో వివాహం చేసుకోమని చెవిని యిల్లు కట్టుకుని పోరింది. ఆ కొడుకు తల్లిమాటలను చెవి నేసుకోకుండా 15 సంవత్సరాలు గడిపాడు. పాపం ఆ కోడలికిమాత్రం సంతతి కలుగలేదు. ఇక ఆతల్లి ఎంతమాత్రము ఆగలేదు. "ఇప్పటికైనా నా మాట వినరా! దాని కిక పిల్లలు పుట్టరు. అది గొడ్డుది. నీ పేరూ, వంశం పేరూ నిలవటానికి ఓ మొలక లేకపోతే యేం లాభం— నీ వేమైనా ముసలివాడవైపోయావా? మహా వుంటే నలభై సంవత్సరాలుంటాయి— త్వరగా ఇంకో పెళ్ళి చేసుకోరా!" అంటూ బలవంతం చేయసాగింది. నూరగా నూరగా రాయిలాంటిది నమసిపోతుంది. ఇక మనసు మారటంలో ఆశ్చర్యమేమిలేదు. తల్లి యిష్టప్రకారం ఆ నలభై యేళ్ళ పెళ్ళికొడుకు— బంధువులకు గాని, స్నేహితులకు గాని ఎవ్వరికీ తెలియకుండా ఓ బీదయింటి అమ్మాయిని చూచి దూరంగా ఏదో దేవస్థానానికి వెళ్ళి చేసుకుని వచ్చాడు. ఆ కొత్త పెళ్లికూతురు పెళ్ళయిన ఒక సంవత్సరానికి రజస్వల అయింది. ఎంత బాగుంది చూడండి జంట. పాపమూ అత్తగారి ఆశలు ఆ అమ్మాయివల్ల కూడా ఫలించలేదు. ఆడబిడ్డల ఎత్తిపొడుపుల వల్ల అత్తగారి సాధింపులవల్ల ఆ అమ్మాయి దినదినానికి కృశించి శల్యమైపోతూ వుంది. రెండో కోడలికికూడా సంతతి కాలేదని— కొడుకు యాభైయేళ్ళ వాడైనా ఇంకో పెళ్లి కూడా చేయుటకు సిద్ధంగావుంది ఆ తల్లి.

ఈ పెద్దలదృష్టిలో స్త్రీ కేవలం పిల్లల్ని కనే యంత్రం. స్త్రీకి పిల్లలు కలుగకపోతే మోక్షం లేదంటారు.

అనాదినుండీ వస్తున్న యీ అత్తగార్ల ఆర్భాటం యెప్పటి కంతమౌతుందో! యిలాంటి ఆశయాలుగల అత్తగార్ల ఆర్భాటంనుండి— దినదినానికి దరిద్రదేవత కబళించి వేయాలని చూస్తున్న మనదేశం ఎప్పుడు బాగుపడుతుందో!

మనది స్వతంత్రదేశం. కేవలం పురుషులకే కాక మన స్త్రీలకుకూడ కొన్ని బాధ్యతలున్నవని మరువకూడదు. దేశ పురోగమనానికి మనం కూడ సాధ్యమైనంత వరకు తోడ్పడాలి. నేడు మనదేశంలో విపరీతంగా జనాభా పెరిగిపోతున్నది. జనాభాకు తగినంత ఆహారోత్పత్తి చేయలేక పోతున్నాం. ఎంతోమంది తమ పిల్లలకు ఆహారం సమకూర్చలేక పిల్లలను ఆకలి చావులకు గురిచేస్తున్నారు. యిటు పిల్లలూ అటు పెద్దలు కూడా యిబ్బందులకు లోనౌతున్నారు. ముఖ్యంగా మధ్యతరగతి కుటుంబాల వాళ్ళు పిల్లలను పోషించుటకు ఎన్నో తంటాలు పడటం మనం రోజూ మన చుట్టుపట్ల చూస్తూనే వున్నాము. కాబట్టి నాటి సోదరీమణులకు నా విజ్ఞప్తి యేమనగా సాధ్యమైనంతవరకు మనం "కుటుంబ నియంత్రణ" అవలంబించడం చాలా మంచిది. దీనివల్ల మన ఆరోగ్యం బాగుపడుతుంది—భర్తలకు యిబ్బంది తగ్గుతుంది. అన్నిటికంటే ఎక్కువ సంఘానికి—దేశానికీ ఎంతో సేవ చేసినవారమౌతాము.

సోదరీమణులకు యింకో చిన్న సలహా:

యీ మధ్య సంతానం వలదనుకునేవారు—భర్తలు ఆపరేషన్ చేయించుకుంటున్నారు. మొగవారు అలా చేయించుకోటంవల్ల ఒక్కొక్కసారి మనం తీరని ప్రమాదానికి గురికావలసి వస్తుంది. ఉదాహరణకు నేను విన్న ఓచిన్న సంఘటన చెప్తాను. నా స్నేహితురాలొకావిడకు నలుగురు పిల్లలున్నారు. యిక పిల్లలు చాలనీ—ఆపరేషన్ చేయించుకోవాలనుకుంది. ఆ సంగతి భర్తతో కూడా చెప్పింది. సరే చూద్దామన్నాడు. యీలోగా అతనితో తన స్నేహితులెవరో ఆడవాళ్ళకు ఆపరేషను చేయించటానికంటే—మొగవాళ్ళే ఆపరేషన్ చేయించుకోవటం సులభం అన్నారట. అది విని అతడు ఎవ్వరికీ తెలియకుండా ఆసుపత్రికెళ్లి ఆపరేషన్ చేయించుకున్నాడు. ఆ తరువాత అతడి తల్లికీ విషయం తెలిసి చాలా చివాట్లు పెట్టింది. ఆయన ఆపరేషన్ చేయించుకున్న సంవత్సరానికి అతని భార్య మళ్ళీ గర్భవతి అయింది. నిష్కళంకయైన ఆమెపై అత్తగారు లేనిపోని అభూతకల్పనలన్నీ కల్పించింది. ఎంతో ప్రేమించే ఆమె భర్త అనరానిమాటలని ఇష్టం వచ్చినట్లు ఆమెను కొట్టి నీవు పతితవని ఎప్పటికీ నా ఇంటిగడప త్రొక్కవద్దని పుట్టింటికి పంపేశాడు. ఆమె తలితండ్రులు ఆమె గుణం తెలిసినవారు గాబట్టి ఓ డాక్టరుదగ్గరకెళ్ళి సంగతంతా విన్నవించుకున్నారు. అప్పుడు డాక్టరు అన్నారట మొగవారికి ఆపరేషన్ చేస్తే ఒక్కొక్కసారి ఆపరేషన్ విఫలమౌతుందనీ, మళ్ళీ పిల్లలు పుట్టవచ్చునని. కాని ఆమె అత్తగారూ, భర్తగారు ఆమాటలు నమ్మలేదు.

ఇలాంటి అనర్థాలు రాకుండా ఆ ఆపరేషన్ ఏదో ఆడవాళ్ళే చేయించుకోటం మంచిదంటాను. ★

# ★ వంటలు ★

## కాలీఫ్లవర్ తో...

కాలీఫవరు చాలా తొందరగా వుడుకుతుంది. కాలీఫవరు, కేబేజి, టొమాటో, ఈ కూరగాయలు దొరికినన్నాళ్ళు మనకు చెపాతిలోనికి కూర వెతుక్కోన అవుసరము లేదు. కాలీఫవరు మనము కొనుక్కొనేటప్పుడు తెల్లగా ఉన్నది, వజ్జది, కాస్త శుభ్రముగా వుండేటటు చూసి కొనుక్కోవాలి. ఒక కేసినీలో నీళుపోసి పురుగులు అవిలేకుండ శుభ్రముగా కడిగి ముక్కలు చేసుకోవాలి. మరీ చిన్నముక్కలు చేయకూడదు. కూర ఎనిసిపోయి ముద్దఅయి పోతుంది.

### కాలీఫ్లవర్ కొబ్బరితో

కొబ్బరి తురుము కొని వుంచుకోవాలి. గిన్నెలో నేయి మరిగినతరువాత, మిరపకాయలు, ఆవాలు, మినపప్పు, ఇంగువ, జీలకర్ర, కొదిగా శెనగపప్పు, పోపువేసి కాస్త వేగినతరువాత కరివేపాకు, పచ్చిమిరప ముక్కలువేసి వేగు వాసనరాగానే, కాలీఫవరు, కొబ్బరివేసి నీరుచల్ల మూతపెటాలి. ఇవి రెండు వుడికినతరువాత తగినంత ఉప్పు వేసి కలియపెట్టి క్రిందకు దించవలెను.

### కాలీఫ్లవర్ పచ్చిబటాణి

కాలీఫవరు, పచ్చిబటాణి గింజలు, టొమాటో, బంగాళాదుంప, దేనికది శుభ్రపరుచుకోవాలి. గిన్నెలో నేయి మరిగిన తరువాత, ఆవాలు మిరపకాయలు, మినపప్పు, పోపువేసి కాస్త వేగినతరువాత వులి పచ్చిమిరపముక్కలు వేసి వేగు వాసనరాగానే ఈ కూరలు వేసి నీళ్లుపోసి మూతపెటాలి. ఇవి అన్నీ కలసి మెత్తగా వుడికినతరువాత, రెండు టీస్పూనులు మసాలా, కొత్తిమీర, చిన్న అలంముక్క, తగినంత ఉప్పు, వేసి రెండు నిముషములు పోయినతరువాత, కొద్దిగా శెనగపిండి నీళ్లలోకలిపి వేసుకొంటే కూర బాగావుంటుంది. పదినిమిషములు పోయిన తరువాత క్రిందకు దించుకోవాలి.

### కాలీఫ్లవర్ కారెట్ కూర.

కాలీఫవరు, కేరెట్లు, దేనికది శుభ్రపరుచుకొని వుంచుకోవాలి. పొయ్యిమీద గిన్నెలో నేయి, మినపప్పు, మిరపకాయలు ఆవాలు, శెనగపప్పు, జీలకర్ర, పోపు వేసి, కాస వేగినతరువాత, పచ్చిమిరప ముక్కలు వేసి కమ్మనివాసన వచ్చినతరువాత కారెట్లు వేసి నీళ్లుపొయ్యాలి. కాస్తవుడికిన తరువాత కాలీఫవరు కాస కొత్తిమీర వెయ్యాలి. ఇవి రెండు మెత్తగా వుడికినతరువాత ఉప్పువేసి క్రిందకు దించుకోవాలి. ఇదేవిధముగా కాలీఫవరు బీట్‌రూటుకూడ చేసుకోవచ్చును. కాలీఫవరుకూడా ఇదేవిధముగా చేసుకోవచ్చును. మా ఇంట్లో ఇంకా అనేకరకాలుగా చేస్తువుంటాము. కాలీఫవరు అంత సులువుగా వుడికే కూర మరొకటి లేదేమో అనిపిస్తుంది.

### బోండా

పైనచెప్పినకూర చెపాతీలోనికి బాగుంటుంది. ఈ కూరతో మనము సోమాసీ, బోండా, కూడ చేసుకోవచ్చును. అరసేరు శవటాకు శెనగపిండి తీసుకొని నిమ్మకాయ అంత వెన్న, చిటికెడు ఉప్పు, నీరుపోసి బజ్జీలపిండికంటే కాస్త చిక్కగా కలియపెట్టి, వండివుంచుకున్నకూర నిమ్మకాయ అంత వుండలు చేసుకొని, ఈ పిండిలో ముంచి డాల్డాలోకానీ నూనెలోకాని వేసుకుంటే బాగుంటాయి.

### సోమాసీ

సోమాసీలకు ఆస్ట్రేలియా గోధుమపిండే బాగుంటుంది. సవాసేరు గోధుమపిండి జల్లించుకొని కొద్దిగా ఉప్పు, నేయి, తీసి నీళ్ళలో చెపాతిపిండి మాదిరిగా కలియపెట్టాలి. పిండి రెండుగంటలు నానిన తరువాత, అప్పడాలకర్ర, పీట, తీసుకొని పూరీల మాదిరిగావత్తి, చేసివుంచుకొన్న కూర పెదనిమ్మకాయఅంత వుండలుచేసి పూరీలో పెట్టి త్రిభుజాకారముగ మడుచుకొని సింగడా కట్ చేసిన చక్రంతో కట్ చేసి, డాల్డాలో కాని నూనెలో కాని వేపుకోవాలి. ఇవి రెండూ మధ్యాహ్నపూట వేడివేడిగా తింటే చాలా బాగుంటవి. తీపి కావలసినవారు కూరకు బదులుగా కొబ్బరికోరు పంచదార పాకంచేసి ఇదే విధంగా చేసుకోవచ్చును.

### పకోడి

కాలీఫవరు, వులిపాయలు, పచ్చిమిరపకాయలు, దేనికది శుభ్రపరుచుకొని చిన్న ముక్కలు తరుక్కోవాలి. మనకు కావలసినంత శెనగపిండి జల్లించుకొని పకోడీల పిండిమాదిరిగా సోడా, ఉప్పు, కారము, నీళ్ళు వేసి కలియపెట్టాలి. నూనెలో కానీ డాల్డాలో కానీ పకోడీలకు మల్లే చేతిలో వతుతున్నట్లు వేయాలి. ఎర్రగా వేగాక తీసుకొని తింటే కరకరలాడుతు చాలా రుచిగా వుంటాయి. కావలసినవాళ్లు రెండు వెల్లుల్లిపలుకులు, కొద్దిగా జీలకర్ర. మెత్తగా



తలగడ గలేబులమీదికి డిజైనులు

—పి. జయలక్ష్మి, కడప]



నూరి ఈ పిండిలో వేసి కలుపుకొంటే మరీ బాగుంటవి.

### కాలీఫ్లవర్ తో పప్పు

పెసరపప్పు రాయిలేకుండా బాగుచేసి, తగినన్ని నీళ్ళుపోసి పొయ్యిమీదపెట్టాలి. ఒక పొంగురానిచ్చి కాలీఫవరు వేయాలి. ఇవి రెండూ మెత్తపడినతరువాత, నూనె, ఆవాలు, మిరపకాయలు, మినప్పప్పు, జీలకర్ర, ఇంగువ, పోపుచేసి వుడుకుచున్న పప్పులో వేసి, ఉప్పు వేసి కలియపెటి మూత పెటి రెండు నిముషములుపోయిన తరువాత క్రిందకు దించాలి. కావలసినవాళ్ళు కరివేపాకు, పచ్చిమిరపకాయలు కూడ పోపులో తీసుకొనవచ్చును.

### కూటు

కాలీఫవరు, టొమాటో, బంగాళదుంప, ఇవి చెనికది శుభ్రముగా తరిగి కడుగుకొని వుంచుకోవాలి. శెనగపప్పు కొస్త నీళ్లలో నానవేసుకోవాలి, వేరొకగిన్నెలో కొద్దిగా నీళ్ళుపోసి మిరియాలు, ధనియాలు, కొబ్బరి, ఇంగువ, జీలకర్ర నానపెట్టి మెత్తగా రుబ్బుకోవాలి. ఒక గిన్నెలో ఈ కూరగాయలు శెనగపప్పు నూరివుంచుకున్న ముద్దకొస్త కరివేపాకువేసి నీరుపోసి పొయ్యిమీద పెటాలి. ఇవి అన్నీ మెతగా వుడికిన తరువాత, తగినంత ఉప్పు, పసుపు వేసి కలియపెట్టి, నూనె, మిరపకాయలు, ఆవాలు, మినప్పు, ఇంగువ, జీలకర్ర పోపుచేసి, కొస్త కాగినతరువాత పచ్చిమిరప ముక్కలువేసి, వుడుకుచున్న కూరలో ఈపోపువేసి మూత పెట్టి క్రిందకు దించుకోవాలి

న్యాయపతి అమ్మాజీ (ఏలూరు)

* * *

## గెనుసుగడ్డలతో కొన్ని వంటలు

ఇవి గెణుసుగడ్డలు విరివిగా దొరికే రోజులు. పిల్లలున్న ప్రతి యింట్లో ఇవి ఎక్కువగా వాడుతుంటారు; పిలలు ఇవి తింటానికి యెక్కువగా యిష్టపడతారు; పచ్చివే తినేస్తుంటారు కూడ కొందరు. వీటిల్లో రెండు రకాల గడ్డలుంటాయి—(1) తెలగడ్డలు (2) ఎఱ్ఱగడ్డలు. ఎర్రవి ఎక్కువ తీపిగా వుంటాయి వీటినే కొన్ని ప్రాంతాల్లో "చిలకడదుంపలు" అంటారు. ఈ చిలగడ దుంపలతో కొన్ని రకాల వంటలు చేయటం చెప్తున్నాను.

### పచ్చి పచ్చడి

కావలసిన సామానులు: రెండు పెద్దసైజు గెణుసుగడ్డలు, పదిహేను ఎండు మిరపకాయలు, చిన్న నిమ్మకాయంత చింతపండు, మూడు టేబిల్ స్పూన్స్ వుప్పు, రెండు చిటికెల పసుపు, తగినంత పోపుసామాను.

చేయువిధము: గెణుసుగడ్డలు బాగా కడిగి పైచెక్కు తీసేయాలి. తర్వాత ఎండు కొబ్బరి తురుము పీటమీద ఈ రెండు గడ్డలను పొడుగ్గా చీలికలొచ్చేలా సన్నగా తురవాలి. చింతపండును ఓ సెయిన్ లెస్ స్టీల్ గిన్నెలో కొంచం నీళ్లు వేసి నానబెటాలి. ఇప్పుడు మిరపకాయలు, బాండీలో కొంచం నూనె వేసి వేయించి, రోట్లో వేసి మెత్తగా దంచి తడిపిన చింతపండు, తురుము, పసుపు వుప్పు కూడ వేసి, బాగా కలిసేలా నూరి, గిన్నెలోకి తీసుకోవాలి. ఓ గరిటలో కొంచం నూనె వేస, ఆవాలు, జీలకర్ర, మినపప్పు, రెండు ఎండు మిరపకాయలు తుంచివేసి, చిటపటలాడనిచ్చి, పచ్చడిలో వేసి బాగా కలిపేయాలి.

### వేపుడు పచ్చడి

పైవిధంగానే గెణుసుగడ్డలు బాగా కడిగి పైపిచ్చు తీసి తురమాలి. తర్వాత బాండీలో నాలుగు టేబిల్ స్పూన్సునూనె వేసి, తురుమును దోరగా వేయించాలి — పదినిమిషాలపాటు. మిరపకాయలుకూడ కొంచం నూనే వేసి వేయించి, రోట్లో వేసి మెత్తగాదంచి, వేయించిన తురుము, చిన్న నిమ్మకాయంత చింతపండు, తగినంత వుప్పు, పసుపు వేసి, బాగా కలిసేలా నూరి, గిన్నెలోకితీసి పైవిధంగా నే పోపుపెటాలి. ఇది తడిచేయి తగలకుండా వాడుకుంటె రెండురోజులదాకా చెడిపోదు.

### పులుసు పచ్చడి

నాలుగు పెదసైజు గడ్డలుతీసుకొని పైవిధంగానే కడిగి తురుముకోవాలి. బాణట్లో కొంచం నూనె వేసి శెనగపప్పు, మినప్పప్పు, ఆవాలు వేసి నాలుగు నిమిషాలపాటు వేయించి, తర్వాత తురుముకూడ అందులో నే వేసి పదినిమిషాలపాటు దోరగా వేయించాలి. ఇప్పుడు చిన్న నారింజకాయ సైజులో చింతపండు తీసుకొని నీళ్ళుపోసి గుజ్జుగాపిసికి, ఈనెలు, గింజలు, పిప్పితీసి పారేసి, గుజ్జును బాండీలోని తురుములో పోసి, అప్పుడే ఓ చిటికెడు పసుపు, నాలుగు టేబిల్ స్పూన్స్ కారం, తగినంత వుప్పు వేసి మూతపెట్టి పదిహేనునిమిషాలపాటు తెర్ని విచ్చిదించి వేరే సీలుగిన్నెలోకిగాని, జాడీలోకిగాని తీసుకోవాలి. దీనికి తిరగమూత పెట్ట పనిలేదు. తురుములోనే తిపివుంటుంది కనుక బెల్లము వేయుకరలే. ఇదికూడ తడిచెయ్యి తగలకుండా వాడుకుంటె రెండురోజుల దాకా కమ్మగావుంటుంది — అన్నంలోకి ఆధరువుగా. తీపి ఎక్కువతినేవారు కొంచం బెల్లం వేసుకోవచ్చు.

### పప్పు (నిమ్మరసంతో)

కావలసిన సామానులు: రెండు పెదసైజు గెణుసుగడ్డలు, పావుసేరు కందిపప్పు, తగినంతవుప్పు పసుపు, రెండు నిమ్మకాయలు, పోపుసామాను, కరివేపాకు, నాలుగు టేబిల్ స్పూన్స్ నెయ్యి.

చేయువిధము: గడ్డలు పైపెచ్చు తీసి తురుముకోవాలి. మామూలుగా కందిపప్పును వుడుకపెటాలి. పప్పు కొంచం మెత్తబడంగానే తురుమును గూడ పప్పులో వేసి కలిపి పది నిమిషాలపాటు వుడకనీయాలి. ఇప్పుడు తురుము పప్పులో బాగా కలిసిపోయి మెత్తగా వెన్నలాగ అవుతుంది. ఇప్పుడే తగినంత వుప్పు, ఓ చిటికెడు పసుపు వేసి, రెండు నిమిషాలపాటు కంపటిమీదనే వుంచి కిందికిదించి వేరే స్టీలు గిన్నెలోకితీసిపెట్టుకోవాలి. బాండీలో కొంచం నెయ్యి వేసి శెనగపప్పు, మినప్పప్పు,

అవాలు, కరేపాకు బాగా వేగనిచ్చి పప్పులోకి తుమ్మరించేసి, నిమ్మకాయలరసం పిండి, గరిటతో కలిపి మూతపెట్టాలి. (నిమ్మకాయ పిండిన తరవాత కుంపటిపై పెట్టకూడదు) ఇది బాగా ఘుమఘుమలాడుతూ, పులిహోరవాసనవస్తూ, తింటుంటే కమ్మగా వుంటుంది. అయినా ఓసారి చేసిచూడండి. మీకే తెలుస్తుంది దీని! రుచి అరె! మరచాను! ఓమాట—దీనికి నూనిపోపుమాత్రం వేయకండేం! అలా వేస్తే నిమ్మరసం చేదెక్కిపోయి నోట్లో పెట్టటానికే వల్లకాదు. కనుక తప్పకుండా నేతిపోపే వేయాలి.

* * *

## తియ్యపప్పు

పైవిసంగా నేగడ్డలు చెక్కుతీసి తురుము కోవాలి. పావుశేరు కందిపప్పు మామూలుగా వుడకబెట్టాలి. పప్పుసగం మెత్తబడగానే, తురుము పప్పులో వేసి, అప్పుడే చిటికెడు పసుపు, తగినంత వుప్పు వేసి, పదిహేను నిమిషాలపాటు వుడకనిచ్చి, గరిటతో మెత్తగా ఎలిపి కిందికిదించాలి. ఇది తియ్యగా చాల బాగుంటుంది. ముఖ్యంగా కారం, పులుపు తినలేని పిల్లలకు, వుట్టి కందిపప్పు అంటే ఎక్కువ యిష్టపడే పిల్లలకు, ఇదోసారిచేసిపెట్టి రుచి చూపిస్తే, గిన్నెలో పప్పంతా గాలి అయ్యేంతవరకు వదలరంటే నమ్మండి!

* * *

## పులుసుపప్పు

రెండు గెణుసుగడ్డలు చెక్కుతీసి సన్నగా ముక్కలు తరగాలి. పావుశేరు కందిపప్పులో తగినన్ని నీళ్ళుపోసి వుడక పెట్టాలి. పప్పు కొంచం మెత్తబడంగానే ముక్కలు గూడ పప్పులో వేసి, గరిటతో కలిపి, మూతపెట్టి, పది నిమిషాలపాటు వుడకనివ్వాలి. ఈ పది నిమిషాల్లో ముక్కలు బాగా మెత్తబడుతాయ్. ఇప్పుడు చిన్న నిమ్మకాయంత చింతపండు నీళ్ళలో గుజ్జుగా పిసికి పప్పులో వేసి, దానికి తగినంత కారం, వుప్పు, పసుపు వేసి, పది నిమిషాలపాటు కుంపటిమీద వుంచి, కిందికిదించి, మామూలుగా పోపు పెట్టాలి.

జి. లీలావతి, వేటపాలెం.



# వనితా వాణి



దేశకాల పరిస్థితుల బట్టి మనుష్యుల మనస్సులు మారుతుండాలి. అంతేగాని నేటి కాలపు మనిషి 16 వ శతాబ్దపు బూజు భావాల పాతచొక్కా వేసుకుని చక్కాపోతుంటే, సినిమాబండి కూడా పిల్లలు పడ్డట్టు మనం కూడా పడతాము. ఆనాడు వ్యాధులకి సరియైన మందులే లేవు. ఈనాడు రోగనివారణకు మందులే కాకుండా ముందుగా రాకుండా ఉండేందుకు కూడా మందులు కనిపెట్టారు.

కుటుంబ నియంత్రణకు కూడా అనేక నివారణోపాయాలున్నాయి. ఆపరేషన్ కూడా అవసరంలేని ఔషధాలున్నాయి.

నాటికి నేటికి అన్ని విధాల దేశంమారింది. మారిపోతున్న దేశం మధ్యన నిలబడి 'అయ్యో బాబోయ్ మా పూర్వుల ఆచార విధానాలు అడుగంటిపోతున్నాయి' అని కేకలువెయ్యటం అవహేళనకు గురి అవుతుందే తప్ప ఎవరు వీరల్ని గద్దెపై కూర్చోబెట్టి పూలమాలలు వెయ్యరు.

జీవులు పెరుగుతున్న కొలది సమస్యలు ఉత్పన్న మవుతాయి. ముఖ్యంగా ఆర్థిక స్థిరత్వం ఉండదు. సాంఘిక వాతావరణంలో వడగాల్పు వీస్తాయి. జీవన ప్రమాణం నానాటికి పడిపోతుంది. ఇక నిరుద్యోగ సమస్య దారికిరాదు. 'మతాచార్యులు' 'తాతా' చార్యులు యీ విషయంలో ఆచార్యత్వం వహించి గట్టిగా లాకుల్లా అడుకున్నా తెగించి తెంపుకుని తరలిపోయినవాడే విశ్వమానవకళ్యాణానికి నాంది పలుకుతుంది. బి. విశాల.

* * *

ఎమ్. హేమలతగారు వ్రాసిన "ఒక్కగా నొక్క పిల్ల" అన్న వ్యాసమును చదివాను. ఆడపిల్లల పెంపకమునుగురించి రచయిత్రి గారు తమ వ్యాసములో చక్కగా వ్రాశారు. ఇప్పటి కాలపరిస్థితులను బట్టి ముఖ్యముగా గారాబంగా పెరిగే పిల్లలను అదుపాజ్ఞలలో పెట్టి మంచి నడవడికి తీసుకురావడం చాలా అవసరం.

విద్యార్థినుల బాధలు అన్న వ్యాసము, దానిపై చర్చ చదివాను. కేవలము విద్యార్థులపై ఇటువంటి అభాండాలు వేయుటము ఎంతమాత్రము తగదని సోదరీమణులకు మనవి చేయుచున్నాను.

జి. ఎన్. రామకృష్ణరావు.

* * *

లోయిన సుశీలగారు వ్రాసిన "ఆ! ఆమాత్రం రాయడానికేం," అనే వ్యాసం చాల బాగున్నది. సుశీలగారు ముచ్చటగా మూడు అంచెలలో చెప్పదలచిన విషయము చక్కగా వ్రాశారు. అందులకు వారికి మా అభివందనములు తెలుపుచున్నాము.

సరళాదేవి, రామకృష్ణమ్మ, (నంద్యాల)

* * *

"ఆ, ఆమాత్రం రాయడానికేం" అను వ్యాసం బాగుంది. విజ్ఞానానికి కొలతబద్దలు డిగ్రీలు లేవని ఇప్పటికైనా గ్రహిస్తారని ఆశిస్తున్నాను. రచయిత్రి సుశీలగారికి వందనాలు.

గవ్వా కన్నారావు, కాకినాడ.

* * *

శీర్షాసనం గురించి సి. రాధగారు వ్రాసిన వ్యాసం చదివితిని. చాలా బాగుంది. యింకా యిటువంటి మంచి మంచి వ్యాసములు వనితాలోకం ద్వారా అందచేస్తారని ఆశిస్తూ రాధగార్కి అభినందనలు తెల్పుచున్నాను.

సంక్రాంతి సంచిక చదివితిని, భానుమతీ రామకృష్ణల వ్యాసం చాలా బాగుంది వారికి నా ధన్యవాదములు.

వి. క్రిష్ణవేణి, (కాకినాడ)

* * *

విద్యార్థులకూ సంఘాలున్నవి. చర్చా వేదికలున్నవి. కాని వాటిలో యిటువంటి విషయాల ప్రసక్తేరాదు. రాజకీయాలే చర్చింపబడతాయి. అనేక సాంఘిక సమస్యలు యువతీయువకుల పురోభివృద్ధికి ఆటంకాలుగా ఉన్న కాలంలో వాటివైపే దృష్టి పోను. అన్యాయాలను అక్రమాలను యువకులు ప్రతిఘటిస్తారని ప్రతీతి. ఆదర్శంకోసం కష్టాలకు ఎదురీదుతారని త్యాగానికికూడా వెనుదీయరని వినికిడి. ఇంతటివారు అబలలైన అక్కచెల్లెళ్ళను అవమానించి బాధించటం తగునా?

యువతుల సహకారాన్ని పొందటానికి విద్యార్థినాయకులు కృషిచేయాలి. వారి సహకారంతో యువకులు నవసమాజ నిర్మాణానికి ముందడుగు వేయాలి. ఇకముందు మంచిరోజులు చూద్దాము.

యం. ఎస్. మూర్తి.

* * *

వనితాలోకం శీర్షికలో గత రెండు మూడు వారాలుగా విద్యార్థులు విద్యార్థినులు రాస్తూఉన్న లేఖలు చూసే దేశమంతా స్పుత్నిక్ వేగంతో పురోగమిస్తున్న ప్రస్తుత కాలంలో తెలుగు చెల్లాయిలు మట్టుక్కు ఇంకా ముందంజ వేస్తున్నట్టు కన్పించదు. వారి లేఖలు కొన్నిచూస్తే, కాలేజీకి వెళ్లేటప్పుడు గోడలని రాసుకుంటూ నడుస్తూ, కాలేజీలో తాము సృష్టించుకున్న కామన్ రూము అనే చిన్న ప్రపంచంలో తలదాచుకుంటూ పాఠ్యకాలంలో మట్టుక్కు ఏదో తామరాకుమీద నీటిబిందువులా తమ తరగతుల్లో కాలం గడుపుతున్నట్లు కనిపిస్తున్నాది. పొరుగునున్న మద్రాసు కేరళ రాష్ట్రాల్లో మహిళలు సామర్థ్యంతో పోలీసు, మిలిటరీ, ఇంజనీరింగు వగైరా శాఖలల్లో బాధ్యతగల స్థానాలు నిర్వహిస్తూఉన్న ఈ కాలంలో తెలుగు చెల్లాయిలు ఎవరో నవ్వారని, మరెవరో మారుపేరు పెట్టి పిలిచారని వాపోవడం అబలల ఆక్రందనలాగుంది కాని ఆధునిక మహిళల సబలత్వానికేమాత్ర నిదర్శనము గాలేదు.

ఎవరైనా విద్యార్థి తమని హేళన చేసి నవ్వుతు, తమలో తాము పరిహాసాలు చేసి కొనినట్లు భావించి, తగిన జవాబు ఎందుకు ఇవ్వరు? అట్లా చేసినప్పుడే తమలో నిగూఢంగా అణిగిఉన్న సామాజిక ప్రకృతి వికసిస్తుంది. తాము అందమైనవారమని, తమ మీదే తోటివిద్యార్థుల దృష్టి ఉందని, తమని గురించే ఇతర విద్యార్థులు చర్చిస్తున్నారనే భ్రమ విస్మరించి, తెలుగు విద్యార్థినులు భావి పౌరులుగా, సాంఘిక వైజ్ఞానిక రంగాల్లో తాము నిర్వర్తించవలసిన గురుతర బాధ్యతలకు అవసరమయిన విద్యాశిక్షణలను పొందితే తామూ, తద్వారా తెలుగుదేశం పురోగమించడం జరుగుతుంది.

వి. ఎస్. చంద్ర (మద్రాసు).

* * *

(విద్యార్థినుల అవస్థలు అనే విషయంపై చర్చ ఇంతటితో ముగించడమైనది.)





# దాసోహం



ఇవ్వేళ పొద్దుటనుండే నామీద "ధాం ధూం" అంటున్నాడు. ఒకమనిషి ఇద్దరిపని ఎలా చెయ్యగలడు?

కాని ఎదిరించేశక్తి నాలో లేదు.

ఆయన మామూలుగానే నామీద స్వారీకి వస్తున్నట్టు బంట్రోతు రామన్న మీదకూడా తన అధికారం చెలాయించాడు. అంతటితో ఊరుకోక వాణ్ణి నానా బూతులూ తిట్టి పోశాడు. వాడికి ఒళ్ళుమండింది.

"ఏమయ్యోయ్! నీ ఇష్టం వచ్చినట్లు తిడితే పడడానికి ప్రసాదరావుగార్ని కాదు. ఒళ్ళు దగ్గిరపెట్టుకు మాట్లాడు—ఎదవ ఉద్యోగం నీ నెత్తిన కొట్టుకో—నీసొంత డబ్బులోంచితీసి జీతం ఇస్తున్నట్లు నానా తిట్లూ తిడితే పడడానికి ఉన్నాననుకున్నావేంటి? నా పనేదో నేను చేస్తాను—నీ ఇష్టం వచ్చినట్లల్లా అంటే పడేరోజులు పోయాయి! నాకీఉద్యోగంతో లెక్కేటి? కూరలు అమ్ముకు బ్రతుకుతాను కూలిపని చేసుకుంటాను" అని దులిపేశాడు.

నిర్విణ్ణుడైపోయేడు హెడ్ గుమాస్తా.

ఏం మాట్లాడగలడూ?

నేనైతే ఈ ఉద్యోగంపోతే మరోపనికి అసమర్థుణ్ణి కనక ఆయనేమన్నా పడి అక్కడే వేలాడుతున్నాను—ఆత్మగౌరవం ఏనాడో పోగొట్టుకున్నాను. ఆయన తిట్లకి గావుకేకలకి అలవాటు పడిపోయేను. "కానన్స్ సెన్స్" చంపుకున్నాను.

సుందరం నిర్లక్ష్యంగా తిరగడంలేదా అంటావు నువ్వు. సుందరం యుగంధరుడు. సుందరంకూడా ఒకప్పుడు నాకంటే ఎక్కువగా బాధపడ్డవాడే. అయితే ఆయన రహస్యం సుందరంచేతిలో ఉంది. అందుకనే సుందరాన్ని ఆయనేమీ అనలేడు. ఆ రహస్యమేనా ఆయన పుచ్చుకున్న లంచం బాపతు పుట్టుపూర్వోత్తరాలు కూపీలాగేడు. సుందరం అంటే అప్పటినుండీ ఓ ప్రక్కలో బల్లెమే!

ఇంతకీ మనం అనుకోవలసిందేమిటంటే మధ్యతరగతివాడి జీవితం నేలవిడిచి సామే! గోచీకి ఎక్కువ, గోణానికి తక్కువ జీవితాలు మనవి!.

మొగుడు కొట్టినందుక్కాదు కాని తోటికోడలు దెప్పినందుకు ఏడిచిందట అలాగా ఆయన తిట్లకి మనం అలవాటుపడ్డాం బంట్రోతుగాడు ఎంత తేలిగ్గా తీసిపారేశాడో కదా అని తల్చుకుంటే సిగ్గుతో క్రుంగిపోవలసివస్తోంది.

ఇవ్వేళ ప్రొద్దున్నే వాడు నౌకరీమానేసి గర్వంగా ఆయనకేసి చూస్తూ వెళ్ళిపోయాడు. ఇవ్వేళ సాయంత్రం అప్పుడే కూరలు అమ్ముతూ నాకెదురయ్యాడు.

"ఏం బాబయ్యా! ఇంకా మీరా రావణాసురుడి రాజ్యంలో ఎన్నాళ్ళు బాధలు పడాలో!..." అని పలకరించి వెళ్ళాడు.

"మాకావా వరేక్ష్కి ఎంత తేడావుందో వాడికీ మనకీ. ఆత్మగౌరవం కాపాడుకోవడానికి హెడ్ గుమాస్తాని గడ్డిపరకలా తీసి పారేసి నవ్వులపాలు చేశాడు. మనం దున్నపోతుమీదవర్షం కురిసినట్టుగా తిట్లు పడుతున్నాం. అందుకనే అవసరాలకి మనిషి తలవంచినప్పుడే మనం దాసోహం అనవలసి వస్తుంది. లేకపోతే మనం ఎవ్వర్నీ లెక్కచెయ్యనక్కర్లేదు.

"సినిమాకి తీసికెళ్ళడానికి పెందరాళే రాలేదని నీకు కోపం-పని చెయ్యకుండా వస్తే ఆయనకి ఆగ్రహం.

"పరిస్థితి తెలుసుకున్న వాళ్ళకి తప్ప నా విషయం అర్థంకాదు." అని కుర్చీలోంచి లేచాడు.

"మిమ్మల్ని అర్థం చేసుకోలేకపోయేనండీ క్షమించండి!".

"క్షమించడానికేం ఉంది నా అసమర్థతకి బాధపడుతున్నాను. కూలి చేసుకోవడం ఇంతకంటే నయంకదా! అని"

"రండి ముందర భోజనం చేద్దాం... వేపుడు చల్లారిపోతుంది!" అని అతన్ని వంటింట్లోకి నడిపించుకు వెళ్ళింది—.

"దాసోహం!" అంటూ ఆమె భుజం మీద చెయ్యివేసి కూడా నడిచివెళ్ళాడు. ★

# ★ పత్రికకు జోహార్లు ★

(13 వ పేజీ తరువాయి)

రాజకీయములకు ప్రాముఖ్య మిచ్చిరి.

తదనంతరమున ఉప్పు సత్యాగ్రహము, రాష్ట్రీయ స్వపరిపాలనము, కాంగ్రెసు నాయకుల మొదటి మంత్రివర్గ నిర్మాణము, రెండవ ప్రపంచ యుద్ధము, క్విట్ ఇండియా ఉద్యమము, జరిగినవి. సైమన్ కమిషనుకంటె మరికొన్ని అడుగులు ముందిడిన పెథిక్ లారెన్సు, ఎ. వి. అలెగ్జాండర్, సర్ స్టాఫర్డ్ క్రిప్సు మన దేశమునకు వేంచేసిరి. భారతాశయములు గగనకుసుమములై విలపిల్లినవి! కలకత్తాలో ఘోరహత్యలు జరిగినవి. 1946 మరువరాని భీషణవత్సరమైనది. బీహారులో కల్లోలము పుట్టినది. 1947 ఆగస్టు 15 తేదీనాడు భారతీయులు ఆశసిద్ధినందిరి. 1950 జనవరి 26 తేదీనాడు అది సమగ్రసిద్ధిని పడసినది.

పిదప విశాలాంధ్రము లేక ఆంధ్రప్రదేశ్ మనకు లభించినది.

ఈ రెండు లక్ష్యములకై దేశోద్ధారకులు విశేష కృషి సలిపిరి. తమ కృషిఫలితమును చూడక వారు సమించుట దురదృష్టము. శారీరకముగ వారు సమించినను, వారి అమృతాత్మ ఈ కృషిఫలితమునెరిగి ఆనందించుచునే యున్నది. వారి దృక్పథమూ, వారి ఆదర్శములూ, ఆంధ్రపత్రిక యందు సంపాదకీయ వ్యాసములందునూ, తదితర వ్యాసములందునూ వ్యక్తమగుచునే యున్నవి. వ్యక్తుల (వారు మహనీయులే యైనను) ఆయుర్దాయమునకు అవధియున్నది. అవధి లేనిదె సంస్థ పెరుగవచ్చును. శ్రీ పంతులుగారు కనిన పత్రికా పుత్రిక ఈ యేబది వత్సరములలో అద్భుతమైన సారస్వతాభివృద్ధిని గాంచినది. కొంత సాంఘిక సంస్కారమును గూడా గాంచినది.

దేశోద్ధారకులు ఆరాధ్యులు; సనాతన ధర్మము ననుసరించి, వైదికాచారము ననుసరించి జీవితమును గడపువారు. సమన్వయదృష్టి గలవారగుటచేత అక్కరైన సంస్కరణల నవలంబించువారు. శారదా శాసనము తలనూపకమున్నే దానికి తమ గృహమున దారిదీసిరి. మహాత్మునితో బాటు హరిజన సముద్ధరణమునకై నడుము గట్టిరి. వీరి యాశయములను "ఆంధ్రపత్రిక" దశదిశలందు ప్రకటించినది.

వీరేశలింగం పంతులుగారు, రఘుపతి వేంకటరత్నము నాయుడుగారు మున్నగు సంఘ సంస్కర్తల యూహలు వ్యాస ప్రబోధ విధానమున గాని, సారస్వతరూపములో గాని పత్రికయందు ప్రకటింపబడుచుండెను.

ఆంధ్రవిజ్ఞాన సర్వస్వముతో, "భారతి" పత్రికతో దేశోద్ధారకులు చేసిన సారస్వతసేవ అద్భుతమైనది. నవ్యసాహిత్యోద్యమమునకును, వారును ప్రస్తుత "ఆంధ్రపత్రిక" సంపాదకులు "భారతి" సంపాదకులు, శ్రీ శంభుప్రసాద్ గారును విశేషమైన ప్రోత్సాహమును చేకూర్చిరి. గిడుగు, గురజాడల మహోద్యమములు "ఆంధ్రపత్రికా" సేవ వలన విశేష శక్తి నందినవి.

సర్వతోముఖ జాతీయాభివృద్ధికిని, మానవాభ్యుదయమునకును తోడ్పడుచు భారతదేశమందలి ప్రధాన పత్రికలలో ఒక్కటయై, నేడది స్వర్ణోత్సవమును జరుపుకొనుట ముదావహము. గాడిచర్ల, పండితారాధ్యులవారును, తదితర విద్వాంసులును ఈ పత్రికాభివృద్ధికై పాటుపడిరి. వీరిలో నాడును నేడును కృషి సలుపువారు కలరు. పెక్కు స్వర్ణోత్సవములను, వజ్రోత్సవములను ఈ పత్రికారాజము వీక్షించుగాక. ★

# ★ రాజధాని కబుర్లు ★

(4 వ పేజీ తరువాయి)

యోగ్యమో పరిశీలించవలసిందే, సహకార పద్ధతిని ఉప్పు, బెల్లం కొనవచ్చు; ట్రాక్టర్లు, బుల్‌డోజర్లు అమ్మవచ్చు. కాని రచయితలు వ్యక్తులు. వ్యక్తులు కనుక రచయితల సహకార సంస్థలు రాణించక పోవచ్చు.

ఇది సమితిని నిరుత్సాహ పరచడానికి వ్రాయడం కాదు. కథకం ఆదరణయోగ్యమని సమితి రుజువు చేయగలదని ఆశిస్తున్నాను. అధికంగా రుజువైతే రచయితలు కొత్తబాటలు వేసుకోగలుగుతారు.

నవ్యసాహితీ సమితి ఎనిమిదవ ప్రచురణ: 'నవ్యసాహితి'ని గత ఆదివారం శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి ఆవిష్కరించారు. దాదాపు 280 పుటలుగల ఈ పుస్తకంలో 42 కవుల రచనలున్నాయి. శివశంకరస్వామి, నోరి నరసింహశాస్త్రి ప్రభృతుల రచనలవద్ద ప్రారంభించి, కుందుర్తి, కాళోజీ ప్రభృతుల రచనల వరకు ఉన్నాయి.

## 'స్టేజివిలనులు': (4) సెట్టింగులు

నాటక ప్రదర్శనయొక్క ఉద్దేశ్యం నటనద్వారా రచయిత సందేశం ప్రేక్షకులకు చేరాలని. నటనను మరుగుపరిచే సెట్టింగులు రచయిత సందేశాన్ని కూడా మరుగు పరుస్తాయి.

నాటకం చూస్తున్న ప్రేక్షకుడు తాను నాటకం చూస్తున్నానన్న విషయం మరచిపోవాలి. నాటకకర్త ఇవ్వదలిచిన సందేశం అవ్యక్తంగా స్వీకరించాలి. బ్రహ్మాండమైన సెట్టింగులు నిర్మించడం వల, ప్రేక్షకుల దృష్టిని అవి విపరీతంగా ఆహ్వానించడం, నాటకం యొక్క ప్రధానోద్దేశ్యాన్ని నాశనం చేయడం జరుగుతుంది.

బ్రహ్మాండంగా సెట్టింగులు రూపొందించడం నటుడిపై ఆధారపడ్డం మానేసి వడ్రంగిపైన, కమ్మరి పైన ఆధారపడానికి దారితీస్తుంది. అప్పుడు దాన్ని 'నాటకం' అనడంకంటె 'వడ్రంగాటకం' అనడం మేలేమో!

దీనికితోడు సెట్టింగులు నాటక రచనా విధానానికి అనువుగా లేకపోతే రసాభాసకి దారితీస్తుంది. ఆంధ్రనాటక కళా పరిషత్తులో బహుమతి నొందిన ఒక నాటకంలో దొడ్డిగుమ్మానికి డోర్ కర్టెన్స్ కట్టారు. న్యాయ నిర్ణేతలను మెప్పించడం కోసం, అవసరం ఉన్నా లేకున్నా బాల్కనీలు, స్టెయిర్ కేసులు కట్టడం మనం ఎరుగందికాదు.

సెట్టింగు నిర్మిస్తే, అది నాటక రచనా విధానానికి అనువుగా ఉండాలి. గత సంవత్సరం వేన్ యూనివర్శిటీ బృందం తెల్లటి గోడమీద ప్రసరించిన కాంతులతో ఒక రైలు కంపార్టు మెంటు వాతావరణం సృష్టించారు. మరి ఒక ఔత్సాహిక నాటక ప్రదర్శనంలో ఒక నటుడు కుర్చీ ముందుకు జరుపుకుంటే, వెనక ఉన్న గోడకూడా ముందుకు వంగి సానుభూతి తెలిపింది.

ఇది 'స్టేజి విలన్ నంబర్ ఫోర్': సెట్టింగులు ఉదంతం. ఈ దుర్మార్గుడిని సాధ్యమైనంతవరకు దూరంగా ఉంచండి. అవసరమైనంతవరకు పరిమితంగా వాడండి. ★



# సినిమా

## తగవు తగవా?

గత వారం, బొంబాయినుండి ప్రసిద్ధ చలన చిత్ర కారులు, దేశవ్యాప్తంగా పేరుగడించు కున్నవారలు, పదిమంది చెన్నపట్నం వచ్చారు. 'విజయా'ధిపతి బి. నాగిరెడ్డి, ప్రముఖ తమిళ నటుడు ఎం. జి. రామచంద్రన్, నిర్మాత ఎ. ఎల్. శ్రీనివాసన్, సారథీ సారథి రామకృష్ణప్రసాద్, భరణీ దర్శక నిర్మాత రామకృష్ణరావు, పి. పుల్లయ్య, సుందర్‌లాల్ నహాతా, పి. సి. సుబ్బరాజు, కెంపరాజ్, బి. ముత్తుకుమరప్ప రెడియార్ మొదలగువారు 15 మంది దక్షిణ భారత ఫిలిం పరిశ్రమ తరఫున ఆతిథ్య సంఘంగా ఏర్పడి బొంబాయినుండి వచ్చిన పెద్దల గౌరవార్థం శోభాయమానంగా అలంకరించబడిన విజయ గార్డెన్స్‌లో విందు చేశారు. పలువురు నటీనటులూ, దర్శకులూ, నిర్మాతలూ, టెక్నీషియన్‌లూ వచ్చారు. సభావేదిక అఖిల భారత ఫిలిం పారిశ్రామికుల సదస్సుగా భాసించింది. అతిథులు— మహబూబ్ ఖాన్, చందులాల్ షా, శశిధర్ (ఫిల్మాలయ) ముఖర్జీ, హోమివాడియా, ఆర్. హెచ్. వాడియా, బి. ఆర్. చోప్రా, ఎ. జె. పటేల్, డిప్ ఖోసా, మోహన్ సెగల్, జి. పి. సిప్పీలను నాగిరెడ్డి సభికులకు పరిచయం చేసి పూలమాలలు వేశారు. దక్షిణభారత నటీనటుల సంఘం తరఫున, ఆ సంఘం అధ్యక్షుడు ఎం. జి. రామచంద్రన్ స్వాగతం చెప్పి పూలమాలలు వేశారు.

నాగిరెడ్డిగారు ప్రసంగిస్తూ, ముడి ఫిలిం కోటాపై కోతపడి అది పెద్ద సమస్యగా పరిశ్రమపై విరుచుకపడిన ఈ సమయంలో ఫిలిం పరిశ్రమలో యావన్మందీ ఐకమత్యంతో నిలచి సమస్యను ఎదుర్కొనవలసిఉండగా, అభిప్రాయ భేదాలవంటి ఉపసమస్యలు ఉత్పన్నం కావడం జరిగిందనీ ఈనాటికి అవి అదృష్టవశాత్తూ దేశవ్యాప్తంగా సర్దుకు సమసిపోవడం ముదావహమనీ అన్నారు. ఈ విషయంలో దర్శకనిర్మాత మెహబూబ్ ఖాన్ చేసిన కృషి, ఆయన నిర్వహించిన పాత్ర సుతిపాత్రమైనవనీ, నిరుపేదగా, చిన్నవాడుగా పరిశ్రమలో ప్రవేశించి దానితో పాటే పెరిగి, దానికి సేవ



విక్రమ్ ప్రొడక్షన్స్‌వారి 'రాజామలయసింహ'లో రాజనాల, రంజన్‌ల ద్వంద్వయుద్ధం.



డీలక్స్ ఫిలింస్ వారి 'అప్నా హాత్ జగన్నాథ్'లో నాయికపాత్ర ధరిస్తున్న కొత్తనటి సయీదాఖాన్.

చేస్తూ పైకివచ్చిన ఈ వ్యక్తి పరిశ్రమలో సభ్యులకు గౌరవనీయుడనీ నాగిరెడ్డి అన్నారు.

చందులాల్ షా, అతిథులతరఫున సన్మానానికి కృతజ్ఞత తెలుపుతూ నాగిరెడ్డికి పూలమాల వేశారు. మహబూబ్ ప్రసంగిస్తూ ఫిలిం పరిశ్రమ తీవ్రమైన ముడిఫిలింసమస్యను ఎదుర్కొంటూన్న ఈ వేళ మరోవంక అభిప్రాయభేదాలతో పరిశ్రమలోవారు తగవులకు దిగడం తగవుకాదని అన్నారు. అన్నిటికన్న సఖ్యం ముఖ్యంగా ఎంచి వ్యవహరించడం అవసరమన్నారు.

(మద్రాసులో ఫిలింవాణిజ్యమండలి కార్యవర్గంలో ముడిఫిలిం సంఘానికి ప్రాతినిధ్యాల విషయమై అభిప్రాయభేదాలు ఏర్పడడం విదితమే. గత వారం, ఛేంబర్ అధ్యక్షుడు టి. ఆర్. సుందరం, మరి నలుగురు సభ్యులు—ఎ. వి. మెయ్యప్పన్, ఎస్. ఎస్. వాసన్, ఎస్. ఎం. శ్రీరాములు నాయుడు, కె. ఎస్. నారాయణన్ అయ్యంగార్ లు తమ సభ్యత్వాలకు రాజీనామాలు దాఖలు చేశారు.)

సభ అనంతరం కేరళ కళామండలంవారు 'కల్యాణ సౌగంధికం'. అనే కథాకళి నృత్యనాటికను ప్రదర్శించారు. భీముడు ద్రౌపది ముచ్చటమాని ముచ్చటపడి స్వర్గంనుండి సౌగంధిక పుష్పాన్ని తేవడం, దారిలో తన అగ్రజుడు—తన కన్నవయసులో ఒక్కయుగం పెద్దవాడు అయిన సామీరిని చూసి, తెలియక గేలిక చేసి, బరువుమాని పరువు తీసుకుని కాళ్ళమీదపడడం ఆపైన పావని విశ్వరూపాన్ని దర్శించి పావనుడై, ఆయన ఆశీర్వాదాన్ని అనుగ్రహాన్ని సంపాదించుకుని స్వస్థలానికి తరలిపోవడం ఇందులో రెండం కొలలో చూపించారు. హనుమంతుడి పాత్రను కళామండలి రామన్‌కుట్టినాయర్, భీమభూమికను వాజెంకడ కుంజునాయర్, పాంచాలిపాత్రను వాసు ధరించారు. కథను నంబీశన్, నెడుంగాడి గానంచేశారు. మద్దెల అప్పుకుట్టిపొదువాళ్, చెండావాద్యం (డోలు) ఆచుణి పొదువాళ్ వాయించారు.

సభ ఆరంభంలో అంతా రెండు నిముషాలు మౌనంగా నిలబడి కీ. శే. సిసిల్ బి. డిమిల్ కు శ్రద్ధాంజలి ఘటించారు.



# కొత్తనటులు

కొత్త నటీనటులను పరిచయంచేసి పైకితీసుకు రావడానికి దక్షిణాదినకన్న బొంబాయిలో నిర్మాతలు కొంచెం ఎక్కువ మొగ్గు చూపుతారు. స్టార్ వాల్యూని—మూడవ శ్రేణి పాత్రధారికి లక్షరూపాయలదాకా పెంచేపరిస్థితులూ అక్కడే ఉన్నాయి. అవి భరించలేక కొత్తవారిని తెచ్చేవీ అక్కడ ఉన్నాయి. ఫిలింస్తాన్ వంటి కంపెనీలు సదా కొత్తనటులకోసం కొస్తా కూస్తో వేట ఆడిస్తునే ఉంటాయి.

తెలుగు పరిశ్రమకి సంబంధించినంతవరకూ ఇటీవల కొన్నాళ్ళుగా కొత్తవారిని తీసుకువచ్చే ప్రయత్నాలు చెప్పుకోతగినంతగా జరుగుతునే ఉన్నాయి. ఏణ్ణర్థం రెండేళ్ళ క్రితం దర్శక నిర్మాత ఎల్. వి. ప్రసాద్ గారి డిస్కవరీ రమణమూర్తిని తిలక్ ఎం. ఎల్. ఎ. ద్వారా పరిచయం చేశారు. తరువాత అతడు 'మంచి మనసుకు మంచిరోజులు' 'అత్తా ఒకింటి కోడలే' 'మాంగల్యబలం' చిత్రాలలో నటించి మంచి పేరు తెచ్చుకు నిలబడ్డాడు. ఇప్పుడు సారథి వారు, గీతా పిక్చర్స్‌వారు హరనాథరాజా అనే ఒక యువకనటుడిని, చందమామా ఫిలింస్ వారు సత్యనారాయణ అనే నటుడిని పరిచయం చేస్తున్నారు. పొన్నలూరివారు జయశ్రీ అనే నటిని తమ కొత్త చిత్రంలో నాయికగా పరిచయం చేస్తున్నారు.

తమిళనాడులో ఇటీవల తారాపథాని అందుకొన్న ఇద్దరు ముఖ్యులు ఎస్. ఎస్. రాజేంద్రన్, బి. సరోజాదేవి.

## సయీదాఖాన్

బొంబాయిలో స్క్రీ ఉంఫ్ కామినీ కదమ్ అనే అమ్మాయి 'తలాక్' చిత్రంతో ఒక్కసారి పైకివచ్చింది. ఇప్పుడు డీలక్స్ ఫిలింస్ వారు 'అప్నా హాత్ జగన్నాథ్' అనే చిత్రంలో కిషోర్ కుమార్ కు నాయికగా సయీదాఖాన్ అనే పదహారేళ్ళ చిన్నదాన్ని పరిచయం చేస్తున్నారు. రోష్ని ఫిలింస్ అధిపతి హెచ్. ఎస్. రవైల్ ఈ అమ్మాయిని 200 మంది అభ్యర్థినులలో ఎన్నిక చేసి తీసుకువచ్చారట. డీలక్స్ ఫిలింస్ వారి దర్శకుడు మోహన్ సైగల్ ఈమెని 'ఎరువడిగి' మొదట తన చిత్రంలో బుక్ చేసుకున్నాడు.

సయీదా, సినీతారకి ఉండతగ్గ హంగులన్నీ ఉన్న సలక్షణమైన అమ్మాయి అని ప్రవీణులుఅంటున్నారట. ఈ అమ్మాయికి నటన, ఉగుపాల నాటి నుండీ నేర్చుకున్నది కాదు; "నా చిన్ననాటి ముచ్చట్లు" అని రేపు పెదదయ్యాక రాసుకుందికి వీలుగా నాటకరంగానుభవాలు కూడా ఏమీ లేవుట.

అయినా సెట్ మీద మొదటి రెండు

రోజుల నటనా చూసిన తరవాత ప్రజ్ఞగల పిల్లఅనీ, నటన గురించి ఎవరూ ఈమెకి అట్టే నూరిపొయ్య నక్కరలేదని దర్శకుడు మోహన్ సెగాల్ అన్నారు.

తొలిరోజు సెట్ మీద సెగాల్ ఈమెను నటులకి పరిచయం చేశాడు. కిషోర్ ని పలకరిస్తూ "న్యూఢిల్లీ చిత్రం చూసినప్పటినుంచీ నేను మీకు ఓ 'ఫాన్' ని. ఇప్పుడు మీతో నటించే అవకాశం కలిగింది; ఇక మీకు తగ్గ స్థాయిలో నటించే అవకాశం కలిగించాలి" అంది వహీదా. లీలా చిట్నిస్ ('అప్నా హాత్'లో వహీదా అత్తగారు)కు నమస్కరించి, "మీరు నటించిన కంగన్ బంధన్ చిత్రాలను అప్పుడే చూసేంత పెందరాళే నేను పుట్టలేదు. ఇన్నాళ్ళకి మిమ్మల్ని చూసినందుకు చాలా ఆనందంగా ఉంది" అంది.

## సురేష్ పూరీ

శ్రీ రిలీఫ్ చిత్రవారి తొలి చిత్రం 'పచ్చీ మోతీ'లో కూడా సురేష్‌పూరీ అనే కొత్త నటుడిని తీసుకొన్నారు. ఇటీవల ఒక పోటీలో ఇతను ఎన్నికయ్యాడు. బహుశా గురుదత్, బిమల్ రాయ్‌ల చిత్రాలలో కూడా నటించవచ్చుననుకుంటున్నారు.

'పచ్చీమోతీ'లో ఇతర నటులు జానీ వాకర్, జబీన్, సులోచన, మనోమోహన్ కృష్ణ, జీవన్, గోపి, ప్రతిభ, మధు ఆప్టే మొదలగువారు. దర్శకుడు ఓ. మి. సంగీతం ఎన్. దత్త. ★



## సిసిల్ బి. డిమిల్

చలనచిత్ర చరిత్రలో నిలబడి, పదికాలాలపాటు వినబడే పేరుగలవాడు, తోటివారు, మేటివారూ సగౌరవంగా చెప్పుకోవలసిన పేరుగలవాడూ, అమెరికన్ చలనచిత్ర పరిశ్రమ సాంకేతిక పారిశ్రామిక ప్రగతికి దోహదకారుడు, బ్రహ్మాండమైన నవతగ చలనచిత్రాల నిర్మాణకర్త, నాయకుడూ అయిన సిసిల్ బ్లౌంట్ డిమిల్ హఠాన్మరణం (జనవరి 21) దేశదేశాల చలనచిత్రాభిమానులకు విచారం కలిగించింది. మరణకాలంనాటికి 77 ఏళ్ళ వయోవృద్ధుడు అయినా, ఆయన జవసత్వాలను, ఆయన వేసుకున్న పథకాలను కన్నవారికేగాక విన్నవారికికూడా ఇది అకాలమృత్యువు అనే అనిపించింది.

చలనచిత్రసీమ వాసుల పాలిట స్వప్నసీమ 'హాలీవుడ్' క్షేత్రానికి, డిమిల్ 1918లో నిర్మించిన 'ది స్క్వామాన్'తోనే శంకుస్థాపన జరిగిందనాలి. అదేకాక, అక్కడే డిమిల్ పేరిట, ఆయన ప్రజ్ఞాప్రాభవాలవల్ల చలనచిత్ర పరిశ్రమ పెరగడానికి కారణమైనవి ఎన్నో పుట్టాయి. మొట్టమొదటి కథాచిత్రం ఆయన చేతులమీదగానే పుట్టింది. సినీకెమెరా దశదిశలా చూడడానికి అనుకూలమైనవాహనం, ఎటునుండి దృశ్యాలను చిత్రించడానికి రూపొందిన 'క్రేన్' ఆయన చేతులలోనే ఆనాడు తొలిసారి రూపుధరించాయి. సెట్‌కీ, సెట్ మీద నటుడికీ మధ్యదూరాన్ని స్పష్టంచేసి నటుడిని స్పష్టంగా చూపించే తొలి ప్రయత్నం - 'రెంబ్రాంట్ కెప్ లైటింగ్' ఈయనే చేశారు. ఇక, డిమిల్ ముద్రపడిన ముఖ్యాంశం: సెట్‌లు కాలక్షేపం పద్ధతిలో ఏదో అంటే ఏదో అన్నట్టుకాక, ఏది



విజయవారి 'అప్పుచేసి పప్పుకూడు' చిత్రంలో రేలంగి, రంగారావు, సావిత్రి



అన్నపూర్ణావారి 'మాంగల్యబలం'లో కన్నాంబ, వరలక్ష్మి.

అంటే అదేగా. ఎంత అంటే అంతే, ఎంత ఖర్చుఅయినా శ్రమఅయినా నిర్మించాలనీ, సృష్టికి ప్రతిసృష్టిచేసి దాన్ని సెల్యులాయిడ్ మీద నిలపాలనీ చాలమందికి ఊహకుండి ఉండవచ్చు. కాని, నిజంగా అంతపనీచేసి చూపిన మొదటి దర్శకనిర్మాత ఈయనే. బ్రహ్మాండమైన సెట్‌లమీద నిజం అనిపించే వాతావరణంలో చిత్రీకరించే కథలో రస పోషణ సాధ్యంకాదని డెమిల్ నమ్మకం. ఆయన కృషిఫలితాలలో ఎక్కువభాగం క్రైస్తవ పౌరాణిక గాథలు ఆధారంగా తీసిన చిత్రాలే—ది కింగ్ ఆఫ్ కింగ్స్, ది క్రుసేడ్స్, ది టెన్ కమాండ్‌మెంట్స్ (మూకీ), శాంప్సన్ అండ్ డిలైలా, ది టెన్ కమాండ్‌మెంట్స్ (ఇటీవల మనదేశంలో విడుదల అయింది.)

ఒళ్ళు ఝల్లుమనిపించే దృశ్యాలతో నింపుతూ డెమిల్ తీసిన ఇతరచిత్రాలలో, 'ది అన్ కాంకర్డ్,' 'ది గ్రేటెస్ట్ షో ఆన్ ఎర్త్' చెప్పుకోతగినవి. వెస్టర్న్ చిత్రాలలో డెమిల్ చిత్రం 'ది ప్లెయిన్స్‌మన్' నాటికీ నేటికీ కూడా విశిష్టచిత్రంగా పరిగణించబడుతోంది.

బ్రహ్మాండమైన సెట్‌లు వేయాలని ఎంత పట్టుదలో, అందులో గుండుసూది ప్రాముఖ్యాన్నికూడా గుర్తించి ఆలోచించేటంత శ్రద్ధ డెమిల్‌ది. ఊహలూ మాటలూ ఎగిరినంత ఎత్తుకి తనూ ఎగరాలన్న పట్టుదల, దాని కోసం లక్షలు ఖర్చుపెట్టేసాహసం, అహోరాత్రులు తాను శ్రమపడి, తోటిపనివారిని శ్రమపెట్టి ఫలితాన్ని సాధించ ప్రయత్నించే ఓర్పు, వ్యయప్రయాసలు రెండిటినీ లవలేశంకూడా పొల్లుపోకుండా పూర్తిగా సద్వినియోగం చేసుకుని ప్రేక్షకులకు తృప్తిని కలిగించగల ప్రజ్ఞ డెమిల్‌కిగల సిరిసంపదలు. ఇతరులు ఖర్చుపెట్టే మిలియన్ డాలర్లకూ డెమిల్ ఖర్చుపెట్టే 'డి-మిలియన్' డాలర్లకూ ఉన్న తేడా ఇదే. పరాజయంతో పరిచయం కాకుండా డెమిల్‌ను నిలిపినశక్తి ఇదే.



## రౌర్కెలాలో సంక్రాంతి వేడుకలు

రౌర్కెలా ఆంధ్రసమితి ఆధ్వర్యాన జనవరి 14-వ తేది సాయంత్రం 6.30 గంటలకు స్టీల్ ప్రాజెక్టులో పనిచేస్తున్న తెలుగు వారంతా 4 వ నెంబరు సెక్టరు ప్రాథమిక పాఠశాల ఆవరణలో సమావేశమయ్యారు.

కార్యదర్శి శుభాకాంక్షలతో సంక్రాంతి కార్యక్రమము ప్రారంభమయింది. సంగీతం, అభినయము, విచిత్రవేషధారణ, గారడీ కార్యక్రమంలోని ముఖ్యాంశములు.

మారెళ్ళ సత్యనారాయణగారి లలిత సంగీతం, పెరినటరాజుగారి విచిత్ర వేష ధారణ, సుసర్ల వేంకటాచలంగారి అభినయం మామిడన్న ఈశ్వరరావుగారి "ఖాసిం సాయిబు" గారడీ, సభ్యులను చాలా ఆనంద పరిచాయి.

హాస్యంతో అద్భుతంగా గారడీ నిర్వహించిన ఈశ్వరరావుగార్కి, సమితి అధ్యక్షులు డా॥ ఎం. ఆర్. ప్రసాద్ గారు సువర్ణపతకాన్ని బహూకరించారు. శ్రీయుతులు చలం, నటరాజుగార్లకు కూడ సభ్యులలో కొంతమంది ప్రత్యేక బహుమతులను చదివించారు.

కార్యదర్శి వందన సమర్పణ తదుపరి జాతీయ గీతంతో సభముగిసింది.

రాత్రి 8-30 గంటలు మొదలు 11 గం.ల వరకు, 20-వ నెంబరు సెక్టరులో శ్రీమతులు సత్యవమ్మ ప్రసాదరావు, ప్రసాద్ పట్నాయక్ గారల పాటకచ్చేరి జరిగింది.





నేషనల్ పిక్చర్స్‌వారి 'అంతా పెద్దలే' చిత్రంలో ఎం. ఎస్. రాజం, లక్ష్మీప్రభ, లలిత.



వరంగల్ లో జనవరి 4 న ఒక విద్యాసంస్థకు సహాయనిధి సేకరణకై వైజ్ఞానిక ప్రదర్శనాలు, కళాప్రభాసవారి "మాబావ" నాటక ప్రదర్శనం ఘంటసాల గానసభ జరిగాయి. వరంగల్ జిల్లా కలెక్టర్, ఆరుద్ర, ఘంటసాల, జగ్గయ్య, ఆర్థికమంత్రి కాసు బ్రహ్మానంద రెడ్డి. తిలక్, గుమ్మడి, రమణారెడ్డి, ప్రభాత్ పిక్చర్సు మేనేజింగ్ డైరెక్టరు కె. వెంకటరెడ్డి, ఛాయాదేవి, సీత, రాణి, సరోజిని, జానకి.

# వార్తావరణం

పారిస్ లో ఒక సంగీత విద్వాంసుడు, ఒక కొత్తపాటకి బాణీ కూర్చుకొని స్వరాలు ఖరారు చేసుకొంటూ ఉండగా అతని మిత్రుడు వచ్చాడు. పాట జాగ్రత్తగా విని, ఏదో గుర్తుంచుకొని, సంగీతకారుడికి కనపడకుండానే చల్లగా జారుకున్నాడు. మర్నాడు మళ్లీ వచ్చి కబుర్లు చెబుతూ యథాలాపంగా, క్రితంరోజు విన్న బాణీని కూని రాగాలలో ఆలపించాడు. సంగీత దర్శకుడు అది విని కంగారు పడ్డాడు. "ఈ వరస నీకెలా తెలుసు? నువ్వెక్కడ విన్నావు" అన్నాడు. మిత్రుడు నవ్వాడు. "ఇంకా నయం. మెల్లిగా అడిగావు. ఈ పాట దేశంఅంతా మోగుతోంది. అమెరికన్ ట్యూను. అక్కడ పెద్ద హిట్టు" అన్నాడు.

సంగీతకారుడు నీరు గారిపోయాడు తను స్వయంగా చేసిన కొత్తపాట మరో దేశంలో ఎవరిపేరనో హిట్ అయినందుకు.

అయితే అదే మహాబాగని, తనూ తనపాటని బయటికి తెచ్చుకోలేదు. దాన్ని అలాగే వదిలేశాడు.

ఈ 'మోట సరసం' ఆడిన పెద్దమనిషి తనివితీరా నవ్వుకుని ఆనందించాడు. మన దేశంలో వర్తమాన వర్ధమాన ఫిలిం సంగీత దర్శక నిర్మాతలు కూడా ఇది వింటే పొట్ట చెక్కలయి నవ్వుకుంటారు. పైన పేర్కొన్న కథానాయకుడి వెర్రిబాగుల తనానికి — ఎందుకంటే ఒకపాట హిట్ అయిందని తెలిసినప్పుడు, అదిమనది కాపోయినా తీసుకుని దాన్ని మరింత హిట్టు చెయ్యడం మనకి పరిపాటి అయిపోతూంది. కాగా మనం తెచ్చుకునేవి పొరుగు దేశాలవి. మొదట బొంబాయి వాళ్లూ, ఆఖరికి మేమూ, మద్రాసు వాళ్లు ఆయా బాణీలను తిరిగి తిరిగి హిట్ లు చేయిస్తున్నారు.

ఒక్కొక్క వరస బొంబాయి సినీశంఖంలో పడి తీర్థంఅయి చెన్నపట్నం చేరడానికి ఏడాది పట్టవచ్చు. అది ఇంకో రెండేళ్లు నిలవేశాక దాన్ని పునరుద్ధరించడం కూడా జరుగుతూ ఉంటుంది. బొంబాయిలో ఒక్కొక్కసారి, ఇద్దరు మ్యూజిక్ డైరెక్టర్లకీ ఒకే సెరనేడ్ దొరుకుతుంది. దీన్ని కాపీ కొట్టడం జన్మహక్కు అనుకుని ఇద్దరూ ఆపని చేస్తున్నారు. రెండూ అటూ యిటూగా విడుదలయి ఒకరికి ప్రతిష్ఠ, మరొకరికి రెండోది లభిస్తున్నాయి. ఇలా ఎందుకని కొందరు ఎవరి పాతపాటలు వారే వన్సుమోర్ అనుకుని కాపీ కొట్టేసుకున్నారు. కొందరు పంతాలు వేసుకుని వారి హిట్లు వీరూ వీరి హిట్లు వారూ చెక్కేస్తున్నారు. శ్రోతలు నవ్వుకుంటున్నారు. విసుక్కుంటున్నారు బాధ పడుతున్నారు...

ఎలక్ట్రానిక్ సంగీతంపై అమెరికాలో పెద్ద ఎత్తున పరిశోధనలు జరుగుతున్నాయి. లెక్కలను మించిన వేగంతో లెక్కలు చేసి పెట్టే యంత్రాల మలేనే ఇంకో మెట్టు పైకి వెళ్లి సంగీతంలో కొత్త కొత్త బాణీలు కుప్పతిప్పలుగా తయారుచేసి పెట్టగల యంత్రం ఒకటి ప్రస్తుతం రూపుధరిస్తోంది. లెక్కల యంత్రంలో అంకెలు పెట్టే



"మరొక్కసారి వేయించుకు చూసి మరీ నిషేధిద్దాం"



ట్వెంటీయత్ సెంచరీ ఫాక్స్ వారి 'ఎన్‌స్ట్రేన్ స్మయిల్' చిత్రంలో బ్రాడ్‌ఫర్డ్ డిల్మన్, క్రిస్టీన్ కెరీర్

# వార్తావరణం

'మేపి' నటే దీంట్లో ఒక వరస స్వరాలు అందిస్తారు. ఆ స్వరాలను అటుది ఇటు తెచ్చి, ఇటుది అటుతోసి, కిందా పైనా పెట్టి ఎన్ని రకాలుగా మార్చి ఎన్ని రకాల బాణీలు కట్టవచ్చునో అన్నీ ఈ యంత్రం తయారుచేసి, రాసి చేతికి అందిస్తుంది. ఇందులో సొగసులు సామాన్య శ్రోతల కన్న ఎక్కువగా నేటి మేటి దేశీయ సంగీత దర్శకులకు బాగా తెలుస్తాయి. నిన్నటి పాటల్లో మధ్యమం మీదికి వాలిపోయిన 'పల్లవి' గాన్ని నిషాదంలోకి లేవనెత్తి - షడ్జమాన్ని పలకరిస్తున్న దాని నెత్తిన మొట్టికాయ మొట్టి, కిందికి పదమనీ - నేటి వాడి పాటవరసను 'అర' స్వరాలలోకి ఫిరాయించి సరే సీ- గారడీలు చేసే వారికి ఇందులో ఒడుపులు మరీ పసందుగా ఉంటాయి. పనితత్తిడి వల్ల ఈ విద్యలో ప్రావీణ్యం గడించిన ఓ. పి. నయ్యర్ ప్రభృతులూ, "...లో మ్యూజిక్ హిట్టు కాబట్టి..." అన్న గుర్రాలతో నిన్న మొన్నటిదాకా వాడిందే పాడిస్తూవచ్చిన హేమంతకుమార్ ప్రభృతులూ ఈ ఎలక్ట్రానిక్ యంత్రం పెద్ద విశేషం అనుకోకపోవచ్చు. అప్రస్తుతం అయినా ఓ చిన్న తమాషా సందర్భం చెప్పుకోవలసి ఉంది. ఇటీవల విడుదలఅయిన ఒక చిత్రంలో రేలంగి నాగు పాముతో అవస్థపడే సన్నివేశం ఒకటి ఉంది. ఆయన చాలా కంగారుపడుతూ ఉండగా రాజసులోచన, రేలంగి చేతిలో గ్రోమోనికా తీసుకుని నాగిన్‌లో హిట్ ట్యూను వాయించేస్తుంది. పున్నాగవరాళి వింటే పాములు ఆనందంతో నర్తించడం నిజమేఅయినా, హిందీలోనూ, దరిమిలా కొన్నాళ్ళు తెలుగులోనూ అదే పాటనీ, హేమంతకుమార్ తరువాతి చిత్రాలు కొన్నిటిలో పెట్టిన అదే వరస పాటలనూ విని విని ఉందేమో, ఆ పాము ఈ వరస వినీ వినగానే అర్జెంటుగా పారిపోయింది.

అయితే సినీ వణిజులభాషలో - "పనితత్తిడి అంతటిది కాబట్టి," ఇలా ఒక్కొక్క వరసనే ఒకటే వరసతో వంద పాటలు చెయ్యడం తప్పదు కాబోలు అని ఊరుకోవాలి కాబోలు అని చెప్పుకోవాలి.

మొత్తంమీద ఈ ఎలక్ట్రానిక్ యంత్ర సంగీతం ముమ్ముందు శ్రోతలను మంత్రముగ్ధులవలె నిలపడం ఎలా ఉన్నా మొదట యంత్రముగ్ధుల్ని చేసి వేయగలదనీ. ఇది కట్టే వేలాది బాణీలు పెద్ద సంచలనం కలిగిస్తాయనీ అనుకొంటున్నారు. దీనిపై పరిశోధనలు జరిపించడానికి రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్‌వారు 1,75,000 డాలర్లు విరాళం మంజూరు చేశారట.

మనమటుకు మన సంగతి ఆలోచించుకొంటే ఈ యంత్రం రావడంవల్ల కొత్త కొత్త బాణీలు వినే మహాద్భాగ్యం కలుగుతుందని మురిసిపోవాలనిపించదు; (ఊహకు అందినంతవరకూ) 35 వేల రాగాల విశ్వఘోషతో శోభిల్లు సప్తస్వరార్ణవంలో విహరింప నేర్చిన వారికి ఇది అసలు అద్భుతం అనిపించదు. అయితే ఈనాడు ఎన్నో రాగాలు విస్మృతి పథంలో పడి ఎటో వెళ్ళిపోయాయి అందువల్ల 35 వేల రాగాలు అపోహకి మటుకే అంది ఉంటాయనీ, ఊహకి అందేవి ఇంకా తక్కువ అనీ, వాటిలో పలుకుబడికి అందినవి వందల



'నతీసుకన్య'లో రమణారెడ్డి, జయశ్రీ

# 12 ఉత్తమ చిత్రాలు

# "మదర్"



చలనచిత్రకళలో శబ్దయుగం ఆరంభమైన తొలిరోజులలో నిశ్శబ్దానికి ఉపశ్రుతిగా శబ్దాన్ని ఉపయోగించుకొంటూ అవతరించిన రష్యన్ చిత్రం 'మదర్' (1926). చలనచిత్రకళ విస్తృత పధులను అవగతం చేసుకొని, దానిని నిజంగా ఒక కళగా మన్నించి, పరిశీలించి దాని స్వరూపస్వభావాలనుబట్టి కొన్ని మార్గాలూ, శిల్పాలూ సిద్ధాంతాలూ ఏర్పరచుకొని అవి ప్రాతిపదికలుగా, కాలచక్రంక్రింద పడినా నలగని ఉత్తమోత్తమ చిత్రాలు నిర్మించిన మేధావులలో అగ్రగణ్యుడు వి. ఐ. దిపుడోవ్‌కిన్. ఈయనా మరొక రష్యన్ చలనచిత్ర కళానిధి సెర్గీ ఐసెన్‌స్టీన్, తీసినవి కొద్దిచిత్రాలేఅయినా ఈ చరిత్రలో విశిష్టస్థానాన్ని సంపాదించుకున్నారు.

వారివారి చిత్రాలను దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే సమకాలికులు, సహచరులు అయిన ఈ యిద్దరి చిత్ర 'నిర్మాణ' దృక్పథాలలోను ప్రధానమైన భేదం ఒకటి గోచరిస్తుందని విమర్శకులు అన్నారు. ఐసెన్‌స్టీన్ చిత్రం మేధకు మేత. అందులో వస్తువుకన్న 'వాస్తు' (కథ నిర్మాణ విధానం)కు, కథనశిల్పానికి ప్రాధాన్యం హెచ్చు. కళాపిపాసగలవారు ఈ చిత్రాలలో స్వారస్యాన్ని ఎక్కువగా గ్రహించి ఆనందిస్తారు. ఈ ప్రముఖులు ఇద్దరూ ఈ సూత్రాలలో ఇమిడిపోతారు అనడం సబబు కాదుగాని మూలంగా ఇది చెప్పుకోవచ్చు.

పుడోవ్‌కిన్ కథనశిల్పం ఇందుకు భిన్నమైనది. హార్దికమైన ఆనందం కలిగించడం దీని లక్ష్యం. ప్రతి సామాన్యప్రేక్షకుడూ కూడా, ఇందులో సింబాలిజంకోసం, విశేషార్థాలకోసం వెతుక్కునే పనిలేకుండా,



'మిస్టర్ కార్టూన్ ఎం. ఎ.' లో శ్యామ

సంఖ్యలోనే ఉన్నాయని విద్వాంసులు చెబుతారు.

సప్తస్వరాలమీద, అపాదశ శ్రుతి భేదాలలో రాగరూప కల్పన ఊహిస్తే, ఇప్పుడు అందుబాటులో ఉన్న వాటికన్న చాలా ఎక్కువ రూపాలు స్ఫురిస్తాయని లెక్కలు తెలిసినవాళ్లకి కూడా తెలుసుంది. టెలిస్కోపు విమానం వంటివి లేకుండా, భచక్రంలో గ్రహాల స్థితిని గతినీ, భూమి గుండ్రంగా ఉండి సూర్యుడి చుట్టూ తిరుగుతున్నదన్న వైనాన్ని గ్రహించిన భారతీయుడు, రేపు ఈ ఎలక్ట్రానిక్ యంత్రం చేయగలపనిని యంత్రాలు లేకుండానే, ఏనాడో చేసిపెట్టాడు.

అయితే ఈ అపారవారసత్వాన్ని ఈనాటి వారు-సృజనాత్మక వ్యాసంగంలో ఉన్నవారు ఉపయోగించుకోవటం లేదు. లేనివాగు మటుకు మాతాతలు నేతులు తాగారూ, మామూతులు వాసన చూడండి అన్న ధోరణిలోనే అందుబాటులో ఉన్న ఈవిద్యానిధిగురించి కూడా మాట్లాడుతున్నారు. ★

చూస్తూనే సర్వం అవగతం చేసుకోగలదు. ఏక క్షణంలోనే కథ, దాని తత్వం అందులో తాత్పర్యం ప్రేక్షకుడికి హృదయగతం అవుతాయి. ఈ లక్ష్యాన్ని సాధించడానికి పుడోవ్‌కిన్ కెమెరాకన్నా నటనను ప్రధానంగా వినియోగిస్తాడు. ఆ పైన ఎడిటింగ్. ఈ రెండు విషయాలపైనా సమగ్రంగా చర్చిస్తూ ఆయన రెండు మంచి గ్రంథాలు కూడా వ్రాశాడు.

నటనలో సహజత్వం ఉట్టిపడాలని పుడోవ్‌కిన్ నమ్మకం. సహజ నటన అంటే, కాళ్ళూ చేతులా నటించేసి ఆడిపాడుతూ ఉండకూడదనే కాదు. కళ్ళూ, ముక్కూ, నోరూ, కంఠం కూడా కొంత అదుపులో ఉంచుకోవడం అని పెద్దలు చెబుతారు. ఒక పాత్ర మనోగత భావాన్ని వ్యక్తపరచడానికి బొమ్మ కింద వివరణ రాసినటుగా దానికి కొట్టొచ్చేలా అభినయం పట్టకూడదనీ అవ్యక్తంగా, అరచాటుగా సూచించాలని అంటారు. సూచన కూడా లేని, నిర్వికార హావాల బలవత్తర శక్తిని కూడా గుర్తించి ప్రయోగించిన వాడు పుడోవ్‌కిన్. ఈ ప్రయోగాలు రంగస్థలం మీద సులభసాధ్యాలు కాకపోవచ్చు. కొందరి మతం ప్రకారం అసాధ్యాలు అయినా కావచ్చు. కాని తెరమీద మాత్రం ఇవి సుసాధ్యాలే కాక, అత్యవసరమైనవి కూడా.

ఇక, ఈ 'నటన' చలన చిత్రాలలో, నిర్మాణ స్వభావాన్ని బట్టి శకలాలుగా వస్తుంది కాబట్టి వీటన్నిటినీ సంకలనం చేయడంలో (ఎడిటింగ్) శ్రద్ధవహించడం కూడా నటుడి ముఖ్యవిధులలో ఒకటి అని పుడోవ్‌కిన్ వ్రాశారు.

12 సార్వకాలిక ఉత్తమ చిత్రాలలో ఒకటిగా ఎన్నిక అయిన 'మదర్' చిత్రానికి ఆ చిత్రంలో పుడోవ్‌కిన్ కథన శిల్పానికి స్థూలంగా ఈ అంశాలు ప్రాతిపదికలు అవవచ్చును. కథావస్తువు విప్లవం. ఐసెన్‌స్టీన్ విప్లవాన్ని చూపడంలో లక్షలాది ప్రజల ఆశలను, ఉద్వేగాలను, బాధలను సామూహిక స్థాయిలో చూపిస్తే, పుడోవ్‌కిన్ ఆ సమూహంలో వ్యక్తులను ముందుకు పిలిచి వారి గాథలను చెబుతారు. మదర్ చిత్రంలో కథ చిన్నదే. రష్యాలో విప్లవకాలం కథాకాలం. ఒక అమాయిక కథానాయిక. (ఫిల్మ్ హీరోయిన్ కాదని గ్రహించ ప్రార్థన) ఆమె భర్త అభ్యుదయవిరోధి. విప్లవ విరోధి. తాగుబోతు. కొడుకు, తండ్రి పద్ధతికి వ్యతిరేకి. కొత్తగా వచ్చిన రాజకీయ ఉద్యమం సమ్మె చేయించడానికి సాగించిన సన్నాహాలలో ప్రముఖ పాత్ర స్వీకరిస్తాడు. అతడు ఇంట్లో దాచిపెట్టిన ఆయుధాలగుట్టు బయటపెట్టడం బిడ్డకు మంచిదని నచ్చచెప్పి నమ్మించి, తల్లి ద్వారా ఆమాకే తెలుసుకుని, కొడుకుని అరెస్టుచేస్తారు. కలబోల్లి విచారణ ఒకటి జరిపి అతనికి ఖైదువిధిస్తారు అక్కడితో, తల్లికి తనుకూడా విప్లవోద్యమంలో దిగడం అవసరమని తోస్తుంది. ఈలోగా ఉద్యమనాయకులు తిరగబడి, ఆమె కొడుకుని విడిపిస్తారు. వేలాది ప్రజల ఊరేగింపులో అతడువస్తూ, తల్లిని కలుసుకోబోయే ముహూర్తాన సైన్యం తుపాకులు కాల్చి జనాన్ని చెదరకొడతారు. ఆ తొక్కిడిలో అతడు ప్రాణాలు కోల్పోతాడు. జారిస్టు సైన్యాలు మీదకు విరుచుకపడుతూండగా తల్లి పతాకం చేతబట్టుకు నిలబడి, చనిపోతుంది. ఈ కథను చెప్పడంలో ప్రతి అంశం ప్రతి సన్నివేశం గుండెమీద ఒక చిరముద్ర వేసేవిధంగా పుడోవ్‌కిన్ దీనిని చిత్రించాడు. కథలో సంఘటనను తీసుకొని దాన్ని, మొదట ఏ భాగానికి ఆ భాగం విడదీసి తిరిగి చలనచిత్ర కథాఘట్టంగా కట్టడంలో ఆయనది ప్రత్యేక ప్రతిభ. ఇలా చేసినపుడు 'సింబాలిజం' తటస్థపడినా, అది కొట్టొచ్చేట్టు కాక, కథలో భాగంగా ఒదిగిపోయేలా అమరుస్తాడు.

సైనికబలానికి ఎదురై చెదిరి ఛిన్నాభిన్నమైన అఖండజనవాహినికి సామ్యంగా, నదిమీద వసంతానికి ఎగురేగి ఢీకొని శకలాలైపోయిన 'ఐస్ ఫ్లో' (మంచుకొండ) ను చూపించిన సన్నివేశానికి చలనచిత్ర చరిత్రలోనే గొప్పస్థానం ఉంది. ఇది కేవలం సామ్యంగానే కాక, అంతకన్న శక్తివంతమైన ఉద్బోధగా వ్యాఖ్యగా భాసిస్తుంది. కథలో తెచ్చిపెట్టుకున్న ఉపమానాలలా ఎబ్బెట్టుగా తోచదు. ఇవేకాక, చిత్రంలో నటన, ఛాయాగ్రహణం, ఎడిటింగ్ మొదలైనవన్నీ కూడా ఆర్కెస్ట్రాలో వాద్యాలలా సమ్మేళనం చెంది, అన్నీ కలిసి ముక్తకంఠంలో కథాంశాన్ని మహాకావ్యపు రీతిలో నిండుతనంతో చాటుతాయి. ఇదే పుడోవ్‌కిన్ విశిష్టత. ★



శ్రీ వెంకటేశ్వరావారి 'సతి సుకన్య'లో కాంతారావు.

## మురార్జీ దేశాయిగారికి

ప్రపంచ చలనచిత్ర పరిశ్రమలో చిత్రాలసంఖ్య దృష్ట్యా మొదటి మూడు స్థానాలలో ఒకటిగా ఉంటూవస్తున్న భారతదేశం 1958 లో ద్వితీయ స్థానాన్ని ఆక్రమించింది. సాధారణంగా ప్రథమ ద్వితీయ స్థానాలు జపాన్ హాలీవుడ్‌లవిగా ఉంటాయి. ఈసారి జపాన్‌ది ప్రథమస్థానం. వారు 480 చిత్రాలు నిర్మించారు. మనది ద్వితీయస్థానం. (293 చిత్రాలు) సాలుకు 500 తీసే హాలీవుడ్ ఈయేడాది మూడవదిగా వచ్చింది.

ఈ వైనాన్ని దేశఆర్థికమంత్రి శ్రీమురార్జీ దేశాయిగారు చలనచిత్ర పరిశ్రమ పరిమాణాన్ని గురించనివారూ గమనించగలరని ముడిఫిలిం కట్‌కట పడుతున్న వారి 'దురాశ,' ★

(7-వ పేజీ తరువాయి)

ఈ లోపల విశ్రాంతి తీసుకోండి.

కు: నాకు తెలుసునమ్మా! పొద్దంటే వివరు-ఆకలి లేకపోయినా చుట్టాలింటికి వెళ్ళినప్పుడు భోజనం చేయందే మటుకు వదలరు. చూడు శారదా! యిప్పుడు నాకోసం కూరలూ నారలూ యేం చెయ్యక్కర్లేదు గాని - చారుమాత్రం కొస్త వెచ్చచెయ్యి. కందిపచ్చడో, పెసరపచ్చడో వుంటే చాలు, నా భోజనం యిటే తెమిలిపోతుంది.

శ్రీ: అయితే బాబాయ్, మూడు నెలల నించి యిటూ ఊరూరూ తిరిగానంటావు, ఎక్కడెక్కడి కెళ్ళావు?

కు: నెల రోజులు రాజమండ్రిలో వున్నాను. పదిహేను రోజులు కాకినాడ: యిరవై రోజులు హైదరాబాదు, మరో పదిహేను గుంటూరు. ఈ మూడు నెలలూ యింటిపట్టున లేకపోయినా నాకు ఎంతో హాయిగానే వున్నదనుకో. అన్ని ఊళ్ళలోనూ మన బంధువుల యిళ్ళలోనే దిగాను. ఎంత మర్యాద, ఎంత మర్యాద! మంచికీ మర్యాదకీ నిజంగా మన వాళ్ళనే చెప్పుకోవాలోయ్! అన్నన్ని రోజులు వున్నానని ఎవరన్నా ఒక్కసారైనా చికాకు పడ్డారా? చీదరించుకున్నారా? నే నేదో వాళ్ళపనిమీదే వచ్చినట్లు, వాళ్ళయింట్లో నేను విడిసివుంటే వాళ్ళకేదో మహాభాగ్యాలు కలిగేట్లు ఎన్నో దేవుడిలా చూచుకున్నారనుకో. వెళ్ళిపోయేటప్పుడు పాపం, కళ్ళనీళ్ళు పెట్టుకుని - యింటిల్లిపాదీ యేమన్నారో తెలుసా? 'అయ్యో, అప్పుడే వెళ్ళిపోతున్నారా? ఇవాళో నిన్నో వచ్చినట్లుంది మాకు! అవును లెండి, మీ పని అయిపోయింది కాబోలు, వెళ్తున్నారు. అంతేగాని, మేం రమ్మంటేమటుకు, లక్షవరహాలు యిస్తామంటేమటుకు మా చోటివాళ్ళయిళ్ళకు వస్తారా? ఒక్క క్షణమైనా మాతో మాట్లాడతారా? ... ఎప్పుడే నా సరే, మళ్ళీ యీ వూరు వచ్చినప్పుడు తప్పకుండా మా యింటికి రండి. మీ కేమీ అభ్యంతరం వుండదు. మీకోసం మా ద్వారం ఎప్పుడూ తెరిచే వుంటుంది' అన్నారు. అన్నారుగదా అని నేను ఎప్పుడూ వాళ్ళకే యిబ్బంది పెట్టటం బాగుంటుందా? అందుకనే ఎక్కడున్నా యే హోటలుగదిలోనేనో కాలక్షేపం చేద్దామని చూశాను. అయితే యేం లాభం? ఎవరో చటుక్కున చూసేవారు. ఎంతమాట, ఎంతమాట! మేం యీ వూళ్ళో కాపురం వుండటమేమిటి, మీరు కార్యార్థులై వచ్చి హోటల్లో మకాం చేయుటమేమిటి? మీ కేమైనా అపచారం జరిగిందా మావల్ల? క్షమించండి, రండి, రండి అని వాళ్ళ యింటికి లాక్కెడతారు.

శ్రీ: అంతేలే బాబాయ్, బంధువు లన్న తర్వాత ఆమాత్రం ఆదరా వుండద్దూ మరి!

ఉండు శారద యేంచేస్తోందో చూసి వస్తాను.

కు: మరేం తొందరపెట్టకులే; శ్రీరాములూ - ఎక్కడికీ వెళ్ళక్కర్లేదుగా.

(అరక్షణం విరామం)

శ్రీ: యేం శారదా యేంచేస్తున్నావు.

శా: యీ పొయ్యి ఎంతకూ అంటుకుని చావలేదు. అయినా యీ అర్ధరాత్రి ఎక్కడ దాపురించాడండీ యీ అతిథి?

శ్రీ: ఉస్. బిగ్గరగా అనకు. అవతల గదిలోనే ఉన్నాడు. వింటే బాగుండదు.

శా: బాబాయ్, బాబాయ్ అంటున్నారు. యే వరసన బంధువండీ మీకు?

శ్రీ: చాల దూరపు చుట్టంలే. మా వూరే. అందుకని బాగా చనువు.

శా: ఆయన మజిగనీళ్ళతో సంతృప్తి పడతానంటూ వుంటే, మీరే గొప్పకోసం యింత హంగామా చేస్తున్నారు.

శ్రీ: మాటవరసకు ఆయన అలాగే అన్నాడనుకో. అంతేచాలని మనం ఊరుకుంటే యేం బాగుంటుంది? నేను అనకపోయినా మరో క్షణం ఆగి ఆయనే అనేవాడు. కుటుంబయ్య బాబాయి సంగతి అసలు నీకు తెలియదులే.

శా: యిప్పుడీ అర్ధరాత్రి కందిపచ్చడి చేసి పెట్టాలట చూడండి.

శ్రీ: అక్కర్లేదులే. యేదో ఊరగాయ ముక్క వేసి పెట్టు, రేపు చూచుకోవచ్చు.

శా: అయ్యో! నెయ్యి పూర్తిగా నిండుకుందండి, ఎలా?

శ్రీ: పక్కింటివాళ్ళను అడిగి ఓ గిన్నెడు తీసుకో. ఆయన వున్న నాలుగు రోజులూ వెళ్ళిపోతుంది.

శా: సరి! పక్కింటివాళ్ళు వస్తే అడిగారు, మధ్యాహ్నం.

శ్రీ: మరి యేం చేద్దామంటావు?

శా: పోనీలెండి. నూనెవేసే పెడదాం. ఏంచేస్తాం మరి?

శ్రీ: కుటుంబయ్య బాబాయి అట్లా ఊరుకునే ఘటం కాదు. నెయ్యి తెమ్మని కూర్చుంటాడు.

శా: ఇదే నెయ్యని చెబుతాలెండి. బస్తీలో నెయ్యి ఇలాగే వుంటుందని చెబుతాను. నాలుగు తియ్యటి మాటలు చెబితే ఆయన కడుపు నిండిపోయేటుంది.

శ్రీ: ఏమో, యేంచేస్తావో, ఏమీ లోపం జరక్కుండా చూచే భారం నీదీ!

శా: మీరుమాత్రం అన్నీ నెత్తిమీదికి తెచ్చిపెడుతూ వుండండి.

శ్రీ: ఇప్పుడు నే నేం చేశాను శారదా! ఈ కుటుంబయ్యను గాలివానలాగ మన యింటికి రమ్మన్నానా?

శా: రమ్మన్నారని కాదు. రేపు ఉదయం అతిథికి కాఫీ ఇవ్వడం ఎట్లా? మీరయితే మానుకుంటామన్నారు. మరి ఆయన సంగతేమిటి? కాఫీ తాగందే ఆయన బజారుముఖం చూస్తాడనుకోను.

శ్రీ: రేపటి గొడవ రేపు చూసుకోవచ్చులే శారదా. ఈయన ఒకటి రెండు రోజుల్లో వొదిలిపోయేట్లు లేదు. మాటాడే పద్ధతి చూస్తే ఇక్కడ కనీసం రెండు నెలలయినా మకాం వేసేట్టున్నాడు.

శా: రెండు నెలలే! మన కాపురం రచ్చకీడ్వ దలచుకున్నాడా యేమిటండీ

శ్రీ: అబ్బే, మనమీద ప్రేమాభిమానాలతో చూచిపోవటానికి వచ్చాడు శారదా! అతిథి శ్రీమహావిష్ణువుతో సమానం!

శా: సరి సరి! వంట అయింది. ఇక రమ్మనండి విష్ణువుగారిని.

(క్షణం విరామం)

శ్రీ: యేం శారదా! ఏడీ కుటుంబయ్య బాబాయి.

శా: వొచ్చి పదిహేను రోజులయింది. సత్యనారాయణపురంలో బంధువులున్నారు చూచివస్తానని వెళ్ళారు. ఇప్పటికే ఓ అరగంట అయివుంటుంది.

శ్రీ: కాల్చుకు తింటానికి మనం ఒక్కళ్ళం చాలేదు కాబోలు. ఇప్పట్లో ఏమన్నా మకాం మార్చేట్టు వున్నాడా?

శా: అహా! కోర్టు వ్యవహారం అంటూ అసలు ఒకటి వుందో, లేదోగాని దాంతో మన కాపురం ఒక కడకు వచ్చేట్లుంది.

శ్రీ: రిష్టువాచీ తాకట్టు పెట్టి తెచ్చిన అరవై రూపాయలూ అయిపోయినై. ఇక నన్ను నేనే తాకట్టు పెట్టుకోవాలి.

# తప్పనిసరి అతిథి

శా: అసలాయనకు ఇక్కడ్నించి కదలాలనే వుద్దేశ్యమే వున్నట్టు లేదు.

శ్రీ: ఎందుకుంటుంది? రెండు పూటలా కాఫీ ఫలహారాలు, విందు భోజనాలు—అన్నీ అడిగి మరీ చేయించుకుంటూ వున్నాడాయె!

శా: ప్రతిపూట వడ్డించ లేక నా జబ్బలు పడిపోతున్నాయి. పొద్దున్న చేసింది, సాయంత్రానికి సొక్కదట, ఖర్మ!

శ్రీ: ఉన్నదాంట్లోనే కలో గంజో మనతోపాటే తిని తిరిగితే మనకింత బాధ లేకపోను.

శా: ఒక్క తిండివిషయంలో నేనా? అస్తమానం ఆయన చెప్పే లొలాయి కబురు వినలేక చచ్చిపోతున్నాను. మీకేం పగలంతా ఆఫీసుకన్నా వెళ్ళివస్తున్నారు.

శ్రీ: నా సుఖం మండినట్టేవుంది. ఈ పదిహేను రోజులూ ఊళ్లోవున్న దోమలన్నీ నన్నే పీక్కుతింటున్నై. దోమతెర లేనిదే నిద్ర పట్టదని, నా తెర కాస్తా లాక్కుని పడుకుంటున్నాడు. ఛీ, మర్యాదకు అంతులేదు.

శా: యీ మనిషికి మంచి, చెడ్డ యేమాత్రం లేదు. తనకొక్కలసిన వన్నీ అడిగి మరీ జరిపించుకుంటున్నాడు. అంత అలవాటున్న వాడయితే భోజనం అయ్యాక అలా బజారుకు వెళ్ళి ఒక కిల్లీ వేసుకురాగూడదూ. రెండుపూటలా తమలపాకులకు సున్నంరాసి ఇవ్వలేక నా చేతులు పడిపోతున్నై.

శ్రీ: అందుకే బాగా ఆలోచించి, ఒక మంచి వుపాయం కనిపెట్టాను.

శా: దేనికి?

శ్రీ: కుటుంబయ్య బాబాయి తక్షణం ఇక్కడినుంచి మకాం మార్చివేయటానికి.

శా: నిజంగా? ఏమిటండీ అది?

శ్రీ: చెప్పుకో చూదాం.

శా: అబ్బ. చెబుదురూ ఊరికే చంపక.

శ్రీ: చూస్తూ వుండు. కొన్ని నిమిషాల్లో నీకే తెలుస్తుంది అదుగో మాటల్లోనే బాబాయ్ కూడా వచ్చేస్తున్నాడు.....యేం బాబాయి ఎక్కడికో వెళ్లావుట.

కు: అవును శ్రీరాములూ. మధ్యాహ్నం పూట బొత్తిగా తోచటం లేదని మీ ఆఫీసు దగ్గర షాపులో నాలుగు కథల పుస్తకాలు తీసుకువస్తున్నాను. నీ తాలూకని మాట వరసగా చెబితే, నా దగ్గర ససేమిరా డబ్బు తీసుకోనన్నాడు, కొట్టువాడు. సరే, యేంచేయను? పుస్తకాలు నాలుగూ చంకను పెట్టుకు వచ్చాను.

శ్రీ: పోనిలే బాబాయ్, ఆ కొట్టువాడు నాకు బాగా తెలిసినవాడేలే.

పోస్ట్ మాన్! ...టెలిగ్రాం సార్.

శ్రీ: ఎవరికి?...నీకే బాబాయ్, నీపేర వచ్చింది. చించి చూడు.

కు: నాకు టెలిగ్రాం యేమిటి శ్రీరాములూ, ఏదీ. యిలా యివ్వు.

శా: యేమిటండీ. టెలిగ్రాం? ఎక్కడ్నించి?

కు: శ్రీరాములూ-యిప్పుడు కర్నూలు వెళ్ళే బండి యేదయినా వుంటుందా?

శ్రీ: యెందుకు బాబాయ్, అసలు యేమిటా టెలిగ్రాం?

కు: మా పిన్నికి సుస్తీ ఎక్కువగా వుందిట. నా కోసం ఒకటే కలవరిస్తోందిట.

శ్రీ: అయ్యో పాపం. యింకో యిరవై నిమిషాల్లో కర్నూలు వెళ్లే ప్యాసింజరు వుంది బాబాయ్.

శా: ముందు భోజనం కానివ్వండి.

కు: కాదమ్మాయ్. ముందు నేను యింటికి వెళ్ళాలి. నా సంచీ యివతల పడేయ్ శ్రీరాములూ, రిక్షా పిలువు.

శా: అయ్యో. అప్పుడే వెళ్ళిపోతారా? యింకా నాలుగు రోజులు వుంటారనుకున్నాం.

కు: ఉందును అమ్మాయ్. యింట్లో దానికి ప్రాణం మీదికి వచ్చిందిగా. మరి! యేం అనుకోకండి. ఈసారి వచ్చినప్పుడు యిక్కడే దిగుతాలే వెళ్ళొస్తాన్రా...

శ్రీ: అమ్మయ్య! బాబాయ్ వెళ్ళిపోయాడు. టెలిగ్రాం-మంత్రం మీద ఘాటుగానే పనిచేసింది. అతిథి శ్రీ మహావిష్ణువు అనేమాట నిజమేనేమోగాని శారదా, కుటుంబయ్య బాబాయ్ లాంటి అతిథి పగవాడికి కూడా వద్దు. ★

## న్యూఢిల్లీ లేఖ

(6-వ పేజీ తరువాయి)

ప్రకటించేవాడు; హిందువులతో తమకు పొత్తుకుదరడం అసంభవమని చెప్పేవాడు. స్వతంత్ర పాకిస్తాన్ ఏర్పడి తీరాలనే వాదం చేసేవాడు. అకైనే అంటే జిన్నాకు తీవ్ర అవిశ్వాసం; అప్పటి వైస్రాయి లార్డ్ మౌంట్ బాటెన్ను కూడా విపరీతంగా ద్వేషించేవాడు. మౌంట్ బాటెన్ పండిత్ నెహ్రూకు నమ్మిన బంటు అని వ్యాఖ్యానించేవాడు. 1947 జూన్ 24 తేది నా డైరీలో ఇలా వ్రాసుకున్నాను:

"ఇండియా, పాకిస్తానుగా భారతదేశ విభజన కార్యక్రమం మౌంట్ బాటెన్ ఆశ్చర్యకర వేగంతో సాగిపోతున్నది. ఇంత వేగంగా ఈ పని కొనసాగించడం చివరకు భయంకరమైన పరిణామాలకు దారితీసి తీరుతుంది. ఉభయ అధినివేశాలమధ్యా అత్యంత సన్నిహితమైన సహకారం వుంటేనే గాని ఈ కొత్త సమస్యలను పరిష్కరించుకోవడం సాధ్యపడదు. సన్నిహిత సహకారం లేని పక్షంలో భారత ఉపఖండంలో దారుణమైన అశాంతి ఘోరమైన రక్తపాతం తప్పవు."

* * * *

ఇదే గ్రంథంలో మరోచోట ఫీల్డు మార్షల్ మౌంట్ గొమెరీ ఇలా వ్రాశాడు:

"మౌలానా అజాద్ తో మాటాడుతూండగా ఆయన తన దుబాసీతో బ్రిటిష్ సేనల ఉనికి విషయమై ఏదో ప్రసావించడం నాకు వినబడింది. నేనూ ఉర్దూ మాట్లాడగలనని మౌలానా సాహెబ్ కు తెలియదు. ఎప్పుడో 1910 లోనే నేను ఉర్దూభాషలో ఒక పరీక్ష ప్యాసైనాను కూడా. భారతదేశం నుంచి బ్రిటిష్ సేనలు నిష్క్రమించాలని అందరూ ఏకకంఠంతో కోరుతున్నారు కదా మీరు కూడా ఆ వాదనను బలపరుస్తారా అని అజాద్ ను ప్రశ్నించాను. ఔననే ఆయన ఖండితంగా బదులు చెప్పారు. అంత ఖండితంగా బదులు చెప్పినందుకు ఆయనకు నా హార్దాతిశయం వ్యక్తపరిచాను. బ్రిటిష్ సేనలను దేశంనుంచి తక్షణమే తరలించడమే మీ అభిమతమా అని తిరిగి ప్రశ్నించాను. వారు కోరుతున్నది అదే అయితే వెంటనే నిరభ్యంతరంగా తరలించివేసాముని కూడా స్పష్టపరిచాను. మౌలానా అజాద్ నా మాటలకు కొంత భయవిహ్వలుడై "అలా కాదు—ఇప్పటిప్పుడే అలా చేయవద్దు" అన్నారు. పోనీ సైన్యంలో పనిచేస్తున్న బ్రిటిష్ ఉన్నతోద్యోగులను పంపించివేయమంటారా అన్న ప్రశ్నకు కూడా మౌలానా సాహెబ్ పైవిధంగానే సమాధానం ఇచ్చారు.

ముస్లింలు తమపై హిందువుల పరిపాలన సాగిస్తామంటే చచ్చినా ఒప్పుకోరని మహమ్మదాలీ జిన్నా తన సంభాషణలో స్పష్టపరిచాడు. హిందూ ముస్లిం సఖ్యత అసంభవమని కూడా తేల్చేశారు. మీరు అలా ఎందుకు భావిస్తున్నారని ఎదురుప్రశ్న వేస్తే ఆయన ఇచ్చిన సమాధానమేమిటో తెలుసా? ఈ ఉభయవర్గాలకూ ఏవిధంగా పొత్తుకుదురుతుంది-హిందువులు గోవును పూజిస్తారు-నేను భక్షిస్తాను అని బదులు చెప్పాడు! బ్రిటిష్ సేనల నిష్క్రమణే జరిగితే, దేశం అంతర్యుద్ధం తప్పదని కూడా హెచ్చరిక చేశాడు జిన్నా. మొత్తంమీద భారతనాయకులతో జరిపిన ఈ సంభాషణలు నాకు ఎంతో సహాయపడవనే చెబుతున్నాను. బహిరంగ ఉపన్యాసాలలో విరుద్ధంగా ప్రసంగిస్తున్నప్పటికీ, భారతదేశంలో బ్రిటిష్ సేనలు మరికొంతకాలంపాటు ఉండి తీరాలనే అందరూ వాంఛిస్తున్నట్లు నాకు అర్థమైంది." ★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



మధుపము
—ఫొటో: ఆర్. ఉదయభాస్కర్, రాజమండ్రి]

# No two watches agree



It is baffling to the skilled technicians as to why two watches do not agree, and it is equally perplexing to Anthropologists and Psychologists why people look different and behave differently inspite of identical conditions.

It is in this context we advise a study of the Andhras, their liking and proclivities, their customs and traditions

ANDHRA PATRIKA is tied up with Andhra Renaissance, the land and the people. Poets, Politicians and Historians are watchfully studying our ceaseless efforts to interest Andhras wherever they are. And they too are taking interest.

And why?

This question has been answered by the most discerning advertiser who is selling his products to the people who have confidence in us.

*Member A. B. C.*

ANDHRA PATRIKA

6 & 7, THAMBU CHETTY STREET,

MADRAS-1.